The one and only Magazine devoted to Humour & Music

# హాసం

హాస్య-సంగీత పత్రిక

1-15 మే 2002

పేజీలు: 68+8

వెల: రూ.10/-

లోపలి పేజీల్లో

ఆత్రేయ స్పెషల్
+
కలర్‌లో పాటల పుస్తకాలు









# 'హాసం'

సంచికను ఆనందంగా తదేక దీక్షతో
తిలకిస్తున్న
చిత్ర, కవితాకృష్ణమూర్తి, కుమార్‌సాను

'హాసం'
హాస్య-సంగీత పత్రిక
Also available on net - www.haasam.com

# ఇవీ సంగతులు

## హాస్యం - సంగీతం



**ఫొటో కర్టసీ :**
65వ పేజీ - సంజయ్‌కిషోర్






సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా
'మౌనమేలనోయి'
'అందం'
సినిమా పాటల పుస్తకాలు
'సెంటర్‌స్ప్రెడ్'లో

8 పేజీల ప్రత్యేక కానుక: ఆత్రేయ సినీ గీతాలు

ముఖచిత్రం: నాగార్జున, శ్రేయ - 'సంతోషం' చిత్రంలో




పాత పాటల పరిచయం మాకొక తియ్యని జ్ఞాపకం. ఎస్.వరలక్ష్మి, ఎ.కోమల, జమునారాణి గార్ల పరిచయాలు వ్రాయండి. అలాగే పైముగ్గురు గాయనుల పాటలు కేసెట్ల రూపంలో రావడానికి - హెచ్.ఎం.వి వారికి తెలియజేయండి.

-సి.హెచ్.వి.ఆర్.కృష్ణ, హైదరాబాద్.

"హాసం" 1-15 ఏప్రిల్ 2002 సంచిక చాలా బాగుంది. ఉగాది స్పెషల్‌గా ఇచ్చిన బాపుగారి కార్టూన్లు బాగున్నాయి. ఎ.ఎం.రాజా గారి గురించి పి.బి.శ్రీనివాస్‌గారు రాసిన వ్యాసం ఈ సంచికకే హైలెట్. చివరగా ఇచ్చిన కీ॥శే॥ ఎ.ఎం.రాజాగారు గానం చేసిన పాటలు, కోదండపాణిగారు సంగీత దర్శకత్వం వహించిన గీతాలను అందించి నందుకు అభినందనలు. హాస్య- సంగీతాలకు సంబంధించిన మహనీయులపై వ్యాసాలు, పాటలు ఇవ్వడం "హాసం"కే చెల్లింది.

-ఎం.మాల్యాద్రి, కావలి.

ఏ.ఎం. (అతిమృదు స్వభావి) రాజాస్మృతికి పి.బి.శ్రీనివాస్ అక్షర నివాళి (ఏప్రియల్ 1-15 'హాసం' సంచిక) నా యీ రెండు మాటలకు ప్రేరణ.

ఏనాటిమాట! దాదాపు ఇరవై ఏళ్ళ క్రితం ఆంగ్ల పత్రిక "స్క్రీన్" కోసం మద్రాస్‌లో పెండ్యాల వారితో ఇంటర్వ్యూ జరిపి వచ్చిన రోజును కుంటాను, యువ మిత్రుడు, ఆనాటి సినీ రచయత యడవల్లి ఒక సూచన చేశాడు. ఏ.ఎం.రాజా. గారిని కూడా ఇంటర్వ్యూ చేయ కూడదా అని. సరే అన్నాను. ఫోన్ చేసి, హుటాహుటిన రాజాగారింటికి వెళ్ళాం. మా రాకకు కారణం తెలుసుకుని, చిరునవ్వుతో, "నేనిప్పుడు లైమ్‌లైట్‌లో లేనుగదండీ. నా గురించి రాయడానికేముంటుంది? దయచేసి ఆ విషయం మరిచిపోండి. నా ఆతిథ్యం స్వీకరించండి" అంటూ మా ప్రయత్నాన్ని విరమింప జేశాడు. ఎంత మృదుభాషి, ఎంత ప్రియభాషి!

రాజా నిరాడంబరత్వానికి, వినమ్రతకు ఆ సంఘటన నిలువుటద్దం పడుతుంది. నాటికీ నేటికీ పబ్లిసిటీ కోసం ప్రాకులాడే సినీ జనంతో పోలిస్తే ఏ.ఎం.రాజాది ఎంతటి ఉదాత్త వ్యక్తిత్వం! హేట్సాఫ్ టు దట్ గ్రేట్ అండ్ నోబుల్ సోల్!

-పి.ఎస్.రావు, విజయవాడ

నేను సంగీతం టీచర్‌గా ( ది ఇండో ఇంగ్లీష్ హైస్కూల్, కుకుట్‌పల్లి)లో గత 10 ఏళ్లుగా పని చేస్తున్నాను. ఈ మధ్య మీ హాసం పత్రిక చూడడం జరిగింది. హాస్యం సంగీతం అంటే ఇష్టపడని మనిషంటూ ఉండరు. ఆ రెండూ ఇతివృత్తాలుగా నిర్వహిస్తున్న హాసం పత్రిక జనాదరణ పొందు తున్నది. ముఖ్యంగా నాలాంటి సంగీతాభి మానులకు ఎంతో విజ్ఞానదాయకం.

-ఎం.సుహాసిని, హైదరాబాద్

ఏప్రిల్ 1-15 హాసంలో "ఇన్ని ప్రసాదించిన దేవుడు నాకిలా శాపమిచ్చాడా...!?" వ్యాసం బాలుగారి ఉత్తమ సంస్కార హృదయానికి నిదర్శనం. చేసిన మేలును మరిచిపోయే వారే అధికంగా వుండే ఈ రోజుల్లో తన అభివృద్ధికి కారకులైన ఎస్.పి.కోదండపాణి గారి పట్ల కృతజ్ఞత ప్రదర్శించడంతో పాటు "నా శరీరం, శరీరం, ఆత్మ అన్నీ కోదండపాణిగారే" అని ప్రకటించడం, "కోదండపాణి ఆడియో ల్యాబ్ నా దేవుడి గుడి" అని పేర్కొనడం వారి గొప్పతనాన్ని చెప్పకనే చెపుతూ వున్నాయి.

బాలు గారు, వారి కుటుంబ సభ్యులే కాదు తెలుగు వారు... సినీ పరిశ్రమ, సినీ సంగీత ప్రపంచం యావత్తూ కోదండపాణి గారికి ఋణ పడి వుంది. ఎందుకంటే సినీ సంగీత సరస్వతి ముద్దుబిడ్డ బాలుగారిని అందించి ... దాదాపు నాలుగు దశాబ్దాల నుంచి సినీ సంగీత అభిమానులను అలరించి... ఆనందింప జేసినందులకు! నేను ఎక్కడో చదివినట్లు "ఘంటసాల గారు భోంచేశాక ఎంగిలి చెయ్యి విదిలిస్తే అందులోంచి పడిన ఒక మెతుకును నేను" అని వినమ్రతను ప్రకటించుకున్న బాలు... హ్యాట్సాఫ్ శ్రీపతి పండితారాధ్యుల బాలసుబ్రహ్మణ్యం గారూ... హ్యాట్సాఫ్!!

-ఐ.ఎల్.ఎన్.చంద్రశేఖర్, కడప.

ఏప్రిల్ 1-15 సంచిక "హాసం"లో ఎ.ఎం. రాజాగారి గురించి చదివాక ఆయన కంఠం మరల వినిపించేలా వ్రాసారు. కోదండపాణి సంగీత దర్శకత్వంలో వచ్చిన కొన్ని పాటలే ప్రచురించారు. అన్ని హిట్ సాంగ్స్ ఇచ్చిన "మంచి కుటుంబం" చిత్రంలో పాట ప్రచురించలేదు.

-సోమేశ్వరరావు, విజయవాడ

అన్నీ ఒకేసారి ప్రచురించటం సాధ్యమా!? ఈ ఒక్క వర్ధంతితో ఆగిపోం కదా?! అందుకే ముందు ముందు సంచికలకోసం కొన్ని దాచుకున్నాం.

-ఎడిటర్

'హాసం' పత్రిక ద్వారా, ఓల్డ్ క్లాసిక్స్ గురించి తెలుసుకునే అవకాశం కలిగినందుకు చాలా సంతోషంగా ఉన్నది. నేటి తరమైన మాకు "కంఠాభరణం" గురించి ఆదిభట్ల నారాయణ దాసు గారి గురించి తెలియచేసిన మీరు ఎంతో అభినందనీయులు. ఆపాత మధురాలలో సినీ సంగీతం (పాత పాటలు) సాహిత్యం గురించి తెలియజేస్తున్న వివరాలు ఎంతో బాగుంటు న్నాయి. పూర్వం విజయచిత్రలో కేవలం సినిమాలకు, కళాకారులకు సంబంధించిన వివరాలు మాత్రమే ఉండేవని మా పెద్దవాళ్ళు చెప్పేవాళ్ళు. ఇప్పుడు "హాసం" పత్రిక ద్వారా కేవలం పాత సినిమా పాటల పుట్టుక, మాధుర్యం తెలుసు కోవటమే కాక మన ఉత్తమోత్తమైన సాహితీ స్రష్టల గురించి కూడా తెలుసుకుని ఆనంద పడు తున్నాం. ప్రారంభంలో ఉన్న విలువలని, ప్రమాణాలని కలకాలం ఈ పత్రికలో కాపాడతారని ఆశిస్తున్నాను.

-ఎం.శుష్మ, హైదరాబాద్

"హాసం" తొలిపత్రిక నుంచీ విడవకుండా చదువుతున్న వారిలో ఒకడిని. అంచనాలకు మించి "హాసం" వెలువడటం చాలా సంతోషాన్ని కలగచేస్తోంది. అన్ని శీర్షికలు శిరశ్శిఖరాయ మానంగా ఉన్నాయి.

రావి కొండలరావుగారు నిర్వహిస్తున్న "హ్యూమరథం"లో బోండాం రామచంద్రరావు, వేళంగి, డా.శివరామకృష్ణయ్య లాటి వారి గురించి కూడా రాబోయే సంచికలలో వ్రాస్తారని ఆశిస్తున్నాము. హాస్యాన్ని పండించిన వారిలో నటీమణులుకూడా కొందరున్నారు. సురభి బాల సరస్వతి, గిరిజ, రమాప్రభ, రాధాకుమారి లాటి వారి గురించి కూడా తెలియబరిస్తే ఆ శీర్షికకు న్యాయం జరుగుతుందని నా ఉద్దేశ్యం.

పత్రికలకు "ఉత్తరక్రియలు" చేయడం నేను ఎప్పుడూ చేయలేదు. కాని "హాసం" ఆ పని నా చేత చేయించింది.

-యడవల్లి, హైదరాబాద్

సంపుటి :1 సంచిక: 15

1 - 15 మే 2002

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 15

'పంచుకున్న పాలు మంచి పెంచునన్నాడోయ్' అన్నారు ఆరుద్ర. అందుకే 'హాసం' సంపాదకీయాలలో ప్రవచనాలకంటే అనుభూతులు పంచుకోవడాలే కనబడతాయి. హాస్య, సంగీతాభిమానులంతా ఒక కుటుంబంగా ఏర్పడినప్పుడు ముచ్చట్లు చెప్పుకోవడం సహజమే కదా!

సంగీతం గురించి దేశంలోని ఇతర భాషల్లో కూడా పత్రికలు వస్తున్నాయా? వాటి మధ్య మన పత్రిక స్థానం ఏమిటి? అని సంగీతాభిమానులుగా తెలుసుకోవాలనే కుతూహలం సహజం. శాస్త్రీయ సంగీతం గురించి వెలువడే పత్రికలు చాలా తక్కువ మందిని దృష్టిలో పెట్టుకుని వెలువరించేవి కాబట్టి వాటిని పక్కకు బెట్టి చూడబోతే ఇంగ్లీషులో 'రికార్డ్' వంటి రెండు మూడు పత్రికలు కనబడుతున్నాయి. 'రేవ్' అనే ఒక కొత్త మాసపత్రిక చేరింది ఇటీవలే. అవన్నీ 'elitist' పత్రికలే. విషయమూ, రేటూ కూడా సామాన్యునికి అందనివే.

ప్రజలందరికీ తెలిసిన సినిమా సంగీతం గురించి వేరే భాషల్లో పత్రికలు వస్తున్నాయా? జాతీయ స్థాయిలో ప్రజాదరణ పొందే తెలుగేతరులైన పాప్యులర్ గాయక, గాయనీమణులు "హాసం" కంటబడితే ఎలా స్పందిస్తారు? అన్న ప్రశ్న ఉదయించి మనసును ఊరిస్తూ ఉంటుంది.

గత పక్షంలో ఓ అవార్డు ఫంక్షన్‌లో ఆ ప్రశ్నకు సమాధానం మాకు దొరికింది . కుమార్‌సాను, చిత్ర, కవితా సుబ్రమణ్యం, ఆమె భర్త - శాస్త్రీయ సంగీతజ్ఞుడు ఎల్.సుబ్రమణ్యం "హాసం" చూడడం తటస్థించింది. సాధారణంగా సెలబ్రిటీలకు మనమేదైనా అందించినప్పుడు చిరునవ్వులతో స్వీకరించి, ఆ తరువాత సీట్లలో వదిలి వెళ్ళిపోవడం కద్దు. కానీ ఆ రోజు జరిగినది వేరు.

చిత్ర అయితే అవార్డు తీసుకునేటప్పుడు కూడా మన 'హాసం'ని వదలలేదు! 'మా జిక్కి గురించి బాగా రాశారే!' అంటూ మురిసిపోయారు. కవితా సుబ్రమణ్యం అయితే 'నాకు తెలుగు చదవటం రాదు. మా ఆంటీ చేత చదివించుకుని విని ఆనందిస్తాను. నాకు ప్రతి సంచికా పంపండి' అన్నారు. చిత్రకు ఆంటీల అవసరం లేదు. 'నేను తెలుగు చదువుతాను. ఇదిగో నా అడ్రసు. రెగ్యులర్‌గా పంపండి' అని తన విజిటింగ్ కార్డిచ్చి మరీ చెప్పారు. ఇవన్నీ విన్న కుమార్‌సానూ 'మా ఇంట్లో తెలుగు ఎవరికీ రాదు. చదవనూ లేను. చదివించుకోనూ లేను. కానీ పత్రిక తిరగవేస్తేనే తెలుస్తోంది దీని స్థాయి ఏమిటో! ఇంత మంచిపత్రిక సినీ సంగీతం గురించి విస్తారంగా రాయడం హర్షదాయకం" అన్నారు.

వీరందరూ జాతీయ స్థాయిలో ఎన్నో రకాల పత్రికలు చూసి వున్నవారే! మద్రాసులో స్థిరపడ్డ కళారంగానికి చెందిన ప్రముఖులు కూడా "హాసం"ను ఆదరిస్తున్నారు. అభిమానిస్తున్నారు. అది సహజమే కదా అని సరిపెట్టుకున్నా, ఇలా విభిన్న నేపథ్యం గలిగిన వారు కూడా "హాసం"ను అపురూపంగా చూసినప్పుడు కలిగే ఆనందం వేరే కదా!

ఇంటా గెలిచి, రచ్చా గెలిస్తే అంతకన్నా కావలసినదేముంది!

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82



# పతీ రక్కుబాయి



### వారణాసి రామకృష్ణ



దాదాపు పదిహేడేళ్ళక్రితం... "పేరులోనే ముంది" అన్న హాస్య కథ రాసి పంపితే ఒక మేగజైన్ వారు అచ్చేశారు. అయితే టైటిల్‌లో 'నేము' అనే అక్షరాలకి ఇన్‌వర్టెడ్ కామాస్ పెట్టి మరీ ప్రచురించారు. చూశాక 'అరె! భలే తమాషా చేశారే - రచయితనైన నాకే ఈ ఐడియా రాలేదని సంబరపడి - ఈ పని చేసిందెవరానని ఆరా తీస్తే ఇంకెవరు రాజాగారే! అప్పట్నించి ఆయనతో పరిచయం!

సాహిత్యంలో అప్పుడప్పుడే బుజ్జి అడుగులు, బుల్లిబుల్లి నడకలు నేర్చుకుంటున్న నేను ఆయన నుండి ఎన్నో 'చిన్న' విషయాలని ఎంతో 'పెద్ద'గా తెలుసుకున్నాను! ఇలా ఎందుకంటున్నానంటే - మనకి సాధారణంగా తట్టని అతి చిన్న విషయాన్ని ఆయన చెప్పినప్పుడు ఆ విషయం ఎంత 'పెద్ద'దో మన మనసుకర్థం అవుతుంది!

ఆ మధ్యోసారి ఫోన్‌లో మాట్లాడుతూ "పతీరక్కుబాయి" టైటిల్‌కి సరిపడా కథ రాయండి అనిచెప్పారు. టైటిల్ వింటున్నప్పుడే హాస్యానుభూతికి లోనయ్యాను.

ఇప్పటివరకూ దాదాపు నూట ఇరవై కథలు అన్ని దినవార మాస పత్రికల్లో ప్రచురితమయ్యాయి. కానీ ఎడిటర్‌గారు సూచించిన కథకి అనుగుణంగా కథ రాయడం మాత్రం ఇదే ప్రప్రథమం.

రచయితగా ఇదో కొత్త అనుభూతి! ఇంత మంచి అవకాశాన్ని నాకిచ్చిన రాజాగారికి కృతజ్ఞత తెలియజేసుకుంటూ - పాఠకుల స్పందన ఆశిస్తూ

-వారణాసి రామకృష్ణ,

110 నేతాజీ నగర్, ఇసిఐఎల్, హైదరాబాద్ - 62

మందాకినికి కపాలేశ్వర్రావంటే ఇష్టం! అతగాడేమో బుద్ధావతారం! దారికి ఎలా తెచ్చుకోవాలో మందాకినికి అర్థం కావట్లేదు.

ఆ రోజు ఆఫీసు అయ్యాక బస్టాపులో

"సంగంలో 'నేను లేక - నువ్వు లేక' సిన్మా వంద రోజుల్నించి ఆడుతోందట! అవార్డు కూడా గ్యారెంటీగా వస్తుందట!"

వెళదాం అంటాడేమోనని ఉత్సాహంగా చెప్పింది.

"భలే వాళ్ళు మీరు! అసలు సిన్మాకి 'నేను లేక నువ్వు లేక' అని పెడితే థియేటర్లో నేనూ లేక నువ్వు లేక ఇంకెవరూ ఉండక ఎట్లా చెప్పండి? నాకసలే భయం" అనేసి బస్సెక్కి వెళ్ళిపోయాడు.

రెండు నెలలు గడిచాక మళ్ళీ మందాకినే

"దీపక్ థియేటర్లో "నేను లేను - నువ్వు లేవు" అనే సిన్మా ఆడుతోందట! అందరూ ఆ సిన్మా చాలా బావుందని చెబుతున్నారు!" అంటూ ఆశగా అతన్నే చూస్తూ అడిగింది.

"బావుందని చెబుతున్నారా? ఇంతకీ సిన్మా పేరు ఏంటన్నారు?"

"నేను లేను -నువ్వు లేవు" -

వినగానే కపాలేశ్వర్రావు "హాఁ!!" గట్టిగా నిట్టూర్చి "నేను లేను. నువ్వు లేవు! ఏం పేరండి ఇది! ఈ సిన్మా చూసేకంటే ఎవ్వరూ లేకుండా ఉండే ప్రదేశం చూసుకుని జపం చేసుకోవటం బెటరు!" అన్నాడు సీరియస్‌గా.

"మీకు సిన్మాలంటే ఇష్టం లేదా?" నిరాశగా అడిగింది.

కపాలేశ్వర్రావు వెంటనే కళ్ళు పెద్దవి చేసి "ఏమో! నా చిన్నప్పుడు మా బామ్మతో కలిసి బోలెడన్ని చూశానట!" అన్నాడు.

"ఏ సిన్మాలు?"

కపాలేశ్వర్రావు వెంటనే కళ్ళు మూసుకుని రెండు చేతులు జోడించి "భక్తపోతన, దక్షయజ్ఞం, భూకైలాస్, సతీసక్కుబాయి" చెప్పి కళ్ళు తెరిచి

"మీకు తెలుసోలేదో సక్కుబాయి పేరన్నా, సతీసక్కుబాయి సిన్మా అన్నా నాకు బోలెండత ఇష్టం!" చెప్పేసి మళ్ళీ కళ్ళు మూసుకుని లిస్ట్ మొదలెట్టారు. "సతీఅనసూయ", సహస్రశిరచ్ఛేద అపూర్వ చింతామణి..."

పూర్తిగా వింటే తన తల పగిలి వెయ్యి చెక్కలవుతుందని మందాకిని ఆటో ఎక్కేసి హాస్టలు చేరుకుంది. "ఏంటలా ఉన్నావ్? నీ ప్రేమింకా పండలేదా?" అడిగింది రూమ్మేటు వర్ధని.

"అంతా నా కర్మ! నాది పండే ప్రేమ కాదు. ఎండే ప్రేమ!" కోపంగా జరిగిందంతా చెప్పింది.

ఆ మర్నాటి నుంచి కపాలేశ్వర్రావుని అస్సలు కదపకూడదని బస్టాపులో బుక్కు చదువుకుంటుంటే

అతనే "మందాకిని గారూ" పలకరించాడు.

ఏంటన్నట్టు కోపంగా చూసింది.

"హిహిహి" అని నవ్వేడు.

పాపం! ప్రేమించానని చెప్పటానికి మొహమాట పడుతున్నాడనుకుని.

"పరవాలేదు.... చెప్పండి!" అన్నది.

మాట్లాడకుండా సిగ్గుతో ఒళ్ళంతా వంకర్లు తిరుగుతుంటే

"ఛీ! మగాడికి ఇంత సిగ్గేంటి చండాలంగా!" అనుకుని "ఏదైనా మాట్లాడు కపూ!" ముద్దుగా అన్నది.

"అబ్బే... మరేం లేదు" అన్నాడు మలేరియా జ్వరం వచ్చినవాడిలా మరింత వణికిపోతూ!

మందాకినికి కోపం వచ్చి "ప్రేమించానని చెప్పడానికంత భయం ఎందుకండి?" అన్నది.

వెంటనే అతను తెగ ఆశ్చర్యంగా "అరె... మీకెలా తెలుసు?" అన్నాడు.

"నా బొంద! ప్రేమ గురించి నాకెందుకు తెలీదు? అనుకుని - "చెప్పండి! చెప్పండి!" తొందరపెట్టింది.

"సరిగ్గా సక్కుబాయి కూడా ఇదే మాట అన్నది!" అన్నాడు మరింత ఆశ్చర్యంగా!

"సక్కుబాయెవరు?" ఈసారి మందాకిని ఆశ్చర్యపోయింది.

"నాక్కాబోయే పెళ్ళాం! మా నాన్నే ఓ సంబంధం చూసి 'ఒరే కపాలం! పిల్ల బావుంది! చేసుకోను గీసుకోనూ అని గారాలు పోయేవో బద్దలు కొడతాను నీ కపాలం అని అన్నాడండి!' అసలు నేను పేరు వినగానే ఇష్టపడ్డానండీ! వచ్చే నెల్లోనే మా పెళ్ళి! మీరు బెస్టు ఫ్రెండు కదాని ఆ సంగతి ముందుగా మీకు చెబుదామని "

మందాకినికి కళ్ళు తిరిగినట్టునిపించి ఇంకేమీ వినకుండా హాస్టల్ కొచ్చేసి దిండులో మొహం పెట్టుకుని బోర్లా పడుకుని వెక్కి వెక్కిఏడ్చింది. కాసేప య్యాక వర్దని వచ్చి "చూడు మందాకినీ! నీకు కపాలం మీద ఇన్నాళ్ళు ప్రేమ ఉండేది! ఇప్పుడది కోపంగా మారుతుంది! అయితే అతని పెళ్ళయ్యాక నీ కోపం కాస్తా మళ్ళీ తుస్సుమని పోతుంది తెలుసా?" అన్నది.



మందాకిని చివ్వున లేచి "ఎందుకూ?" ఆశ్చర్యంగా అడిగింది.

"సక్కుబాయి మా మేనమామ కూతురు!"

"అయితే?" మరింత ఆశ్చర్యపోయింది మందాకిని.

"అయితే లేదు గియితే లేదు! నీ మాజీ ప్రేమికుడి పాట్లు ఆ దేముడికే ఎరుక! నానా బాధలు పడతాడు!" పడి పడి నవ్వుతూ వర్దని అంటుంటే.

"అవును పడాల్సిందే! లేకపోతే నన్ను కాదంటాడా?" అనేసి ఏదో గుర్తొచ్చినదానిలా

"ఇంతకీ సక్కుబాయి బాగా కోపిష్టా? గయ్యాళిదా?" ఆత్రుతగా అడిగింది మందాకిని. కాదని తలవూపింది వర్దని. "కాస్తమెంటలా?" అని మందాకిని ఆసక్తిగా అంటుంటే నవ్వు ఆపుకుని "అవేమీ కాదు" అని చెప్పింది.

మందాకిని మరింత ఆశ్చర్యానికి లోనయి "మరయితే ఏంటీ ప్రాబ్లెం?" అడిగింది.

"పెళ్ళవనీ ముందు... తర్వాత తెలుస్తుందిగా" అంటూ దాటేసింది విషయాన్ని

పెళ్ళయిన పది రోజులకి కపాలేశ్వర్రావు ఆఫీసుకొచ్చాడు. అతన్ని నఖశిఖపర్యంతం పరీక్షగా చూసింది మందాకిని. చేతుల మీద చెంపల మీద పెద్ద పెద్ద గాయాలు. గాట్లు! అడుగుదామని ఊరుకుంది. మర్నాడు చూస్తే.... ఈసారి మొహం మీద గాట్లు! బుగ్గల్ని ఎవరో బలవంతంగా నొక్కేసినట్లు. నుదిటిమీద ఘోరంగా రక్కేసినట్టు గుర్తులు!

ఆఫీసయ్యాక బస్టాపులో ఆమె "కపాలం గారూ! కాస్సేపలా పార్కులో కూర్చుని వెళదామా?" అడిగే సరికి అతను గబగబా తలవూపి "పదండి! పదండి!" అన్నాడు.

పార్కులో పల్లీలమ్మే వాడొస్తే మందాకినీ ఇద్దరికీ తీసుకుని, ఒక పొట్లం ఇస్తే

"నాకొద్దండీ! ప్లీజ్!" అన్నాడు మొహం చిట్లిస్తూ!

"అదేం?" ఆశ్చర్యంగా అనేసరికి "పల్లీలు పప్పులు తింటే గాట్లు, గాయాలకి చీము పడుతుందని మా బామ్మ చెప్పిందండి!" బేలగా అన్నాడు.

"కపాలం! ఏమీ అనుకోకపోతే - అసలు ఒంటి మీద ఇన్ని గాట్లు, గాయాలూ ఏమిటి? కొంపదీసి హనీమూన్ నుండి వస్తుంటే ఆక్సిడెంట్ అయిందా?" కాదన్నట్టు తల అడ్డంగా ఊపాడు.

"బాత్రూమ్‌లో జారి పడ్డారా?"

"అబ్బేలేదు!"

"మరి ఇన్ని గాట్లు, గాయాలు - ఆఁ జూకెళ్ళి చింపాంజీకి బొరుగులు పెడదామని దగ్గరి కెళ్ళినట్లున్నారు! కదూ-"

"అవేమీ కాదు మందాకినీ" బరువుగా చెప్పి "అసలు రోజూ రాత్రిళ్ళు పడుకునే ముందంతా బానే వుంటుంది. తెల్లారి లేచి చూసేసరికి గాట్లు!" బాధగా చెప్పాడు.

"ఒక వేళ రాత్రిళ్ళు కిటికీలోంచి పిల్లులు దూరి మీద పడి రక్కేస్తున్నాయేమో?"

"అబ్బే - కొత్తగా పెళ్ళయింది కదా - కిటికీలు వేసుక్కుని పడుకోరా పిచ్చి సన్నాసీ అని మా బామ్మ రోజూ గదిలోకెళ్ళేముందు గుర్తు చేస్తుందండి!"

"అసలు రాత్రిళ్ళు ఏదైనా అలికిడి అయితే నీకు మెలకువ రాదా?"

"అస్సలు రాదు! ఏంటో చిన్నప్పట్నించి అంతే! మొన్నోసారి అర్ధరాత్రి భూకంపం వచ్చి అందరూ పరుగులు పెట్టి పారిపోయారటగా! నాకేమీ తెలీదు! అయినా ఇవన్నీ ఎందుకని అడుగుతున్నావు మందాకినీ?" ఆశ్చర్యంగా ఆమెని చూశాడు.

"ఏం లేదు గానీ నీకు దెయ్యాల మీదా భూతాలమీదా నమ్మకం ఉందా?"

అనగానే కపాలేశ్వర్రావు భయంగా మొహం పెట్టి "అమ్మో! దెయ్యం... భూతాలునా?" అన్నాడు.

"అవును కపాలం! కొంపదీసి రాత్రిళ్ళు కొరివి దెయ్యం కానీ నిన్నలా రక్కేస్తోందేమోనని అనుమానంగా ఉంది!"

"అయ్యబాబోయ్! ఇప్పుడెలా మందాకినీ?" వణికిపోతూ ప్రశ్నించాడు.

"నవ్వంతలా భయపడకు! ముందు ఏదో ఒక రకంగా ఒక రాత్రంతా జాగారం చేసి ఏం జరుగుతుందో చూడు!"

"సరే - ఈ రోజు నిద్రపోకుండా ట్రై చేస్తాను!" అంటూ అపనమ్మకంగా

చెప్పాడు.

మర్నాడు కపాలం అసలు ఆఫీసుకే రాలేదు. ఏమైందా అని ఆరా తీస్తే అత్తవారింట్లో ఉన్నాడనీ పరిస్థితి ఏమీ బావోలేదని తెలిసింది! ఆదుర్దాగా వర్ధనిని తోడుతీసుకుని వెళ్ళింది మందాకిని.

కపాలం ఒంటి మీద బనీను, చొక్కా రెండూ లేవు. ఉత్తి లుంగీ మీద ఉన్నాడు. ఒళ్ళంతా నెత్తురోడుతూ గాయాలు! ఎవరో బలంగా గోళ్ళతో రక్కేశారు!

ఆ మంటకి తట్టుకోలేక కుయ్యోముర్రోమంటూ మూలుగుతున్నాడు.

అతన్ని పిన్ని, బామ్మ మెల్లిగా ఆటోలో ఆస్పత్రికి తీసుకెళ్ళారు. మందాకిని, వర్ధని స్కూటీతో అనుసరించారు.

కపాలేశ్వర్రావు డాక్టరుతో "నిద్రరాకుండా మందు ఇవ్వండి డాక్టర్!" అన్నాడు. డాక్టరు విచిత్రంగా చూసి "నువ్వెక్కడి పేషంటవయ్యా! అందరూ నిద్రపట్టేలా మందు అడుగుతారు కానీ -" అంటూ ఇంజక్షన్ పొడవబోతే వద్దని గగ్గోలు పెట్టి కేవలం గాయాలకి మందు పూయించుకుని వచ్చేశాడు.

ఆ రాత్రి కపాలం గదిలోకెళ్ళే ముందు మందాకిని ఫ్లాస్కుతో టీ తీసుకొచ్చి "చూడు కపాలం! ఇది టాటా డబుల్ స్ట్రాంగ్ టీ! ఇది తాగితే నిద్రకి టాటా చెప్పినట్టే!" చెబుతుంటే బామ్మ వచ్చి "అదేంట్రా - రోజా గదిలో ముసుగుతన్ని నిద్రపోతున్నావా?" అనుమానంగా అడిగింది.

కపాలం చిరాగ్గా "అబ్బా - అది కాదులేవే బామ్మా" అని ఆవిణ్ణి కసిరి,

టీ కప్పు చేతిలోకి తీసుకుని.

"జీవితంలో ఇప్పటి వరకు టీ తాగలేదు మందాకినీ! ఒక ఫ్రెండ్‌గా నువ్వు ఇచ్చావని త్రాగుతున్నాను!" అంటూ విషం తాగిన లెవెల్‌లో తాగేసి గదిలోకి వెళ్ళాడు.

సక్కుబాయి అతని కోసం ఎదురుచూసి, చూసి అప్పటికే నిద్రలోకి జారుకుంది! శబ్దం కాకుండా వెళ్ళి ఆమె ప్రక్కనే చోటు చేసుకున్నాడు. కాస్సేపు మందాకిని గురించి ఆమె మంచితనం గురించి ఆలోచించాడు. మూసిన కిటికీలోంచి పిల్లి దూరుతుందేమో ఆలోచించాడు. చప్పున కొరివి దెయ్యం గుర్తొచ్చి భయపడ్డాడు. కాస్సేపటికే కళ్ళు మూతలు పడసాగాయి. కొంపదీసి కొరివి దెయ్యం ప్రభావం చేత టాటా స్ట్రాంగ్ టీ పని చెయ్యటం లేదా? అనుకుంటూ.

అప్రయత్నంగా కళ్ళు మూసుకుపోతుండగా.... అరక్షణానికి ఆరు ఆవలింతలు అమాంతం దూసుకొస్తుండగా - ఆలోచనలతో ఉక్కిరి బిక్కిరవుతుండగా - సరిగ్గా అర్ధరాత్రి గడియారం పన్నెండు కొట్టగానే-

"ఏరా రాజనాలా! ముక్కామలా! ధూళిపాళా! ఇంత ద్రోహం చేస్తారా? వేళాపాళా లేకుండా మీ వెంట వస్తే మోసం చేస్తారా?"

గట్టిగా అరుస్తూ సక్కుబాయి ఢామ్మన కపాలేశ్వర్రావు మీద పడింది.




ఒక్క ఉదుటున ఉలిక్కిపడి లేవబోయాడు. ఆమె కాలి గోళ్ళతో నొక్కేస్తూ

"వోరే నాగభూషణం! నువ్వు కాటేసే పామువిరా!" అరుస్తూ వాడిసి పట్టుకుని పిచ్చి పిచ్చిగా గోళ్ళతో బరికింది.

కపాలేశ్వర్రావ్ "అమ్మోయ్ - నాయనోయ్" అంటూ పిచ్చికేకలు పెట్టాడు.

వెంటనే సక్కుబాయి ఎగిరి అతని గుండెల మీద కూర్చుని

"నీ పాపం పండెను నేడు! నీ భరతం పడతా చూడు! నీ పాలిటి లంకిణి నేను! 'సీతాట'-కి తాటకి నేనూ!" అని పెద్దగా పాడుతూ ఒళ్ళంతా కాళ్ళు చేతులతో తంతూ కుళ్ళబొడిచింది!

కొరివి దెయ్యం పెళ్ళాంలో ప్రవేశించి రోజా ఇలా చేస్తోందని అర్థం చేసుకుని కపాలం పాపం భయంతో గజగజ వణికిపోతూ ఆమె చేతుల్లోంచి తప్పించుకునే ప్రయత్నంలో పెనుగులాడుతుంటే సక్కుబాయి మరింత రెచ్చిపోతూ.

"వోరే సత్యనారాయణా! వోరే కొటార్కర్! ఒరే చలపతిరావ్...! నా చేతుల్లోంచి తప్పించుకోవడం నీ తరం నీ బాబు తరం, నీ జేజమ్మ తరం కాదురా!" అంటూ వీపంతా బలంగా గోళ్ళతో రక్కేసింది.

కపాలేశ్వర్రావ్ భయంతో ఆంజనేయ దండకం వల్లిస్తూ ఒక్కసారిగా ఆమెని ప్రక్కకి తోసేసి మంచం మీంచి లాంగ్ జంప్ చేసి బైటపడ్డాడు.

అప్పటికే గదిలో కేకలు, అరుపులకి ఇంట్లో జనాలంతా హాహాకారాలు పెడుతూ గదిబైట నిలబడి ఉన్నారు. పోల్ జంప్ చేసి క్రింద పడ్డట్టుగా కపాలం గదిలోంచి ఒక్క ఉదుటున హాల్‌లో సోఫాలో కొచ్చి పడ్డాడు.

సక్కుబాయి తండ్రి "అల్లుడూ! దెబ్బలేం తగల్లేదా?" అనేసి ఒంటి మీదున్న తాజా గాయాల్ని బేజారెత్తుతూ చూసి "క్షమించు అల్లుడూ... మా సక్కుబాయికి రాత్రి నిద్దర్లో అన్నీ సిన్మావిలన్ల కలలే వస్తాయి! అలా వచ్చినప్పుడు పక్కనున్న వాళ్ళని గోళ్ళతో రక్కేస్తుంది! పళ్ళతో కొరికేస్తుంది. నిలువునా ఆ విలన్‌ని చీరేస్తున్నట్టు ఫీలయి పోతూ చేతికందినవి పట్టుకుని బరికేస్తుంది! ఈ పాడు అలవాటు మాన్పించాలని అసలు సిన్మాలకే పంపడం మానేశాను! అయినా అలవాటు పోలేదు! ఏం చెయ్యాలో అర్థంగాక ఇన్నాళ్ళు దాన్ని ఒక్కదాన్ని రూంలో 'నర్సింహ' సినిమాలో రమ్యకృష్ణలా పెట్టి తలుపు తాళం వేసి మేమంతా బైట పడుకునే వాళ్ళం! ఈ సంగతి పెళ్ళికి ముందు చెప్పనందుకు నన్ను క్షమించు అల్లుడూ! క్షమించు" బరువుగా చెప్పి దగ్గుకుంటూ శాలువా కప్పుకుని వెళ్ళిపోయాడు.

అంతసేపూ ముక్కుతూ మూలుగుతూ ఉన్న కపాలేశ్వర్రావు మందాకినిని చూడగానే బావురుమని చేతులు పట్టుకున్నాడు. ఆమె ఓదారుస్తూ తల నిమిరి "చూడు కపాలం! నేను నీకు బెస్ట్ ఫ్రెండ్‌ని! నీ పెళ్ళాం పాత అలవాటు మారిపోయే పరిష్కారం నీ చేతుల్లోనే ఉంది!" అనే సరికి తెల్లబోతూ చూసి పీలికలయిన గ్లాస్కో లాల్చీలోంచి ఓ పీలిక తీసి కళ్ళు తుడుచుకుని చెప్పమన్నట్టు చూశాడు!

ఆమె చెప్పింది, శ్రద్ధగా విని ఆచరణలో పెట్టాడు.

ఒక సంవత్సరం సాఫీగా గడిచింది. కానీ ఓ రోజున కపాలేశ్వర్రావు బుగ్గమీద మల్లెపూవంత సైజులో గులాబీ పువ్వులా ఎర్రగా, బుర్రగా మెరుస్తూ ఊరిస్తూ - గాటు!

మందాకిని ఆందోళనగా "ఏమైంది కపాలం మళ్ళీ బుగ్గమీద ఆ 'రక్కు' ఏంటి?" అడిగింది కపాలేశ్వర్రావు క్షణం సిగ్గుపడి తర్వాత ఇలా చెప్పాడు.

"చెలి, సఖీ, నువ్వేకావాలి - ఇన్నీ చూపించాక సక్కుబాయి 'ఇష్టం'గా 'ఆనందం'తో 'నువ్వు నాకు నచ్చావ్' అంటూ పెట్టిన ఘాటయిన ప్రేమగాటు!!"




## ఈసారి కూడా సమ్మర్ స్పెషల్‌గా...
## పిల్లల కోసమే



ఇందులో విషయమంతా ఏడేళ్ల బుడుగు ఇంకో పిల్లాణ్ణి కూచోబెట్టి చెబుతున్నట్టు సాగుతుంది. ఆ చెప్పడంలో కూడా 'త్వమేవాహం' అయిపోతూ ఉంటాడు బుడుగు. అలాడీనుని 'నువ్వు గోపాళం కొడుకివి గదూ' అని అడిగేరంటాడు. మళ్లీ థర్డ్ పర్సన్‌లోకి వెళ్లి చిన్నబూచాడు బుడుగు అంత కూడా లేడంటాడు. 'విక్రమార్కుని సింహాసనం మార్క్....' కథల్లో 'పాసార్ధి ( ఆ కథలను రమణ ఎస్.పార్థసారథి పేరుతో రాశారు.) చెప్పాడు.' అని పాత్రలతో అనిపించినట్టు అలాడీను 'గుహ దగ్గరకేనా, మా బాబాయి చెప్పాడులే' అనేస్తాడు మాంత్రికుడితో, లాంతరు ముందు గోకి 'అరె కథ ప్రకారం నువ్వు ముందు రాకూడదు పో' అని ఉంగరం గోకుతాడు - బ్రహ్మానంద లహరిలో చీమ ఓ కథ చెప్పబోయి మరోటి చెప్పి నాలుక కరుచుకున్నట్టు! ఇన్ని గమ్మత్తులు చేసినా చదివేవాడికి ఏ మాత్రం గందరగోళం లేకుండా బుడుగు చెప్పే కథ అర్థమవుతుంది.

కథ చెప్పడంలో ఫార్మాట్ తప్పినప్పుడు వెంటనే సవరించుకుంటాడు - 'అలాడీను ఓ చిన్న పిల్లవాడు. వాడు అనగనగా ఉన్నాడు' అంటూ! వర్ణనలు పెద్దగా అక్కర్లేకుండా 'ఇలా నవ్వేసి' అని మన ఇమేజినేషన్‌కే వదిలేస్తాడు చాలా చోట్ల. చదివి చూడండి... ఆ రుచి ఎలా వుంటుందో...

**యేం.** అలాడీను ఓ చిన్న పిల్లాడు. వాడు అనగనగా ఉన్నాడు. అసలు చైనావాడులే. జడేసు కుంటాడు.

యేం. వాడు ఓ రోజున వీధిలో ఆడుకుంటున్నాడు మరి. అపుడేమో బుడబుడకల వాడు వచ్చాడు.

వురేయి, అలాడీను నువ్వు గోపాళం వాళ్ల కుడుకువుగదూ అన్నాడు.

అపుడు అలాడీను నీ కెందుకు పోరా అని చెప్పాడు.



బుడబుడకల వాడేమో యిలా నవ్వేసి, నేను పోనురా అన్నాడు.

వురేయి అలాడీను నువ్వు నాతోటి కుంచెం అలా వస్తావురా పనుంది అడిగాడు.

అలాడీను కూడా ఇలా నవ్వేసి గ్రుహదగ్గరికేనా, నీకు మాజికు లైటు కావాలి కదూ నాకు తెలుసులే దొంగా అనేశాడు. మాజికులైటు అంటే అరికీను లాంతరు లేదూ అదన్నమాట.

బుడబుడకలవాడు హాచ్చెర్య పడిపోయేశాడు అంతే. అలా పడిపోయేసి మళ్ళీ లేచి అవునురా హలాడీనూ నీకు ఎలా తెలిసిందిరా అన్నాడు ఇంకా హాచెర్యంగా.

హె, ఎలా తెలుస్తుంది, మా బాబాయి చెప్పాడులేరా అన్నాడు అలాడీను.

బుడబుడకలవాడు బయపడి పోయేసి అవునుగాని మరి నాతో వస్తావా, నీకు మంచి మిఠాయి పెట్టుతాను అన్నాడు.

మిఠాయి వద్దు మరేమో నారాయణ కొట్టులో వేడి పకోడీలు కొనిపెట్టితే వస్తానూ లాపోతే రాను పో అని చెప్పేశాడు అలాడీను.

అపుడేమో బుడబుడకలవాడూ అలాడీను గుఱ్ఱం ఎక్కి టకటకా టకటకా పేద్ద అడివిలోకి వెళిపోయారన్నమాట పకోడీలు తింటూ.

అక్కడే గ్రుహ ఉంది. గ్రుహ అంటే నా తలకాయ. ఏదో ఓటిలే.



నీకెందుకు ఖద విను.

యేం. అక్కడేమో గుఱ్ఱం దిగిపోయారు. బుడబుడకలవాడు గ్రుహ దగ్గిర నించుని యిలా అనిఏదో మంతరం వేశాడు.

హాచెరం! పేద్ద చప్పుడు. ఫేలిపోయింది. భేద్ద మంట పొగ వచ్చేశాయి

హాపుడు.

బుడబుడకలవాడు యిలా బయపడి పోయేసి, హబ్బ ఏంమంటరా ఓరి బాబోయి అనేశాడు.

కాని అలాడీను అస్సలు బయపడలేదు. బయం అంటే ఏమిటో తెలీదుగా మరి. వాళ్ళ బాబాయి చెప్పలేదులే. వురేయి బయం లేదు. బుడబుడకలవాడూ అని చెప్పేశాడు అలాడీను. అపుడేమో వాడు సరేనూ అన్నాడు.

అంతలో ఎవరోవచ్చి యింత చిన్న తలుపు తీశారుగదా.

అలాడీనూ నువు లోపలికి వెళ్ళి అక్కడ మాజిక్కులైటుంది కుంచెం తెచ్చి పెట్టమ్మా అన్నాడు బుడబుడకలవాడు.

మరి నేను చిన్నవాడినీ చితకవాడినీ గదా. నాకు బయం కదా ఎలాగబాబూ నేను వెళ్ళనూ అన్నాడు అలాడీను.

బుడబుడకలవాడేమో నీకు పరవాలేదులేరా. నీకు వుంగరం ఇస్తా వెళ్ళమ్మా అన్నాడు.

అపుడు సరేనని అలాడీను వెళ్ళి లాంతరు తెచ్చాడు.

లాంతరు నాకిచ్చెయ్యి నువు తరవాత రా అన్నాడు బుడబుడకలవాడు.




నాకు పది కాణీలు ఇస్తావా అన్నాడు అలాడీను.

వాడు ఇస్తాను అన్నాడు.

ముందర యియ్యి మరి అన్నాడు అలాడీను.

కాని వాడిదగ్గర నిఝెంగా లేవుగా, అందికని కోపంగా లాంతరు యియ్యి లాపోతే మూత పెట్టేస్తాను అంతే అన్నాడు బుడబుడకలవాడు.

అలాడీనుకు తెలుసుగా వాడు ఎలాగూ తలుపేసే స్తాడని. వాళ్ళ బాబాయి ముందస్తుగా చెప్పాడులే. అందికనే కుంచెం ఏడి పించాడు. వదికాణీలు కావాలని.

యేం. అప్పుడేమో మరేమో వాడికి కోపం వచ్చిందిగా. హుం అనేసి తలుపు వేసేశాడు ధామని. వేసేసి అక్కడే చచ్చిపో వెదవాని అన్నాడు.

అలాడీను హో హో అని నవ్వేశాడు. నాకు తెలుసులే పోరా అన్నాడు. అనేసి ఆ లాంతరులేదూ మాజికు లాంతరు. దాని మీద యిలా గోకేశాడు. అప్పుడు యింత పెద్ద బూతం వచ్చేసింది. బూతం అంటే పేద్ద రాక్షసి.

లావుపాటి పక్కింటి పిన్నిగారు కన్నా యింఖా లావుగా ఉంటుంది.

ఆరేరే. అన్నట్లు నువ్వు కాదురా నువ్వు ముందస్తుగా రాకూడదు. హుష్ మాంకాళీ పో అన్నాడు అలాడీను కళ్ళు మూసేసుకుని యిలా.

తరవాతేమో, ఆ వుంగరం ఉందిగా, బుడబుడకలవాడు ఇచ్చింది. దాన్ని మెల్లగా యిలా గోకాడు. అప్పుడేమో యింత చిన్న బూచివాడు ఒచ్చాడు. వీడు బుడుగు అంత కూడా లేడనుకో.

అపుడు అలాడీను హాచెర్యపడిపోయాడు హా! అని.

బూచివాడేమో ఇంచక్కా నవ్వి ఎందుకండీ అలాడీనుగారూ అలా హాచెర్య పడతారూ, మరేమోనూ ఇది గోకితే నేను వస్తానని మీకు ఇందాకళే తెలుసుగా అన్నాడు.

ఖదలో అలా ఉంది లేవోయి. నువ్వు ముందస్తుగా ఈ గ్రుహ తలుపు తియ్యి అన్నాడు అలాడీను.




నాకు తలుపు తియ్యడం రాదండి. పావం చిన్నవాడిని కదా ఎలా అనేసి యిలా బోల్డు ఏడి చేశాడు ఉంగరం బూచాడు.

అప్పుడు అలాడీనుకి చాలా జాలి వేసింది. యాడవకమ్మా బూచాడూ అన్నాడు. కుంచెసేపు అయ్యాకానేమో, ఉంగరం బూచాడు నవ్వేసి పోనీ యీ గ్రుహని మీ యింటి దగ్గరికి తీసికెళిపోనా అన్నాడు.

కాని అప్పుడు మాత్తరం ఎలా. గ్రుహ తలుపులు రావుగా. నేను ఇందులోనే ఉండి పోవాలీ యీ యీ అని ఏడిచాడు అలాడీను.

హో హో అదా అన్నాడు బూచాడు. నేను తలుపులు తియ్యలేను. కాని, నిన్ను యీ గ్రుహలోంచి అవతలకి తీసుకెళ్ళగలను తెలుసా అన్నాడు వాడు.

అవును తెలుసుకాని మరిచి పోయానులే, మరి తీసుకెళ్లు చప్పునీ అన్నాడు అలాడీను.

వుష్ మాంకాళీ అనేసరికి యిద్దరూ గ్రుహ అవతలికి వెళిపోయారు.

ఇప్పుడు మీ యింటిదగ్గరికి తీసుకెళిపోనా అని అడిగాడు బూచాడు.

ఏం ఒద్దులే, ఒక నిఝెం జెటకా తెచ్చిపెట్టు చెప్తాను అన్నాడు అలాడీను.

అప్పుడేమో ఆ జెటకా ఎక్కి వాడే తోలుకుని ఝూంమని వాళ్ళింటికి



వెళిపోయాడు.

తరవాత మళ్ళీ ఉంగరం బూచాడిని పిలిచి కాసిని ఛాలా పకోడీలు తేరా అన్నాడు. హుష్ మాంకాళి అనేసరికి బోల్డు పకోడీలు వచ్చేశాయి.

వురేయి బూచాడు, పకోడీలు తెచ్చానని మా బామకి చెప్పకేం, చెప్పితే నడ్డిమీద ఛంపేస్తాను జాగర్త అన్నాడు అలాడీను.

సరేండి చెప్పను అన్నాడు బూచివాడు.

మరి యిప్పుడేం చెయ్యాలిరా నేను అని అడిగాడు అలాడీను.

మరి యిప్పుడేమోనూ మరేమోనూ ముందస్తుగా షోడా తాగేసి, అప్పుడేమో రాజుగారి అమ్మాయిని పెళ్ళిచేసు కోవాలండీ అని చెప్పాడు బూచివాడు.

హుం అన్నాడు అలాడీను, హుం అన్నాక, పురేయి బూచివాడూ దాని పేరేమిట్రా అన్నాడు.

సీ గాన పెసూనాంబండి అని చెప్పాడు బూచివాడు.

సరేని అలాడీను పరిగేరుకుని సీ గాన పెసునాంబ వాళ్లింటి కెళ్ళిపోయాడు.

అక్కడ రాజుగారు కూచున్నాడు.

యావండీ మరీ యిప్పుడూ నేనేమోను మీ సీ గాన పెసూనాంబని పెళ్లి చేసుకోవాలండీ అని చెప్పేశాడు అలాడీను.

పోకిరీ వెధవకానా పోరా పో అనేశాడు వాళ్ళ నాన్న, వాడు రాజుగారు గదా.

అప్పుడు అలాడీను పరిగేరుకుని మళ్ళీ జెటకా దగ్గరికి వచ్చేశాడు.

అప్పుడేమో వుంగరం బూచివాడిని మళ్ళీ పిల్చి యెలాగరా అన్నాడు. మరేమోండి నాకు తెలీదండి ఈ అరికిను లాంతర్ని గోకండి అని చెప్పాడు ఉంగరం బూచాడు.

సరేని పాపం అలాడీను అరికిను లాంతర్ని యిలా గోకాడు. బేద్దభూతం వాడు వచ్చేశాడు ఇలా గారిగా పొడుగ్గా నవ్వేసి యేం కావాలి అన్నాడు.

అలాడీనుకి కుంచెం బయం వేసింది. పురేయి మా బామ్మ వింటే మనిద్దరికి ప్రైవేటు చెప్పేస్తుంది. కుంచెం మెల్లిగా నవ్వు. అసలు ముందస్తుగా యింత చిన్నవాడివి అయిపో. నాకే బయం వేస్తుంటే అన్నాడు అలాడీను.




అప్పుడేమో తన ఖద చెప్పి ఎలాగరా అన్నాడు. భూతంవాడు మెల్లిగా పొట్టిగా ఇంత కుంచెం నవ్వి మీరు బెద్దవాడు అవాలండి లాపోతే పెళ్లి చెయ్యరు రాజుగారు అన్నాడు.

సరే నన్ను పెద్దవాడు చెయ్యరా అన్నాడు అలాడీను.

వుష్ మాంకాళీ అనేప్పటికి ఘబుకుని బెద్దవాడైపోయాడు అలాడీను.

ఇప్పుడు మీ జేబునిండా పది కాణీ లుండాలండి. ఇంకానేమో నిఝెంజెటకా, ఓ పేద్ద మేడ కూడా ఉండాలండి అని చెప్పాడు బూతం వాడు.

అవన్నీ వచ్చేశాక, అలాడీనేమో రాజుగారింటికి మళ్ళీ వెళ్ళి రాజుగారి అమ్మాయిని పెళ్లి చేసుకోవాలి అన్నాడు.

రాజుగారు హాచెర్యపడిపోయేసి మరి నీ దగ్గర యెన్ని డబ్బులు ఉన్నాయి అన్నారు.

నా దగ్గిర ప్పది కాణీలు ఉన్నాయి తెలుసా? అన్నాడు అలాడీను. అబ్బ, అన్ని కాణీలే అన్నాడు రాజుగారు.




ఇంకో నిజెం జెటకా కూడా ఉంది తెలుసా. కొరడా, బీడీలు, ఒక బేద్ద మేడా కూడా ఉన్నాయి అన్నాడు అలాడీను.

రాజుగారు ఇంకా చాలాసేపు హాచెర్యపడిపోయేశారు.

అపుడు సరేని సీగాన పెసూనాంబకి పెళ్లి చేసేశారు. బోల్డు, బోల్డు బాజాలు అవీ వచ్చాయి.

కానీ ఏం చేశారంటే సీగాన పెసూనాంబ ఒకర్తికే పెళ్లిచేశారు.

మరి నాకో అన్నాడు అలాడీను పాపం.

నువ్వు బళ్లోకి వెళ్ళవుగా. నీకు జెటకా వుందిగా అది తోలుకో పో అన్నాడు రాజుగారు.

అలనాటి ఆణిముత్యాల గురించి నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

క్లాసిక్స్ రీటోల్డ్

# కంఠాభరణం

- పానుగంటి

### జరిగిన కథ

**పరమఛాందసుడైన సోమావధానులనే అతను భార్య, మరదలను వెంట బెట్టుకుని పట్నం వస్తాడు. ఆడవాళ్ళిద్దరూ రాత్రిపూట సర్కసుకి వెళతామంటే ఒప్పుకోడు. అతడు నిద్రపోయాక అక్కాచెల్లెలూ బయటకు జారుకుంటారు. వాళ్లకి రామశాస్త్రులు అనే పిచ్చివాడు ఎదురు కావడంతో భయపడి పరుగులు పెట్టడంలో అక్కది ఓ దారీ, చెల్లిదీ మరోదారి అవుతుంది. సుబ్బిశెట్టి అనే వ్యాపారి తన షష్టిపూర్తి ఉత్సవాలకు కృష్ణారావు అనే అతను, అతను ఉంచుకున్న సుందరి అనే వేశ్య హాజరవుతారు. సుందరిని చూసి శెట్టి మోజుపడతాడు.**

సుబ్బ : (సుందరి చెవిలో) మేజువాణీ కాగానే మా యింటికి రా!
వెంకటప్పయ్యని దొడ్డి గుమ్మంలో కాపలా పెడతాలే!

కృష్ణా : (తనలో) సెట్టి ఏదో చెవిలో వూదాడు. ఇది 'ఊ' అంది.

వెంక : మరి తర్వాతి అంశం ఆశుకవిత్వం.

సుబ్బి : ఈ తంటా ఏంటయ్యా! మన యింటా వంటా ఎప్పుడైనా యీ
కవిత్వపు గాడిదగత్తర వుందా?

(రామలక్ష్మణ భట్రాజు కవులు వచ్చి, పద్యాలు పాడతారు.)

రామ : బండిరా పొగబండిరా దొరలుండు రైలుబండిరా.
మండలంబున గంగదాసువుండి యీ కవిచెప్పెరా.
శాస్త్రులుగారూ!
ఆశుకవితయొకటి - యావు పేడయొకటి
స్వయముగా శుద్ధ - చయముభువిని
వానికిలను వేణు - పరిశోధనముకూడా
దవని౯ జెల౯గ వెలయు - సమరభువిని

లక్ష్మ : శుద్ధముగా౯ బండితులము
ఆద్దరాకవితలోన - అతిగట్టివారము
సద్దనమూగూర్ప గట్టిగ
శ్రద్ధింతుము సభలజనులు - శాబాసన౯గన్
(బహుమతి కోసం నిలబడతారు.)

సుబ్బి : ఓశోశ్! ఈ మాత్రం కవిత్వం నేనూ చెప్పగల్ను. దీనికో పెద్ద




బహుమానమా?
చింతపండు తెచ్చి రాచ్చిప్పలో వేసి
నీళ్లు పోసి పచ్చిపులుసు చేసి
కాల్చిన వంకాయ ఆ పులుసులో వేసి
ఉల్లిపాయ కారమందు వేసి
బుట్టలోది కాస్త దానిలోపల జేర్చి
బజ్జి చేసి తినగ గజ్జి మొలుచు

ఇప్పుడు చెప్పండి. నా కవిత్వం కంటె మీ కవిత్వం ఎందులో ఎక్కువంట?
వెంకటప్పయ్యా! వీళ్లిద్దరికీ చెరో బేడా యిచ్చి పంపించు.

ఆశుకవులు - (కోపంతో)"ఘోడాలో, తోడాలో యిస్తావనుకుంటే-
..డెమ్మ చాకలికి వలె
బేడా యిచ్చెదవ, గేదె పేడా ధరలో?"

(సుబ్బి శెట్టి వాళ్లని కొట్టబోతాడు. వాళ్లు యింకా కొన్ని తిట్టు పద్యాలు చదువుతారు).

సుబ్బి : మీ శాపనార్థాలకి యిక్కడ ఎవరూ జడవరు. పొండి!
(కవులు మళ్లీ తిట్టు పద్యాలు చదువుతారు)

సుబ్బి : ఓరి మీ ఆశుకవిత్వం సంతకెళ్ల! ఎక్కడో విశాఖపట్నం పిచ్చాసుపత్రిలో వుండాల్సిన వాళ్లు మీరు! వెంకటప్పయ్యా! వీళ్లకి చెరో రూపాయి యిచ్చి పంపించు. (వెంకటప్పయ్యకి మాత్రం వినబడేలా) సుందరి యింకా రాలేదేంటి చెప్మా!

వెంక : ఏమో! ఆ కృష్ణారావుగాడు అసాధ్యుడు

సుబ్బి : అయినా నా బుద్ధి మళ్లడం లేదయ్యా! నువ్వా గుమ్మం దగ్గర తిరుగుతూ అది రాగానే యింటికెళ్లిపో! నేనీ లోపల యింట్లో కాస్త విశ్రాంతి తీసుకొని వస్తాను.

సుబ్బిశెట్టి యింటిదగ్గర వీధిలో కృష్ణారావు, సుందరి కలుస్తారు. సుందరిని ఎలాగైనా సుబ్బిశెట్టికి లోబడకుండా చెయ్యాలని కృష్ణారావు ప్రయత్నం.

వీళ్లిద్దరూ మాట్లాడుకుంటూంటే కృష్ణారావుకి పిల్లనిచ్చిన మామ, శ్రీనివాసరావు, సాయిబు వేషంలో వచ్చి, కృష్ణారావుని కొట్టి బలవంతంగా సుందరిని లాక్కుపోతాడు.

అప్పుడు సుబ్బలక్ష్మి ప్రవేశిస్తుంది. బైట ఒంటరిగా తిరగడం క్షేమం కాదని, ఆశ్రయం కోసం సెట్టి యింట్లోకి దూరి అక్కడ ఒక చెక్కబల్ల మీద పడుకుంటుంది.

శాలువా కప్పుకున్న ఆమెని 'సుందరి' అనే అనుకుంటాడు సుబ్బిశెట్టి.... "అయినా బణారసు చీరె లేకుండా ముతక చీరెతో వచ్చిందేమిటి? చీరెను బట్టే గదా సింగారం?....సీమ యినపరేకు డబ్బీలో పెడితే హారతి కర్పూరం. చిన్నగాజు బుడ్డీలో పెడితే పచ్చకర్పూరం... అంతలోదేగా!...' అని తలపోస్తూంటాడు.

ఇంతలో సుబ్బలక్ష్మి అతన్ని చూసి, "అయ్యా! నేనిక్కడ కాసేపు విశ్రమిస్తే మీకేమైనా అభ్యంతరమా?"అంటుంది. ఆమెని సుందరిగా భావిస్తోన్న సుబ్బిశెట్టి, "ఇది బెట్టు చేస్తోంది. ఎరగనట్టు మాట్లాడుతోంది. మనమూ

బెట్టు చేద్దాం. లేకపోతే చనువు తీసుకుని ఎక్కువ డబ్బులు గుంజాద్దేమో!" అనుకుని, "అయినా మేజువాణీలో కలిగిన మోజు యిప్పుడు కలగడం లేదేంటి చెప్మా! అంతా చీరెలోనే వుంది. అంతే! 'రాతి గాదెలోనైతే రాజనాలు, పేడ గాదెలోనైతే పెద్దవరిని" అని ఆలోచిస్తుంటాడు.

ఇలా వుండగా, పిచ్చి రామశాస్త్రులు తలుపు దగ్గరకొచ్చి, సెట్టితో 'ఇదిగో పంతులు గారు నోటు పంపారు' అంటాడు. సెట్టి ఆశగా తలుపు తెరుస్తాడు. రామశాస్త్రులు అతన్ని కొట్టి, బైటికి నెట్టి, లోపలికెళ్లి తలుపేసుకుంటాడు.

బైట సెట్టీ, కృష్ణారావూ కలుస్తారు. సెట్టిని చూడగానే తనని కొట్టిన వ్యక్తి సుబ్బిశెట్టి నౌకరన్న అనుమానంతో కృష్ణారావు కోపంతో "మీ సాయిబు నౌకరుతో నన్ను కొట్టిస్తావా?" అని సెట్టిని కొడతాడు. సెట్టి, "అయ్యో! నాకేం తెలీదు. నేను నిన్ను ఎవరితోనూ కొట్టించలేదు. నువు నన్ను అన్యాయంగా కొట్టావు. నన్నంటే కొట్టావుగాని మా వెంకటప్పయ్యని కొట్టుచూద్దాం" అంటాడు.

కృష్ణారావు అతని మాటలు నమ్మక, "నీ శృంగార వేషం చూస్తే సుందరి కోసమే ముస్తాబు అయినట్లుంది. మర్యాదగా సుందరి ఎక్కడుందో నాకు అప్పజెప్పు" అంటూ, "ఆమె మెళ్లో నాలుగు వేల రూపాయల నగలున్నాయ్. అందులో రెండు వేలు నేను పెట్టినవే! ఆమె ఆచూకీ తేలేవరకు నీ మెళ్లో 'కంఠాభరణం'. నాదగ్గర హామీగా వుంచు" అని బలవంతంగా లాక్కుంటాడు. సెట్టి 'ఒరయ్యలో!' అని కేకలు పెడుతూ వెళ్లిపోతాడు.

ఇక లోపలికి వెళ్లిన రామశాస్త్రులు ఏదో వెర్రిమాట మాట్లాడితే "వీడు యిక్కడికీ దాపురించాడే!" అనుకుంటుంది సుబ్బలక్ష్మి. తనూ పిచ్చి నటించి ఎలాగైనా వీడి బారినుంచి బైట పడాలి అనుకుంటుంది. 'మరయితే యిక యీ ముసుగెందుకు?' అని శాలువా తీసి పక్కన పడేస్తుంది.

రామ : (ఆమె గుండును చూసి, ఆమెకి వినబడేలా), ఓహో! సజీవ సాలగ్రామం! కూర్మావతారం! ఈమె యీ రామశాస్త్రికి గృహిణి కావడానికే పుట్టినట్లుంది. ఇంతకీ యీమెకి మొగుడున్నాడా? ఇంతకీ వున్నట్టా, లేనట్టా? ఈ విషయంలోనే గదా సాంఖ్యులూ, యోగులూ జుట్టు పట్టుకున్నది!

సుబ్బ : ఇప్పుడు మనిద్దరికీ అదే అవుతుంది.

రామ : ఎలా? నీకు జుట్టేది పట్టుకోడానికి?

సుబ్బ : నీ మతి వున్న స్థలానికి పోయింది. వెళ్లి తీసుకురా!

రామ : ఎలా తేను? ఈ పాటికి అది సవరం అయిపోయి వుంటుంది. అయినా సవరం పెట్టుకోవడం వితంతువులకి నిషిద్ధం గదా! ఎలా అబ్బా! అవునులే! ఏదో ఒక దారి వుండక పోతుందా? వీధి వాకిలి కాకపోతే దొడ్డివాకిలి!

సుబ్బ : బాగా చెప్పావు! ఉదాహరణకి ఎప్పుడు మామిడి కాయలు కావాలంటే అప్పుడు దొరకవు గదా! అందుకే మాగాయ, మెంతికాయ, తోడ మెంతికాయ, ఆవకాయ... ఇవన్నీ నిర్ణయించారు శాస్త్రకారులు.

రామ : భేష్! నీవు కొంచెం శాస్త్రజ్ఞానం కలదానిలాగే కనబడుతున్నావు. మరి నా ప్రశ్నలకి సమాధానం చెప్పు. మోక్షప్రాప్తికి అంతరంగ సాధనం అనీ, బహిరంగ సాధనం అనీ - రెండు రకాల సాధనలు చెప్పారు గదా - అవేమిటో, ఎలా వుంటాయో చెప్పు!

సుబ్బ : ఏం వుందీ! పనస కాయ కూర రెండు రకాలుగా వండొచ్చు. ఒకటి పులుసు వేసి. రెండు పెసరపప్పువేసీను. ఆవ పెట్టింది. అంతరంగ సాధన, పప్పు వేసింది బహిరంగసాధన!

రామ : అహం బ్రహ్మజ్ఞానం ఎవరికి కలుగుతుంది.

సుబ్బ : మా బావగారికి

రామ : ఆయన వశిష్టుడా? వ్యాసుడా?

సుబ్బ : నా పాలిటి క్షురకుడు

రామ : కప్పదాట్లు వేయకు. 'పూర్వజన్మ వాసన' అంటే ఏమిటో వివరించు.

సుబ్బ : వాసన అనేక రకాలు. కొత్తిమీర వాసన కొంతమందికి గిట్టదు. వేపార్లకి యింగువంటే మహాయిష్టం. అలాగే కాకరకాయ పచ్చిపులుసులో నీరుల్లే వెయ్యాలి! తెలక పిండి కూరలో వెల్లుల్లి వెయ్యాలి.

రామ : పంచభేదాలంటే ఏవిటి?

సుబ్బ : రుద్రాక్ష పంచె, మామిడంచు పంచె, గోవుల పంచె.

రామ : ద్వైతులకీ, అద్వైతులకీ తేడా ఏవిటి?

సుబ్బ : ద్వైతులది నిలువుబొట్టు. అద్వైతులది అడ్డబొట్టు. ద్వైతులు చుట్టకాలుస్తారు. అద్వైతులు పొడుం పీలుస్తారు.... ఇంకా...

రామ : నిన్ను పిచ్చాసుపత్రిలో చూసినట్టు గుర్తు (ఆమె దగ్గరికి వెళ్లి) "రావణుడు రంభతో గోవిందా రామా - - చేయీ చేయీ కలిపె గోవిందారామ (అని పట్టుకుంటాడు)

సుబ్బ : "రంభ రావణునంత గోవిందారామా - కాలితో తన్నెను గోవిందా రామా (అని తంతుంది)

రామ : "మొండి రావణుడంత గోవిందారామ - ముద్దిడుకొనబోయె గోవిందా రామ (అని ముద్దు పెట్టుకోబోతాడు)



"ముండాకొడకా అంచుగోవిందా రామా - మూతిపై కొట్టెను గోవిందారామ (అని కొడుతుంది)

అప్పటికీ రామశాస్త్రి వదలకుండా వెంట బడుతూంటే ఆమె తనకి 'పూనకం' వచ్చినట్లు నటిస్తుంది. రామశాస్త్రి భయపడి సుబ్బలక్ష్మి శాలువా కప్పుకుని ఒక మూల పడుకుంటాడు.

సుబ్బలక్ష్మికి ఆ గదిలో సాయిబు వేషానికి కావలసిన నాటకం దుస్తులు కనిపిస్తాయి. గోవులపంచె మీదనే వాటిని వేసుకుని పారిపోవాలని బైటికొస్తుంది.

కృష్ణారావు ఆమెని చూసి, "ఆగు! ఆగు! అప్పుడు నన్నుకొట్టిపోయిన సాయిబువు నీవే గదా!" అంటాడు. "ఇప్పుడు కొట్టిందీ నేనే!" అంటూ సుబ్బలక్ష్మి అతన్ని కొట్టిపారిపోతుంది.

బైటినించి లోపలికొచ్చిన సుబ్బిశెట్టి శాలువా కప్పుకుని పడుకున్న రామశాస్త్రి 'సుందరి' అనే వుద్దేశ్యంతో సరసం ఆడబోతాడు. చీకట్లో తడిమి, 'తరవాణి కుండలా వుంది. ఇదే తల అయివుంటుంది" అనుకుని, "నేను ముద్దెట్టుకుందామంటే పొట్ట వంగదాయె. నువ్వే తలపైకెత్తి ముద్దెట్టుకో" అంటాడు. పిచ్చిశాస్త్రి లేచి సెట్టిని కొట్టిపారిపోతాడు. సుబ్బిశెట్టి లబోదిబోమంటూ" ఇవాళ అన్నీ నష్టాలే, దెబ్బలే! ఠాణాలో ఫిర్యాదు చేస్తా" అనుకుంటాడు.

సుబ్బలక్ష్మి కృష్ణారావుని కొట్టి పారిపోతూ, మధ్యలో 'రుక్మిణి' అనే ఓ స్త్రీ యింటికి చేరుతుంది. ఈ రుక్మిణి కృష్ణారావు భార్యే!

(సశేషం)

-విశ్వపతి



# శ్రవణదోషం

-రాజా

**జరిగిన కథ**

**హాయిగా ఉంటున్న కమల, సుందరం కుటుంబంలో కోదండం బాబాయి వచ్చి తిష్టవేస్తాడు. ఎన్నాళ్ళయినా వదలకుండా భయంకరమైన రీతిలో తింటూ ఉంటాడు. అతన్ని మేపలేక ఉద్వాసన చెప్పటానికి రకరకాల ప్రయత్నాలు చేస్తారాదంపతులు. ఆయన భార్యకు సీరియస్‌గా ఉందని టెలిగ్రాం తెప్పిస్తారు. ఆ తర్వాత....**

(సుందరం, కోదండం స్కూటర్ మీద ప్రయాణం చేస్తున్నారు)

కోదండం : ఇదిగో సుందరం... ఆపు నాయనా ఆపు

(స్కూటర్ ఆపి)

సుందరం : ఎందుకు బాబాయ్ గారూ.... బస్టాండు, రైల్వేస్టేషను, ఏరోడ్రమ్ ఆఖరికి టాక్సీస్టాండైనా సరే ఇంకా చాలా దూరం ఇక్కడికి

(దిగిపోయి ముందుకు నడుస్తూ)

కోదండం : ఆ సంగతి నాకు తెలుసులేవయ్యా. ఆ స్కూటర్‌కి స్టాండేసి, లాక్‌చేసి రా

సుందరం : ఎక్కడికి వెళ్తున్నాడు గురుడు?

(కోదండం అక్కడే ఉన్న ఓ ఎస్.టి.డి. బూత్‌లో దూరాడు)

చచ్చాంరా.... ఈ బాబాయ్‌గాడికి కొంపలో టెలిఫోన్ కూడా ఉందా ఏమిటి?

(స్టాండ్ వేసి లాక్ చేసి ఆదరబాదరగా పరుగెత్తాడు ఎస్.టి.డి. బూత్ వైపు)

(యస్.టి.డి బూత్‌లో కోదండం జేబులోంచి ఓ కాగితం తీసి ఆపరేటర్ కిస్తూ)

కోదండం : ఈ నంబరు కలపవో

(సుందరం బిక్కుబిక్కుమంటూ బాబాయ్‌ని, ఆపరేటర్‌ని చూస్తున్నాడు)

ఆపరేటర్ రెండు మూడుసార్లు డైల్ చేశాడు.

ఆపరేటర్ : ఎంగేజ్ ఉందండి

కోదండం : కలిసేదాకా కలుపుతూనే ఉండు చెప్తా.

ఆపరేటర్ : ఆ.... రింగ్ అవుతుంది... లోపలి కెళ్లి మాట్లాడండి.

(కోదండం క్యాబిన్‌లోకి వెళ్ళాడు. తలుపు తెరిచే ఉంది. తలుపు దగ్గర చేరాడు సుందరం.)

కోదండం : హలో.... హలో.... అది ప్రెసిడెంటు జేపీరెడ్డిగారి ఇల్లేనాండీ?

(అటువైపు నుంచి)

మల్లయ్య : అవునండి

కోదండం : ఎవరదీ మాట్లాడుతుంటా మల్లయ్యేనా

మల్లయ్య : అయా.... నేనేనండి.... ఓడ మల్లయ్యని

కోదండం : ఒరే మల్లయ్యా నేన్రా కోదండాన్ని

మల్లయ్య : అయ.... దండాలు బాబూ.

కోదండం : ఆ దండాలు దండాలు... ఇంట్లో అయగారు లేరా?

మల్లయ్య : లేరండి.... అంతా కలిసి తిరుపతి పోయారు.

కోదండం : ఆహా అదీ ఒకందుకు మంచిదేలే, మీ పిల్లలు బాగున్నారా?

మల్లయ్య : ఆయ....

కోదండం : ప్రెసిడెంటుగారి మచ్చల ఆవు ఈనిందా?

మల్లయ్య : ఇంకాలేదండి

కోదండం : ఊళ్లోపవర్ కట్ ఎలా ఉంది?

మల్లయ్య : ఏరోజుకారోజు దేవుడికి మొక్కుకోవడమేనండయ్యా

కోదండం : సరే నువ్వోపని చెయ్యాలయ్యా

మల్లయ్య : చిత్తం చెప్పండి

కోదండం : నిల్చున్న ఫళాన మా ఇంటికెళ్ళి మా ఆవిడెలా ఉందో చూసొచ్చి ఫోన్లో చెప్పు.

మల్లయ్య : అయా. మీ ఇల్లు ఇక్కడికి శానాదూరం కదండయ్యా.

కోదండం : నాకు తెలీదా మల్లయ్యా.... మా ఇల్లు దూరవే... అయినా వెళ్ళి చూసొచ్చి చెప్పాలి.

(సుందరం గుడ్లుమిటకరించి చూశాడు)

నీ కష్టం ఉంచుకోనులేవయ్యా. మా జెపీరెడ్డి గార్రాగానే నీకో మాంచి బహుమతి ఇప్పిస్తాలే, ఊ బయల్దేరు.

మల్లయ్య : అలాగేనయ్య.

కోదండం : ఇదిగో మల్లయ్యా.... ఏదో నేను చెప్పేను కదాని 'ఉరుదం బురుదం' అంటూ పరుగెత్తుకుంటూ వెళ్ళి హడావుడిగా చూసేసి వచ్చెయ్య గలవు. కాస్త నింపాదిగా యోగక్షేమాలు అవీ కనుక్కొని కుశలం అదీ చెప్పి మొత్తం ఉన్నదన్నట్టు నాకు పూస గుచ్చినట్టు వివరంగా చెప్పాలి. అర్థం అయిందా?

మల్లయ్య : అయిందయ్యా

మరి నే బయల్దేరనాయ్యా.

కోదండం : ఆ.... బయల్దేరు... నువ్వొంచేంత వరకు నేను లైన్లోనే ఉంటా.

(యస్.టి.డి. బూత్‌లో క్యూ చేంతాడులా ఉంది. క్యాబిన్‌లో ఓ వాలు కుర్చీవేసుకుని, గుండెల మీద నుంచి చెవికి ఆనేట్టుగా ఫోన్ పెట్టుకుని, విలాసంగా మేగజైన్ చూస్తున్నాడు కోదండం. ఆ పక్కనే మరికొన్ని పేపర్లు, మ్యాగజైన్లు చదవటానికి రెడీగా ఉన్నాయి. కొంచెం అవతలగా సుందరం నెత్తిమీద గుడ్డ వేసుకొని ఉన్నాడు.)

క్యూలో ఒకడు: ఎంతసేపండీ ఇంకా?

కోదండం : అలా అంటే ఎలా చెప్తాం, మనిషి వెళ్ళాలి, చూడాలి, రావాలి, చెప్పాలి.

క్యూలోమరొకడు: ఎంత దూరం ఉంటుందీ మీ ఇల్లు

కోదండం : ఉంటుందయ్య ఓ మైలు దూరం ఉంటుంది.

ఆయినా మీ పట్నాల్లో లాగ ఒకదాని నెత్తి మీద ఒకటి, ఒక దాని నడ్డిమీద ఇంకోటి ఆరోగ్యం అంటే ఖాతర్లేకుండా ఇళ్లు కట్టేసుకోరయ్యా పల్లెటూళ్ళలో.

క్యూలో ఒకడు: ఇదెక్కడి సుత్తిమేళంరా బాబూ

క్యూలో ఇంకోడు: పోనీ కట్‌చేసేసి కాస్సేపు పోయాక డయల్ చేయ్యొచ్చుగా.

చూస్తుంటే ఇంటి నుంచి పుడ్డూ బెడ్డూ కూడా తెప్పించు కొనేట్టున్నాడు.

కోదండం : థాంక్స్.... మంచి అయిడియా ఇచ్చారు.

క్యూలో ఒకడు: ఖర్మ.... వ్యంగ్యం వెటకారం కూడా అర్థం అయినట్టు లేదు.

కోదండం : అమ్మమ్మమ్మ అంతమాటనకు బాబూ నాకన్నీ అర్థం

అవుతాయి. కాకపోతే అనవసరంగా ఆవేశపడిపోయి అనర్థం తెచ్చుకోనంతే! నీక్కావాలంటే ఈ యస్.టి.డి బూత్ కాకపోతే ఇంకో ఎస్.టి.డి బూత్‌కి వెళ్తావు. నాకీ లైన్ కట్ అయిందనుకో మళ్ళీ లైన్ దొరుకుతుందన్న గ్యారంటీ ఉందా చెప్పు... నువ్విప్పించగలవా లైను....

(ఒక్కొక్కళనీ అడుగుతూ)

నువ్విప్పించగలవా

(నెత్తి కొట్టుకొని లైనులోంచి తప్పుకుంటారు కొందరు)

ఆపరేటర్ : నా బేరాలు చెడగొడతారేంటండీ మీ పనేదో మీరు చూసుకోక.

కోదండం : బాబూ ఆపరేటరు బాబూ....
ఒక్కనిమిషం అమ్మా... దా....
ఇప్పుడు నేను లైన్ కట్ చేశాననుకో అదిగో ఆయన నంబర్ నువ్వు డైల్ చేస్తావు. లైను దొరికిందా హాపీ.... లేకపోతే... అలా చేస్తూనే ఉంటావు... ఆయన కాకపోతే ఆయన, ఆయన కూడా కాకపోతే అల్లాయన ఇలా ట్రై చేస్తూనే ఉంటావు. అంతేనా?

ఆపరేటర్ : అంతేనండి

కోదండం : ఇలా లైను దొరక్కపోయినా ట్రై చేసినందుకు నీకేం వస్తుంది?

ఆపరేటర్ : .... ...... (నోరు తెరిచేశాడు)

కోదండం : అదే మనదనుకో. అక్కడ మా మల్లయ్య చూసొచ్చి చెప్పేదాకా నీకు మీటరు తిరుగుతూనే ఉంటుంది. ఇన్‌కమ్ వస్తూనే ఉంటుంది. మీటర్ తిరుగుతూనే ఉంటుంది. ఇన్‌కమ్ వస్తూనే ఉంటుంది.

(లాజిక్‌కి అదిరిపోయి మర్యాద ఇచ్చేస్తూ)

ఆపరేటర్ : సారీ సార్.... మీరు కూర్చోండి సార్. (మిగిలిన కష్టమర్లతో) ఇదిగో కాస్సేపాగండయ్యా.... ఆయన్ని కంగారు పెట్టకండీ.

(సుందరం కుళ్ళి కుళ్ళి కుమిలి పోతూ ఉంటాడు)

ఆపరేటర్ : సార్....

కోదండం : ఏంటి?

ఆపరేటర్ : నేనెళ్ళి కూల్ డ్రింక్స్ తీసుకొస్తాన్సార్.

కోదండం : ఆ... మంచిది. చిరంజీవ.... వృద్ధిలో కొస్తావ్.... పెద్ద పెద్ద బాటిల్స్‌తో వస్తున్నాయి చూడూ అవి పట్రా.

(ఆపరేటర్ బైటికెళ్ళాడు.

కోదండం మ్యాగజైన్ చూస్తున్నాడు.

కుమిలిపోతూ ఓ మూల కుక్కపిల్లలా పడున్న సుందరానికి ఫ్లాష్ వెలిగింది.

మెల్లిగా పాక్కుంటూ వెళ్ళి ఆపరేటర్ దగ్గరున్న ఫోన్ ఎత్తేడు.)

సుందరం : అయగారూ అయగారు

(తుళ్ళిపడి ఇటూ అటూ చూసి రిసీవర్ చెవికి అదిమి పెట్టుకుంటూ)

కోదండం : ఎవరదీ... మల్లయ్యా?

(వీలైనంత ఘోరంగా ఏడుస్తూ)

సుందరం : మల్లయ్య నేనండి... అమ్మగారు మనకి దక్కేట్లు లేరండి.

(అక్కడ మల్లయ్య వచ్చి ఇంటి తలుపు తాళం తీస్తున్నాడు)

ఇక్కడ

కోదండం : ఏంట్రా ఏం జరిగింది?

సుందరం : మీ గురించి బెంగెట్టుకున్నారటండీ. అప్పుడే కిందికి కూడా దింపేశారండీ. మీరు త్వరగా రాకపోతే అట్నించి అటేనటండీ.

అక్కడ

మల్లయ్య ఫోన్ ఎత్తాడు

ఇక్కడ

కోదండం : అసలు ఏం జరిగిందో సరిగ్గా చెప్పరా.

మల్లయ్య : అయగోరూ.... నేనండీ... ఓడ మల్లయ్యనండీ.... అమ్మగారు చాలా బావున్నారండీ

(సుందరం గతుక్కుమన్నాడు. కోదండంకి అనుమానం)

కోదండం : మరిందాక బావులేదన్నావు కదరా.

మల్లయ్య : అయబాబోయ్ నేనెక్కడన్నానండి ఇప్పుడే వచ్చి ఫోనెత్తానండీ

(లాభం లేదని సుందరం తెగించేసి)

సుందరం : అయగారూ... ఈడెవడో మధ్యలో క్రాస్‌టాక్ చేస్తున్నాడండీ అమ్మగారికి అస్సలు బాగాలేదు.

కోదండం : క్రాస్‌టాకా

(అనుమానంగా వాలుకుర్చీలోంచి లేచి క్యాబిన్ అవతల తలపెట్టి చూశాడు. ఫోన్ పట్టుకున్న అటు వైపు తిరుగున్న సుందరం కనబడ్డాడు.)

కోదండం : ఇంతకీ అమ్మగారెలా ఉన్నార్రా

(ఘొల్లున ఏడుస్తూ)



సుందరం : అయిపోయి ఉంటుందండీ..... ఇంక ఆఖరు చూపులు కూడా దక్కవండీ

మల్లయ్య : అబద్ధం అండీ... అమ్మగారు ముప్పొద్దులా మేత పట్టిన గొడు గేదెలా దిట్టంగా ఉన్నారండీ.

కోదండం : ఒరేయ్... ముందు మీ ఇద్దరిలో ఓడ మల్లయ్య ఎవరో బోడి మల్లయ్య ఎవరో అది తేల్చుకోండి. ఆ తర్వాతనే మాట్లాడతా అంతవరకు ఇలాగే పట్టుక్కూచుంటా ఫోను.

(సుందరం అదిరిపడి ఫోన్ పెట్టేశాడు)

కోదండం : సరే మల్లయ్య ఇక ఉంటా. నేవచ్చినప్పుడు జెవీరెడ్డిగారితో చెప్పి మంచి బహుమతిప్పిస్తా.

(కోదండం ఫోన్ పెట్టేశాడు. బిల్లు కాగితం మిషన్‌లోంచి కదిలింది. అప్పటికే అది సుందరాన్ని మొత్తం చుట్టేసి ఉంది. ఆపరేటర్ కూల్ డ్రింకులు తెచ్చాడు. కోదండం ఒకటి తీసుకున్నాడు. సుందరం బిల్లు వలయం నుంచి బైటికొచ్చాడు. బాబాయ్ చూసి నవ్వేడు. )

సుందరం : ఎందుకు నవ్వుతున్నారు?

కోదండం : ఇందాక ఫోన్లో దరిద్రుడెవరో మధ్యలో మాట్లాడి కామెడీ చేశాడ్లే నెల తక్కువకుంక.

(సుందరం ఆపరేటర్‌ని బైటికి తీసుకు వెళ్ళి స్కూటర్ తాళం చెవులిచ్చి చేతులెత్తి నమస్కరించాడు.)

--- కట్ ----

(ఇంకా వుంది)



# రాంపండు లీలలు

## రాంపండూ - శునకదానమూ

అనంత్‌కు అత్తయ్యలంటే ఏ నాడూ ప్రేమ లేదు. మాంకాళి అత్తయ్య అంటే మరీ లేదు. ఆవిడ కూడా మేనల్లుడి అభిమానాన్ని చూరగొనే ప్రయత్నం ఎన్నడూ చేయలేదనడానికి తాజా ఉదాహరణ - తన ఆల్సేషియన్ డాగ్ జాకీని అతని సంరక్షణలో వదలడమే.

అప్పటికీ అనంత్ చెప్పిచూశాడు. - "కుక్కలకి కొత్తా - పాతా వుంటాయి. నేనంటే దానికి కాస్త పరిచయముండేది కానీ మా ఇంటికి వచ్చేవాళ్లతో తల ఊపే పరిచయం కూడా లేదు. మీద పడి రక్కివదిలి పెట్టవచ్చు. నీతో పాటు దాన్ని తీర్థ యాత్రలకు వెంటబెట్టుకు వెళ్లు. వచ్చే జన్మలోనైనా మనిషి జన్మ వస్తుందేమో" అని.

అత్తయ్య వినలేదు. తన జాకీకి కొత్తా పాతా లేవంది. సర్దుకుపోతుందంది. నిజంగానే అనంత్‌కీ, దానికీ చాలా వాటిల్లో సర్దుబాటు కుదిరింది - పొద్దున్నే లేవడం విషయంలో తప్ప. అది తెల్లవారు ఝామున (అనంత్ దృష్టిలో) పది గంటలకే లేచి, తలుపు గీరి, గీరి అనంత్‌ను నిద్రలేపి, అతని మంచం మీదకు ఉరికి, మొహం అంతా నాకి, అతని ఒళ్లో నిద్రపోయేది.

మళ్లీ నిద్రపోయేకాడికి పది గంటలకు నిద్రాభంగం చేయడమెందుకని అనంత్ ఫిర్యాదు. కానీ వినేవాళ్లెవరు? తీర్థయాత్రల నుండి తిరిగి వచ్చి మాంకాళి అత్తయ్య ఎప్పుడు తీసుకుపోతుందాని రోజులు లెక్కపెట్టుకుంటూండగానే రాంపండు రంగ ప్రవేశం చేసాడు.

సుమనోహారిపై అనంత్‌కు మోజు తీరిపోయినా రాంపండుకి తీరనట్టే ఉంది. ఐసుదిండు ఐడియా వల్ల నష్టపోయింది అనంత్ కానీ రాంపండు కాదుగా! ఎంత తుంటరి బుద్ధులున్నా సుమనోహారి, గొప్ప కవయిత్రి అని, ఆమె కవితా పుస్తకానికి అంతర్జాతీయ ఖ్యాతి రావలసినదేననీ - అదీ తన ద్వారా - అతని ప్రగాఢ నమ్మిక. అందుకే పబ్లిషరు పరంధామ్‌ని విందుకు పిలిచాడు. రాంపండు విందుకు పిలిచాడు అంటే ఆ భారం అనంత్‌దేనని వాళ్లని తెలిసున్న వాళ్లందరికీ తెలుసు. ముఖ్యంగా అచలపతికి. అందుకని రాంపండు రాగానే వెనక్కాలే వచ్చి నిలబడ్డాడు. రాంపండు వస్తూనే అనంత్‌ను అభినందించాడు.

"ఒరేయ్, నీ మంచి మర్యాదలకు జోహార్. ఇలా అడపాదడపా అందరిని పిలిచి భోజనం



పెట్టడం - ఓహో! వచ్చే కాలంలో స్కూలు పిల్లలు శిబిదధీచి పాఠంతో బాటు నీగురించి పాఠం కూడా చదువు కుంటారనుకో. ముఖ్యంగా గెస్ క్వెశ్చన్స్‌లో ఒకటి నీ పాఠంలో తప్పకుండా ఉండి తీరుతుంది"

అనంత్ విషాదంగా ఓ నవ్వు నవ్వి 'ఇంతకీ ఈసారి నేను ఎవర్ని ఆహ్వానించబోతున్నాను" అని అడిగాడు.

"పబ్లిషరు పరంధామ్‌ని"

"ఆయనతో నీకేం పనిట?"

"ఆయన నీ ఫ్రెండు మరియు క్లాసుమేటు రాంపండు ముచ్చట తీర్చబోతున్నాడు"

"రాంపండు ముచ్చట ఏమిటట?"

"సుమనోహారిని ప్రేమించడం"

ఈ పాటికే అనంత్ సహనం కోల్పోయాడు. ఇదివరకు ఇలాగే ప్రేమ పేరు చెప్పి రాంపండు 'తింటా' అనే అమ్మాయి ముఠాను తోలు కొచ్చాడు. వాళ్లు తిన్నంత తిని, తిట్టినంత తిట్టి పోయారు.

"ఒరేయ్, డొంక తిరుగుడు మానేస్తావా? అచలపతికి సెలవిచ్చి పంపేయమన్నావా?" అని అడిగాడు కోపంగా.

"ఇందులో తిరుగుడేం లేదురా. సుమనోహారి రాసిన కవిత్వం పుస్తక రూపంలో అచ్చేయడానికి ఆయనకు నచ్చ చెప్పాలి. ఆ పుస్తకం బయట వెలువడి, అమ్ముడుపోతే పరంధామునికి పైసా, రాంపండుకి ప్యార్, సుమనోహారికి పేరు దక్కుతాయ్".

"సరే, ఏడు. అచలపతీ, వీడికేదో లంచ్ కావాలట. ఏర్పాట్లు చూడు" అని పేపరు చూడసాగేడు అనంత్.

కానీ రాంపండు చెప్పినవన్నీ వింటూంటే పేపరు మీద దృష్టి నిలవలేదు. "ఒరేయ్ రాంపండూ, మీ పరంధామానికి ఏదైనా అజీర్తా? పిచ్చా? చిన్న పిల్లాళ్ల ఐటమ్సన్నీ చెప్తావేంట్రా?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

"ఓహ్, నీకు చెప్పలేదు కదా, పరంధామానికి తోడుగా పదేళ్ల వాళ్ల అబ్బాయి టింకూ వస్తున్నాడు. వాడి మాట అంటే ఆయనకు మహా గురిలే. ఏవరేజి రీడరుకి వాడికంటె ఎక్కువ స్టాండర్డ్ ఉండదని ఆయన నమ్మకం. వాడు

తలకాయ ఊపితేనే ఆయన చెక్కుచింపేది. లేకపోతే మన పరీక్ష ఫెయిల్".

అనంత్‌బుర్రలో సినిమాహాల్లో ఇంట ర్వల్‌లోలా టపటపాలైట్లు వెలిగాయి. 'టింకూ అంటే లావుగా, బంతిలా పడుతూ అరుస్తూ, అల్లరి చేస్తుండే వాడేనా? తండ్రి అంటే ఆ బక్క పలచటి... చూశాను మహాప్రభో చూశాను. ఓ సారి ఎక్కడో తగిలేరు. ఆ కుర్రాడి కున్నంత వాగుడు భువిలో ఎవరికీ ఉండదు. నోటికి ఎంత మాటపడితే అంత అనేస్తాడు."

"... ఏం నిన్నేమైనా అన్నాడా?" రాంపండు ఉత్సుకతతో అడిగాడు.

అనంత్ సమాధానం ఇవ్వకుండా ఊరుకునేటంతలో అచలపతి టపీమని అందించాడు.

"సర్ బ్రెయిన్‌ను ఉడత పిల్ల బ్రెయిన్‌తో పోల్చాడు సర్" అని.

రాంపండుకు జిజ్ఞాస పెరిగింది. "దాని కంటె ఎక్కువంటాడా? తక్కువంటాడా?"

అచలపతి జాగ్రత్తగా సమాధానమిచ్చాడు. "ఉడతకే ఎక్కువ మార్కులు పడ్డాయి".

అనంత్ ఓర్పు నశించింది. "ఒరేయ్ అవన్నీ అనవసరం. వాడి నోటికి హద్దూ పద్దూ లేదు. రేపొచ్చి నా మొహం కుళ్లిన చేప మొహంలా ఉందనవచ్చు." అనబోతుండగానే అచలపతి ధైర్యం చెప్పబోయేడు-

"డైనింగు హాల్లో లైటింగు తగ్గిస్తే పోలిక గుర్తు పట్టలేక పోవచ్చు సర్".

"నేనొప్పుకోను. బాటరీ లైటు వేసి చూసైనా పోలికలు పట్టగల సమర్థుడు వాడు. నేను రిస్కు తీసుకోను. వాళ్ల భోజనానికి వచ్చే వేళకి నేను ఇంట్లో ఉండను. నువ్వేమనుకున్నా సరే ఇంట్లోంచి పారిపోతాను. నువ్వే ఏదో ఒకటి సర్ది చెప్పుకో."

రాంపండు అడ్డు పడ్డాడు - మీ ఇంట్లో లంచ్ ఏర్పాటు చేసి నువ్వే వెళ్లిపోతే అసహ్యంగా ఉంటుంది. ఆయనకు కోపం వస్తుందేమో"

"నేనిక్కడే ఉండి ఆ కుర్రాడేదైనా వాగితే వాణ్ని ఒక్క టెంకిజెల్ల పుచ్చుకుంటే కోపంతో భాటు తాపం కూడా వస్తుంది. అది చూసుకో..."

"అదీ కరక్టే గానీ. నువ్వు కవిత్వం వింటూ సరైన చోట్ల ఆహా, ఓహో అని పరంధామ్‌ని ఇంప్రెస్ చేస్తావని సుమనోహరికి చెప్పానే!"

"నేను వావాకారాలు చేస్తానో లేదో కానీ ఆ కుర్రాడి చేత మాత్రం హాహాకారాలు చేయిస్తాను. దెబ్బకి సుమనోహరి పుస్తకం అచ్చుకాదు. నీ ప్రేమకు టాటా".

"ఒరే మరీ అంత ఫాస్టుగా రీలు తిప్పే యకురా. కావలిస్తే వెళ్లి పో నీకు పిచ్చనో, వెర్రనో అమావాస్య పున్నమనో ఏదో చెప్పుకుంటా. నలుగురు మనుష్యులను చూస్తే ఉక్కిరి బిక్కిరయ్యిపోతావని చెప్పుకుంటా".

అలాగే అనంత్ లంచ్ టైముకి వెళ్ళి పోయాడు. వెళ్తుండగానే పరంధామ్ అతని కొడుకు టాక్సీ దిగడం ఆ కొడుకు అనంత్‌ను పలక రించడం, అనంత్ మొహం తిప్పుకు వెళ్లిపోవడం జరిగింది. హోటల్లో భోజనం చేసి తిరిగొచ్చిన తర్వాత విచారిస్తే తన ఐక్యూ లెవెల్స్ గురించి ఆ కుర్రకుంక ఏదో అన్నట్టుగా తెలిసింది.

అచలపతి ఆపై ఇకనేమీ చెప్పలేనన్నాడు.

ఇంతలోనే రాంపండుకి ఫోన్. "చాలా థాంక్స్‌రా అనంతూ, అంతా బ్రహ్మాండంగా జరిగింది. కుర్రకుంక గాడికి పీకల మెయ్యాతిండి కూరేశాడు అచలపతి. దాంతో వాడు గుమ్మయి పోయి నేను సుమనోహరి కవిత్వం పాడి వినిపించినప్పుడల్లా ఆహా, ఓహో అనడం మొదలెట్టాడు".

"అయితే సుమనోహరి పుస్తకం అచ్చుకావడం, నీ ప్రేమ ఫలించడం ఖాయం అన్నమాట. కంగ్రాట్స్!"

"థాంక్స్. కానీ చిన్న విషయం ఒకటుందిరా. నన్ను ఓ ఇంటివాడిగా చూడడానికి నువ్వు ఏ త్యాగానికైనా రెడీ అని ఓ



సారి అన్నావు గుర్తుందా?"

అనంత్ మెదడులో అనుమాన పిశాచం మేల్కొంది. "అన్నానేమో. అలాటి అవకతవక వాగుడు చాలా వాగుతాను. ఇంతకీ దాని సంగతి ఇప్పుడెందుకు?"

"విషయం ఏమిటంటే ఆ టింకుగాడు మీ ఇంట్లో జాకీని చూసి ముచ్చట పడ్డాడు. కాదంటే వాడు చిన్న బుచ్చుకోవడం, ఏతావాతా నీ ప్రతిజ్ఞ ఫలించక పోవడం జరుగుతుందని భయపడి..."

"...భయపడి?"

"... ఆ కుక్కను వాడికి నీతరవున బహుమతిగా ఇచ్చేశాను. ఆ కుర్రాడు, వాడి మొహంలో సంతోషం చూసి ఆ పెద్దాడు ఎంత సంతోషించాడో చెప్ప..."

"ఒరి చవటా, అది నా కుక్క కాదు. మా అత్తయ్యది. అందునా మాంకాళి అత్తయ్యది. వెళ్లి పట్టుకొచ్చేయ్"

రాంపండుకీ కొన్ని సిద్ధాంతాలున్నాయి. "ఓ సారి ఇచ్చినది మళ్లీ వెనక్కి తీసుకోవడం మర్యాద కాదు" అంటూ ఫోన్ పెట్టేశాడు.

అనంత్ అచలపతిని పిలిచాడు. మంతనాలు సాగించాడు. ఈ చిక్కుల్లోంచి బయట పడడం ఎలా? అన్నాడు. ఆలోచించి, ఆలోచించి అచలపతి ఒక అయిడియా చెప్పాడు.

"సర్, భోజనం టైములో మాటల బట్టి పరంధామంగారు, వారి అబ్బాయి మాట్నీ కెళ్లి ఉండాలి. పవన్ కళ్యాణ్ సినిమా చూపిస్తే గానీ రాత్రి భోజనం చేయనని ఆ కుర్రాడు ఖరాఖండీగా చెప్పడం మేం విన్నాం సర్. వాళ్లు మేట్నీ నుండి తిరిగొచ్చేందుకు ముందే రాంపండుగారిని హోటల్ రూమ్‌కి వచ్చి వెయిట్ చేయమని పరంధామంగారు అనగా విన్నాను సర్".

"ఎగ్రిమెంటు రాసుకోవడానికి అయి వుంటుందిలే. అయినా దీనికీ, నా కుక్కకీ సంబంధం ఏమిటి?"

"అదే చెప్పబోతున్నాను సర్. ప్రస్తుతం మన జాకీ వాళ్ల హోటల్ రూమ్‌లో ఒక్కత్తే ఉంది. రాంపండుగారు అయిదున్నరకు వచ్చి రిసెప్షన్‌లో తాళం చెవి తీసుకుని ఆ గదిలో ప్రవేశించి పరంధామం గారి గురించి ఆరు గంటల దాకా వెయిట్ చేస్తుండాలి. రాంపండు గారి పద్ధతి మనకు బాగా తెలుసు. ఆయన అంతసేపు ఓపిగ్గా

కూహోలేరు. కాలుగాలిన పిల్లిలా రూములోంచి వరండాలోకి, వరండాలోంచి రూములోకి తిరుగుతూ, వెళ్లి లిఫ్ట్‌కి ఎదురుగా నిల బడుతూ...."

అనంత్ ఎగిరి గంతేశాడు. "ఇహ చెప్పకు. నాకు తెలిసి పోయింది. నేను మెట్ల దారిలోంచి ఆ టైములో అక్కడకు వెళ్లి, వాడు అలా వెళ్లగా చూసి కుక్కను వెంట బెట్టుకు వచ్చేయాలి. అంతేనా?"

"కరక్టుగా చెప్పారు. జాకీ కూడా మారు మాటాడకుండా, అదే, మారు మొరక్కుండా మీ వెంట వచ్చేస్తుంది".

సరిగ్గా అచలపతి చెప్పినట్టే జరిగింది. సాయంత్రం ఆరు గంటల కల్లా అనంత్ జాకీతో సహా ఇంటికి తిరిగి వచ్చి అచలపతి చేతికి దాన్ని అప్పగించి "వెళ్లి ఓ గదిలో కట్టేసిరా" అని ఆజ్ఞాపించాడు.

ఆ తర్వాత అతను తెచ్చిన కాఫీ తాగుతూ, హాయిగా వెనక్కి వాలి 'అచలపతీ, నీ బుర్ర అమోఘమోయ్, నెపోలియన్ నీ దగ్గర కరస్పాండెన్స్ కోర్సు తీసుకుని ఉంటే యుద్ధంలో ఓడిపోయే వాడు కాదు. ఇదిగో ఆ టేబులు మీద ఓ వంద రూపాయల నోటుంది. నీకేమైనా పనికొస్తుందంటావా?" అని అడిగాడు.

"థాంక్యూ సర్" అని అచలపతి ఆ వందా తీసుకుంటూండగానే అనంత్ హఠాత్తుగా ఉలిక్కిపడ్డాడు "అవునూ ఈ పబ్లిషరు గాడు తిరిగివచ్చాక కుక్క మాయమయిన సంగతి గుర్తిస్తాడు కదూ. ఆ సమయానికి రాంపండు అక్కడుండడంతో జాకీ అంతర్ధానానికీ, వాడికీ లింకుందని అనుమానిస్తాడు. రాంపండు మీద కోపం, సుమనోహరి పుస్తకం వేయననడం, ఆమెకు రాంపండుపై అలక, ఎంగేజిమెంట్ బ్రేక్, పశ్చాత్తప్త హృదయంతో సుమనోహరి నన్ను పెళ్లి చేసు కుంటాననడం. అమ్మ బాబోయ్! అటు తిరిగి, ఇటు తిరిగి ఇది నా మెడకు చుట్టుకొనేట్టుందే! ఇదేమిటి అచలపతీ, ఇలా చేశావ్? నెపోలియన్‌కి కరస్పాండెన్స్ కోర్సు పంపక. అడిగినా కుదరదని చెప్పేయ్..." అచలపతి సమాధానం చెప్పేటంతలో డోరు బెల్లు మోగింది.

"ఎవరు? నెపోలియనా? కరస్పాండెన్స్ కోర్సు ఇవ్వనన్నావని డైరెక్టుగా ట్యూషన్‌కి వచ్చేశాడా?" ఖంగారులో అనంత్ ఏదేదో వాగేస్తున్నాడు.

అచలపతి వెళ్లి కిటికీలోంచి చూసివచ్చి "పరంధామం గారండి. కోపంగా ఉన్నట్లు కనబడుతోంది" అన్నాడు అతిశాంతంగా.

అనంత్ సోఫాలోంచి ఎగిరి వెనక్కి దూకాడు. అచలపతి తలుపు తీయగానే పరంధామ్ దూసుకువచ్చాడు. "ఎక్కడయ్యా? ఈ అనంత్ పెద్దమనిషి?" అని అరిచాడు.

"ఎక్కడంటే ఏం చెప్పగలం సర్? ఎక్కడైనా ఉండవచ్చు" అన్నాడు అచలపతి వేదాంత ధోరణిలో.

"వాడు నా హోటల్ రూమ్‌కొచ్చి మా అబ్బాయి కుక్క ఎత్తుకు పోయాడు.."

"మా అబ్బాయి కుక్కట!" అనంత్ పళ్లు నూరుకున్నాడు సోఫా వెనకనుండి.

"ఆయనేం చేస్తుంటారో పాపం ఆయనకే తెలియదండి" అని నిట్టూర్చాడు అచలపతి.

పరంధామ్ దూకుడు ఆగింది. "అంటే మనిషి అదోరకమా?" అని అడిగాడు సందేహిస్తూ.

"అదే రకం" అచలపతి సందేహం నివృత్తి చేశాడు.

"అంటే... అమావాస్యకు, పున్నమికీ..."

"ఆ పట్టింపులు లేవు. తిథి ఏదైనా తీరు ఒక్కటే"

పరంధామ్ బెదిరాడు. "మరి ఎప్పుడు రెచ్చిపోతాడంటావ్"

"అలా చెప్పడం కష్టం సర్. కాస్త పుష్టిగా ఉన్న మనుషులంటే ఆయనకు కాస్త చికాకు".

"అంటే లావనా?"

"అనుకోవచ్చండి".

"నేను లావే!" అన్నాడు పరంధామ్ తనను తాను చూసుకుంటూ. "అంటే నన్ను చూసి మీద పడతాడంటావా?"

అచలపతి సన్నగా దగ్గాడు. "సుగుణం ఏమిటంటే అనంత్ గారికి ఆయన వీక్నెస్ ఆయనకు తెలుసనండి. అందుకే మిమ్మల్ని భోజనానికి పిలిచినప్పుడు తనను తాను కంట్రోలు చేసుకోలేమోనన్న భయంతో బయటకు వెళ్లి పోయారు. మీరేమైనా అనుకుంటారేమోనని సందేహిస్తూనే..."

"అనుకున్నాను. వింతగా ఉందనుకున్నాను. మా టింకూ కూడా వింతగా ఉందనుకున్నాడు. గొప్ప బ్రెయిన్‌లే మా వాడిది. ఇంతకీ ఈ పెద్దమనిషెక్కడ?"

"సోఫా వెనకాల చూస్తే కనబడవచ్చండి".

"అదేమిటి? సోఫా మీద కూచుంటారు. కానీ సోఫా వెనకాల కూచోడవేమిటి?"

"చెప్పాను కదండీ, ఆయన తరహాయే వేరని"

పరంధామ్ వణికేడు. "కాస్త గేటు దాకా సాయం వస్తావా?" అన్నాడు.

పరంధామ్ వెళ్లాక ఒళ్లు విరుచుకుంటూ అనంత్ బయటకు వచ్చాడు.

అచలపతి కనబడగానే అడిగాడు "అసలు ఆ బొండాం గాడికి కుక్క నా దగ్గర ఉన్నట్టు అనుమానం ఎలా వచ్చిందయ్యా?" అని.

"మీరు కుక్కతో సహా హోటల్ రూములోంచి బయటకు వస్తున్నట్లు చూశానని రాంపండు గారు ఆయనకు చెప్పారు సర్".

"రాంపండు చూశాడా?"

"లేదు సర్. అలా చెప్పమని నేనే ఆయనకు ఫోన్ చేసి చెప్పా. అలా అయితే ఆయన మీద అనుమానం రాదని నా అంచనా. లేకపోతే మీరిందాక ఊహించినట్టే జరుగుతుందని నాకూ అనిపించింది."

"వండ్రఫుల్. తీసుకో ఇంకో వంద. అదేమిటి? నీ చేతిలో ఆ వంద ఎవరిచ్చారు?"

"పరంధామ్‌గారు కుక్కను తిరిగి ఇచ్చి నందుకు సంతోషించి..."

"ఆ ..." అంటూ కొయ్యబారిపోయాడు అనంత్. " ఏ క్షణాన్నైనా అత్తయ్య వచ్చే ఈ సమయంలో..."

"ఖంగారు పడకండి సర్. నేను తిరిగిచ్చింది జాకీని కాదు. మీరు హోటల్‌కి వెళ్లిన టైములోనే నేను బజారు కెళ్లి ఇంకో ఆల్సేషియన్ డాగ్ కొని తెచ్చా. పరంధామం గారికి తేడాలు ఏం తెలుస్తాయి కనక? పైగా జాకీని చూసిందే ఇవాళ. ఇంకా మచ్చిక కూడా కాలేదు.."

"వండ్రఫుల్లెస్ట్. అందుకో ఇంకో వంద"

"థాంక్యూసర్" అన్నాడు అచలపతి తలవంచి.

**-ఎమ్బీయస్ ప్రసాద్**

**(పిజి ఉడ్‌హవుస్ రాసిన 'ఎపిసోడ్ ఆఫ్ డాగ్‌మెకిన్‌తోష్' కథ ఆధారంగా)**

### జస్ట్ ఫర్ ఫన్

### రాంగ్ నెంబర్



**మంత్రిగారు పెంపుడు కుక్కని తీసుకుని జూబిలీహిల్స్‌లో మార్నింగ్ వాక్ ప్రారంభించాడు.**

**ప్రతిపక్ష నాయకుడు ఎదురొచ్చి పలకరించాడు. "ఏంటీ, గాడిదని వెంటేసుకుని షైరు కొడుతున్నావు?"**

**మంత్రిగారు మండిపడ్డాడు. "కళ్లు కనబడ్డంలా! అది గాడిద కాదు. కుక్క".**

**"చిత్తం, నేను ప్రశ్న అడిగింది తమర్ని కాదు. కుక్కని" కూల్‌గా అన్నాడు ప్రతిపక్ష నాయకుడు.**

**-గోపి**

- మల్లాది వెంకట కృష్ణమూర్తి

**జరిగిన కథ**

అనగనగా ఓ బామ్మ. వయసుతో సంబంధం లేని కుర్రమనసామెది. అనన్య ఆ బామ్మకు మనవరాలు. భక్తి ఎక్కువ. అయితే సినీ తారల పౌరాణిక గెటప్పుల లోని ఛాయా చిత్రాలను పూజించే తత్వం. అనన్య పనిచేసే బాంక్‌లోనే ఆఫీసర్‌గా పని చేస్తున్న నిరుపమ్‌కి ప్రతిరోజు కట్ చేసిన ఫోటోభాగాలు వెనక 'ఐ లవ్ యూ' రాసి, పోస్ట్‌లో వస్తుంటాయి. నిరుపమ్ అన్నయ్య వెంకట రత్నం ఓ పెద్ద ఇల్లు ఆ ఊళ్ళోనే వుందని అతి త్వరలో అది తమకు రాబోతుందని అందరితోనూ చెబుతూ వుంటాడు. 'నీకు అక్క చెల్లెళ్ళు ఉన్నారా' అన్న అనన్య ప్రశ్నకు జవాబుగా జాంబవతి గురించి బామ్మ చెప్పడం మొదలు పెడుతుంది. జాంబవతికి పాముల్ని పెంచే అలవాటు ఉండడం వలన ఆమెకు వచ్చిన పెళ్ళి సంబంధాలన్నీ తప్పి పోతూ ఉంటాయి. అలా బామ్మ తరపు బంధువులలో అనన్య తప్ప వేరే వారసులెవరూ లేక పోవటం జరుగుతూ ఉంటుంది. ఈ కథ అంతా బామ్మ చెబుతూవుండగా వచ్చిన లింగ మయ్యను చూడగానే బామ్మ అనారోగ్యం నటిస్తుంది. అనన్య ఎంత అడిగినా వివరాలు చెప్ప కుండా దాట వేస్తుందామె. అనన్యకి లవ్‌లెటర్ రాయడం కోసం జి.గురుప్రసాద్ అనే జర్నలిస్ట్ సహాయాన్ని కోరుతాడు నిరుపమ్.



"ఆ లవ్ లెటర్ పేరు 'స్వేచ్ఛ వైపు' బావుందా?" అడిగాడు జిగురు.

"అదేమిటి? ప్రేమ లేఖలకి పేర్లు కూడా పెట్టాలా?" అడిగాడు నిరుపమ్.

"శీర్షిక పెట్టకుండా మా జర్నలిస్టులం ఏం రాయం"

"సరే బావుంది చదువు"

"సెభాష్ కామ్రేడ్,

మీ నించి లావా లా ప్రవహించే అందం

నన్ను తాకింది. నక్సలైటు, పోలీసులకి మధ్య జరిగే ఎన్‌కౌంటర్‌లో చెలరేగే వేడిరక్తం, వాడి పోరాటం, నిప్పుల శకలాలలా అది నన్ను ముంచేస్తోంది. ఇక ఎటూ తప్పించుకోలేని పరిస్థితిలో నేను బూర్జువా గుండెల్లో దిగే తుపాకీ తూటాలా ఈ ప్రేమలేఖని మీ గుండెల్లోకి దింపుతున్నాను కామ్రేడ్!

మావో సేటుంగ్ సెలవిచ్చినట్లు..."

"స్టాప్" అరిచాడు నిరుపమ్. అతని చేతిలో అప్పటికే గుప్పెడు జుట్టువుంది.

"ఏం?" అడిగాడు జిగురు.

"నాకు ఒక్కముక్క అర్థం కాలేదు. అనన్య నన్ను పిలిచి దీనికి అర్థం చెప్పమంటే ఎలా చెప్పగలను?"

"ఏమర్థం కాలేదు నీకు? నేను విప్లవ పత్రికల్లో పనిచేసినప్పుడు ఇలాగే రాస్తే ప్రజలందరికీ అర్థం కాలేదా?"

"దయచేసి ఇది చించెయ్. నువ్వు చింపేస్తే నేను ...అగ్గి పెడతాను. తర్వాతది తర్వాత చదువుదువుకాని"

"సర్లే. నీ బీర్ కదా నేను తాగేది. నీ ఇష్టం"

దాన్ని చించేసాడు. ఆ కాగితాన్ని నిరుపమ్ జిగురు అగ్గిపెట్టెని వెలిగించి కాల్చేసాక కానీ అతని మనసు తృప్తి పడలేదు.

"ఊఁ ఇప్పుడు ఇంకోటి చదువు" చెప్పాడు నిరుపమ్ మంచినీళ్ళు తాగాక.

జిగురు మరోసారి దగ్గి రెండోది చదవసాగాడు.

"మై డియర్ నంబర్‌వన్ హీరోయిన్... ఎలా వుంది ఓపెనింగ్?"

"సాఫ్ట్‌గా బావుంది. ఆమే నా హీరోయిన్. చదువు చదువు"

"మై డియర్ నంబర్ వన్ హీరోయిన్, ఏ ఏంగిల్ నించి చూసినా నీ బాడీ మనస్సు జనిక్‌గా ఎంతో బావుంది అని నాహృదయ దర్శకుడు అభిప్రాయపడుతున్నాడు. నిన్ను చూసినప్పుడల్లా బెంక్‌లో సీట్ మీద కూర్చోనివ్వకుండా చూసేలా చేస్తున్నావు. నా మనసుని తెలియచేసే చిన్న ట్రెయిలర్ ఈ ఉత్తరం. మొత్తం ప్రివ్యూ మీ జవాబు అందాకే. మనిషి జీవితం అనూహ్యమైన మలుపులతో, మెలోడ్రామాతో సాగాలన్నది నా ఆశ. మన వివాహానంతరం మన జీవితంలో స్టీరియోఫోనిక్ సెవెంటీ యం.యం. చిత్రంలోలా ఎంతో రిచ్‌గా, ఇంటర్వెల్ తర్వాత కూడా క్లయిమాక్స్ దాకా చప్పబడిపోకుండా భారీగా వుంటుందని నా హామీ. నా జీవితాన్ని డైరెక్ట్ చేయడానికి నువ్వు అంగీకరించాలని, కట్ చెప్పవని ఆశిస్తూ గోల్డెన్ జూబ్లీలాంటి నీ జవాబు కోసం ఎదురు చూస్తున్నాను.

శుభం.

నిరుపమ్

"దీనికి టైటిల్ సితార. ఎలా వుంది?" ప్రశ్నించాడు జిగురు.

"టైటిల్ మాత్రమే బావుంది. సినిమా పత్రికలో కొత్త సినిమా రివ్యూ కాపీచేసి పంపాననుకుని పక్కన పడేయగలరు. ఇంకోటి చదువు"

"అయితే ఇది విను".

"హహ్హహ్హ అనన్య.

నీలిరంగు కవరులో నా వేలిముద్రలు పడకుండా మీరందుకున్న ఈ ఉత్తరాన్ని ఆఖరి క్షణం వరకు గుండెలు చేతిలో పట్టుకుని చదవండి. నా మనసుని అనేక మార్లు పోస్ట్‌మార్టం చేసాక అసలు రహస్యం పట్టుబడిపోయింది. చివరి దాకా సస్పెన్స్ నిన్ను నీడలా వెంటాడకుండా వుండడానికి ఇప్పుడే చెప్పేస్తున్నాను. నాకు మీరంటే మహాప్రేమ. క్రైం, హింస, టెర్రరిజంల కన్నా కూడా ఎక్కువ ఇష్టం అని తుపాకి పేల్చి మరీ చెప్తున్నాను".

"ఆపాపు" నిరుపమ్ అడ్డుపడ్డాడు. అతని రెండో గుప్పెట్లోకి కూడా జుట్టుచేరింది.

"ఏం?"

"ఇది బాలేదు"

"ఎందుకు బాలేదు? నేను అపరాధ పరిశోధనలో సబ్‌గా పనిచేసేటప్పుడు ఇలాంటివి ఎన్నోరాసి పాఠకులని అలరించాను'

"ప్రేమలేఖంటే సున్నితంగా మృదువుగా వుండాలి కాని ఇలా బ్లడ్‌లు, మర్డర్‌లుతో నిండి వుండకూడదని ఎల్.కె.జి. వాడినడిగినా చెప్తాడు"

"అలానా? పోనీ ఇది విను...

"డార్లింగ్ అనన్య,

అబ్బ! హ... ఉ... ఇంకా... అమ్మ... అయ్యో... అబ్బా నిన్ను తలచుకుంటేనే ఇదైపోతున్నాను..."

"స్టాప్ స్టాప్" రెండుసార్లు అరిచాడు నిరుపమ్ లేచి నిలబడి.

"నేనింకా మొదటి పేరాకూడా పూర్తి చేయకుండా నేనా?"

"గురూ నువ్వు సెక్స్ పత్రికలో కూడా పనిచేసావని నాకు తెలీదు జిగురూ"

"మన్మథబాణం అనే పత్రికలో పనిచేసాను. ఊహించుకుంటే, హాట్‌హాట్‌గా ఏదేదో అయిపోయేలా రాసానీ లెటర్ విను. అన్నట్లు ఈ లెటర్ శీర్షిక చెప్పనా?"

"శ్రమ పడక! ఇది మాత్రం ఖచ్చితంగా కేన్సిల్"

"ఆమె ఏకమై నిన్ను గాఢంగా హత్తుకుపోవాలంటే, ఇది చదివి తీరాలి, సర్లే సర్లే శోభనం రాత్రికి చదవడానికి మీ పెళ్ళికి ప్రజంట్ చేస్తాలే ఈ మన్మథబాణాన్ని. ఇంకోటి విను. నీవు కూర్చో"

నిరుపమ్ కూర్చున్నాక గొంతు సర్దుకుని మళ్ళీ చదవసాగాడు జిగురు.

"హల్లో ల్లో ల్లో ల్లో ల్లో ల్లో మేడం,

హిహ్హిహ్హి... అబ్బో అబ్బో అహ్హహ్హ

మీలోని అణువణువుని చూస్తూంటే, అలా తన్నుకు వస్తోంది నవ్వు. నవ్వుతోపాటు లవ్వు. మీ అందంలోని మొదటి అణువునించి చివరి అణువు దాకా అబ్బ... అయ్యో... పొట్ట పగిలి పోయిందంటే నమ్మండి. మీరు నాతో మీ జీవితాన్ని పంచుకుంటే, నిత్యం మూడు నవ్వులు, ఆరు జోకులుగా మన జీవితాలు సాగిపోతాయి. ఇది జోకుకాదు. నిజ్జంలాంటి నిజ్జం సుమండి.

జవాబు రాస్తారు కదూ.

ఉంటానండి హిహ్హిహ్హిహ్హి

మీ నవ్వుల రేడు."

ఎలాంటి భావం వ్యక్తంకాని కళ్ళతో చూస్తున్న నిరుపమ్‌ని కాసేపు చూసి అడిగాడు జిగురు.

"ఏం? ఇదీ బాలేదా?"

"శీర్షిక ఆలోచిస్తున్నాను. జోకర్ బావుందా లేక..."



"శీర్షిక కూడా నేనే ఖాయం చేసాను. చిరునవ్వుకి చిరునామా"

"ఈ ఉత్తరం వంపి నవ్వుల పాలవదల్చుకోలేదు. దీన్ని ఎవరు చదివినా నన్ను చూసి నవ్విపోతారు. లవ్ లెటర్ ఎప్పుడూ లలితంగా ఉండాలంటారు"

ఇంకో కాగితం అందుకుని చెప్పాడు.

"అయితే ఇది విను. అలాంటిదీ సిద్ధం చేసాను.

ఓ స్నేహ శీలీ, ఓ దయామయీ

నిన్నీ మధ్యనే చూడడం తటస్థించిందమ్మ. మండు వేసవిలో చల్లటి మల్లెలు నెత్తిన కురిసిన అనుభూతికి గురయ్యానమ్మ. నా ఇంట్లో నువ్వు బొట్టు కాటుకలతో రంగవల్లులు దిద్దే తరుణం వుందా? ఉంటే ఎప్పుడో చెప్పమ్మా..."

"కాబోయే పెళ్ళాన్ని పట్టుకుని అమ్మా తల్లి అంటారేమిట్రా ఎక్కడైనా?"

చిరాకు పడ్డాడు నిరుపమ్.

"మహిళా పత్రికల్లోని భాషతో రాస్తే, అలాగే ఏడుస్తుంది మరి. ఈ లెటర్ శీర్షిక ఇయంగేహే లక్ష్మి"

"ఇంకేమైనా వున్నాయా?" నీరసంగా అడిగాడు నిరుపమ్.

"చాలా వున్నాయ్ ఇది విను.

అనన్య. నీ అందం అనన్యం

చెయ్యవోయ్ నాతో నువ్వు నేస్తం

లేకపోతే నా జీవితం అయోమయం

నువ్వు చేసావంటే నా మదికి గాయం

దాంతో నేను ఖాయంగా ఖతం..."

"దీన్ని ఆమెకి పంపలేదు ఇంకా నయం" జిగురు వాక్ ప్రవాహాన్ని అడ్డుకున్నాడు నిరుపమ్.

"ఇంకా హేయం, గేయం, ప్రియం, మయం, భయంలాంటి అంత్య ప్రాసలతో చాలా వాక్యాలున్నాయి బ్రదరూ"

"ఉంటే ఉంచుకో సోదరా నాకిది అస్సలు బాలేదు"

ఇంకోటి వెంటనే తక్కున చదివాడు జిగురు.

"ఏయ్ అమ్మదొంగా, ఎక్కలున్నావు? నువ్వు భలే బావున్నావు. నన్ను పెళ్ళాడుతావా? అప్పుడు మనిద్దలం ఎంచక్కా రోజా తాయిలం తింటూ, చందమామ లావే జాబిల్లి లావే అంటూ పాటలు పాడుకుంటూ, ఎంచక్కా సముద్రం వడ్డున పిచ్చుక గూడులాంటి బొమ్మరిల్లు కట్టుకుని అందులో కాపులం ఉందామేం? నేను వన్ టు త్రి చెప్పేలోగా నువ్వు సలే అనాలి. ఒకేనా?

ఒన్... టు... త్రి...

టాటా ఛీరియో

- నిలుపమ్

ఇది ఎలావుంది" అడిగాడు జిగురు.

"చాలా బావుంది కాని ఇరవై ఏళ్ళ క్రితం రాయాల్సిన లేఖ ఇది"

"పోనీ దిన పత్రిక టైప్‌లోది చదవనా?"

"నేను నిన్ను ప్రేమిస్తున్నానని పలువురు అను కుంటున్నారు. నువ్వు నన్నెందుకు ప్రేమించకూడదని పలువురు ప్రశ్నిస్తున్నారు.... ఇలా వుంటుంది కదా అది?" అడిగాడు నిరుపమ్ కారాలు, మిరియాలు నూరేలా చూస్తూ.

"దిన పత్రిక టైప్ లేఖ అలా కాక ఇంకెలా వుంటుంది? కొంపదీసి దొంగతనంగా చదివేసావా ఏమిటి?"

"ఇదేమీ బాలేదు. ఇంకో మంచిదేమైనా చూడు"

"చూడు బ్రదర్, నేను పనిచేసిన పత్రికలు ఇంతే. ఇంతకు మించి నాకు రాదు, చేతకాదు".

"అయితే నీ బీర్, త్రిబుల్ ఫైవ్, బిర్యానీలన్నీ కేన్సిల్" లేచాడు నిరుపమ్.

"అదికాదు బ్రదర్. నే చెప్పేదేంటంటే...

ఆ జిగురుని వదిలించుకోడానికి నిరుపమ్ బీర్, త్రిబుల్ ఫైవ్ సిగరెట్స్, బిర్యానీ వగైరాలని సమర్పించుకోక తప్పలేదు. నిరుపమ్ కూడా ఆ బార్ ఎట్మాస్ఫియర్ చూసి టెంప్ట్ అయి అరగుక్క తాగుదామనుకుని అంతటితో కుదరక ఆరు గుక్కలు చల్లటి బీర్ తాగాడు. మనిషి బుర్ర ఆలోచించే వేగం సగటున నిముషానికి వంద యూనిట్లయితే, ఆల్కహాల్ లోపలికి వెళ్ళగానే అది వెయ్యికి పెరుగుతుందని నిరుపమ్ అనుభవ పూర్వకంగా గ్రహించాడు. వేగం అలా పెరగడంతో అతని స్మృతి పథంలో కొద్ది రోజులక్రితం చదివిన మేథ్స్ ప్రాబ్లం స్ఫురించింది. అంతదాకా అనేక పత్రికల భాషలో ప్రేమ లేఖలు వినడం వల్లనేమో మేథ్స్ లేఖ'ని బార్‌లోని పేపర్ నేప్‌కిన్ మీద రాసాడు. రాసాక జిగురుకి చదివి వినిపించాడు.

"డియర్ 142,

ఒన్-ఫోర్-టు-ఎయిట్-ఫైవ్-సెవెన్ అనే సంఖ్య గొప్ప మొగుడు పెళ్ళాల లాంటివి. 142 857ఏం చేసినా అవి విడిపోవు.

142 పెళ్ళాం అనుకో - 857 మొగుడనుకో. వాటిని విడగొట్టడానికి ఒకరు కాదు, ముగ్గురు కాదు ఆరుగురు ప్రయత్నించినా చెడిపోవు, విడిపోవు, ఎలాగంటే...

142 857 × 1 = 142857

142 857 × 2 = 285714

142 857 × 3 = 428571

142 857 × 4 = 571428

142 857 × 5 = 714285

142 857 × 6 = 857142

చూసావా డియర్?

మొదటి లెక్కలో ఒకడొచ్చి ఇద్దరికీ ఎక్కించినా అవి కదల్లేదు మెదల్లేదు.

రెండో లెక్కలో ఇద్దరొచ్చి ఇద్దరికీ ఎక్కించినా 857 గాడు చెక్కు చెదరలేదు. 142 తన మొగుడ్ని అటు ఇటు కాసుకుంది.

తర్వాత ముగ్గురొచ్చి ఏం చేసినా మళ్ళీ పెళ్ళాం అదేపని చేసింది.

ఆ తర్వాత నలుగురొచ్చారు. ఈసారి పెళ్ళాన్ని అంటే 142ని, మొగుడు అటు ఇటు కాచుకున్నాడు. అయిదో లెక్కలో కూడా అలాగే కాపాడసాగాడు.

బలం చాల్లేదని ఆరుగురొచ్చాక ఏమైందో చూసారా? మొగుడిటు 857- పెళ్ళాం అటు 142గా మారారంతే. బయటి వాళ్ళని అంటే తోటి అంకెలని సపోర్ట్ తెచ్చుకోకుండా వాళ్ళల్లో వాళ్ళే సర్దుకున్నారు.

గ్రేట్ మేరేజ్ స్టోరీ... కాదంటావా?

నేను 857ని. నువ్వునా 142గా వుంటావా అని అడగడానికే లెటర్ రాస్తున్నాను.

ఏమంటావ్? నీ ప్రేమనే హెచ్చవేతతో నాలోని వంటరితనం అనే తీసివేతని జీరో చెయ్యాలని



కోరుకుంటూ - ని 857.

ఆ లేఖని అందుకుని పెన్నుతో చెక్ చేసి చెప్పాడు జిగురు-

"నే రాసిన వాటికన్నా ఇది అంత గొప్పగా ఏం లేదు"

"నాకిదే బావుంది. రేపు అనన్యకిదిస్తాను"

"ఈ నేప్‌కిన్ మీద బార్ పేరు ముద్రించి వుంది. నువ్వు తాగుబోతు అనుకోగలదు"

బిల్లు చెల్లించాక ఇద్దరూ తూలుతూ బయటికి నడిచారు. కాసేపు స్కూటర్‌తో అవస్థ పడ్డాడు నిరుపమ్.

"స్కూటర్ స్టాండ్ ఎలా తీయాలి?" అడిగాడు నిరుపమ్ జిగురుని.

"నీకు వచ్చుండాలే?"

"మర్చిపోయినట్లున్నాను"

ముక్కు మీద వేలు వేసుకుని చెప్పాడు జిగురు.

"ఛ్ఛొచ్ఛొచ్ఛో... ఆటోలో పోదాం. రేపు స్కూటర్ తీసుకోవచ్చు"

"రేపటికీ గుర్తురాకపోతే?" అనుమానంగా అడిగాడు నిరుపమ్.

"అప్పుడా స్కూటర్ అమ్మేద్దువుకాని'

"శభాష్"

ఇద్దరూ తూలుకుంటూ బయటికి నడిచారు. జిగురుని ఓ ఆటోలో ఎక్కించి ఇంకో ఆటో ఎక్కాడు నిరుపమ్. ఆటో డ్రైవర్‌కి నిరుపమ్ పరిస్థితి గమనించగానే హుషారొచ్చింది. ఫలితంగా ఆటోని నెక్లెస్ రోడ్‌మీదకి మళ్ళించాడు. తన ఇంటికి చుట్టు తిప్పి తీసుకెళుతున్నాడన్న స్పృహే లేదు నిరుపమ్‌కి.

కరెంట్ లేక పూర్తిగా చీకటి. అక్కడక్కడ దూరంగా మిణుకు మిణుకు మంటున్న నక్షత్రాల్లాంటి దీపాలు.

నిర్మానుష్యంగా వుందాప్రాంతం.

ఆటో హెడ్‌లైట్ కాంతిలో ఓ ముసలతను రోడ్డుకి అడ్డంగా కనబడగానే ఆటోని ఆపాడు డ్రైవర్.

అతను నల్లగా దృఢంగా వున్నాడు. గోచీ మినహా వంటి మీద ఇంకేం లేదు. జడలు కట్టిన జుట్టు మోకాళ్ళ దాకా వేలాడుతోంది. పెరిగిన గడ్డం, తీక్షణంగా చూసే కళ్ళు, మెళ్ళో నల్లటి కాశీతాడు. దానికి గవ్వలు, పూసలు.

అంత బీరు మత్తులో కూడా నిరుపమ్‌కి అతన్ని చూడగానే వెన్నులో వణుకు పుట్టింది.

"ఏం కావాలి?" అడిగాడు నిరుపమ్.

ఆ ముసలతను గట్టిగా నవ్వాడు. ఆశబ్దానికి ఆటో డ్రైవర్‌కి కూడా ముచ్చెమటలు పోసాయి.

"అది నేనడగాల్సిన ప్రశ్న. నీకేం కావాలి? ఇందాక నువ్వు బార్‌లో ఓపెన్ చేయించిన బీర్ బాటిల్‌లో దాక్కున్న భూతాన్ని పూర్వం అల్లావుద్దీన్‌కి అద్భుత దీపం ద్వారా కనబడ్డాను. ఇప్పుడు నీకు కనబడుతున్నాను. ఆ బాటిల్‌లో చిక్కుకున్న నన్ను బయటికి తప్పించినందుకుగాను కృతజ్ఞతగా నీవేం కోరితే అది ఇస్తాను.

అడుగు. ఏం కావాలి?" బదులుగా ప్రశ్నించాడతను.

"నాకా? అమెరికా చూడాలని వుంది కాని సెప్టెంబర్ పదకొండున అమెరికాలో రెండు విమానాలు ట్విన్ టవర్స్‌ని ఢీకొట్టినప్పటినించి నాకు విమానం ఎక్కాలంటే భయం. పోనీ ఓడలో వెళ్దామా అంటే టైటానిక్ సినిమా చూసినప్పటినించి ఓడ ఎక్కాలన్నా భయమే. అంచేత బాంబే నించి అమెరికాకి రోడ్డు మార్గం వెయ్యి".

అతను గడ్డంతడుముకుంటూ కాసేపు ఆలోచించి చెప్పాడు.

"నో నా వల్ల కాదది. ఎంత మట్టి కావాలి? ఎంత కంకర కావాలి? ఎంత తారు కావాలి? ఎంతమంది మాటవినే లేబర్ కావాలి?

ఇంకేదైనా అడుగు"

"సరే అయితే, హైద్రాబాద్‌కి గోదావరి నించో, కృష్ణానది నించో నీ ఇష్టం కాని మంచి నీరు వచ్చే ఏర్పాటు చెయ్యి"

మరోసారి ఆలోచనగా గడ్డం నిమురుకున్నాడు. ఆ ముసలాయన చిన్నగా తలపంకించి చెప్పాడు ఓ నిముషం తర్వాత.

"అదసలు నీ మనవడు పుట్టినా కూడా జరగదు.

సరే మొదటిదే ఇస్తాను. టూ లైన్స్ రోడ్డు కావాలా? లేక ఫోర్‌లైన్స్ రోడ్డా?" ప్రశ్నించాడు.

"అంటే జంటనగరాలకి నీళ్ళు తెప్పించడం నీవల్ల కూడా కాదా?"

"కాదు"

"ఇంక నువ్వేం భూతానివంటా నువ్వేం భూతానివి?" అరవసాగాడు.

"సార్ సార్ మీ ఇల్లొచ్చింది" ఆటో అతను భుజం తట్టి పిలిస్తేగాని పరవశంలో వున్న నిరుపమ్‌కు మెలకువ రాలేదు.

**(ఇంకావుంది)**

---

**జస్ట్ ఫర్ ఫన్**

## పాపం... సుబ్రావ్

పాపం, సుబ్బారావు ఎప్పుడూ ఫ్రెండ్సు జోకులకి బలయిపోతూ ఉంటాడు. ఓ రోజు ఓ ఫ్రెండు వచ్చి "సుబ్రావ్! నేనో ప్రశ్న అడుగుతాను. కరెక్టుగా సమాధానం చెప్పాలి మరి" అన్నాడు.

సుబ్బారావు కీడు శంకిస్తూనే "అడుగు" అన్నాడు.

"పొద్దునే ఖాళీ కడుపుతో నువ్వు ఎన్ని ఇడ్లీలు తినగలవు?"

"ఓస్, ఇంతేనా "అనుకుని "పది ఇడ్లీలు ఈజీగా లాగించేస్తా" అన్నాడు సుబ్బారావు గొప్పగా.

ఫ్రెండు ఎగతాళిగా నవ్వేడు. "అందుకే నిన్ను సుబ్బారావు అంటారు. మొదటి ఇడ్లీ తిన్నాక అది ఖాళీ కడుపు ఎలా అవుతుందోయ్, పిచ్చి మొహమా?" అని గేలిచేశాడు.



సుబ్బారావు మనసులో ఏడ్చుకున్నా జోక్‌కి ఎంజాయ్ చేశాడు. ఈ జోక్‌ని తన భార్యమీద ప్రయోగించి ఆమెని ఆట పట్టిదామని ఇంటికెళ్లాడు. సుబ్బారావు భార్య వంట పనిలో తల మునకలుగా ఉంది. సుబ్బారావు హుషారుగా ఫ్రెండు తనని అడిగిన ప్రశ్నని ఆమెని అడిగాడు.

సు.రా. భార్య బిజీగా ఉండి అతడిని పట్టించుకోలేదు. 'ఖాళీ కడుపుతో ఎన్ని ఇడ్లీలు తినగలవం'టూ సుబ్బారావు ఆమెని వేధించసాగాడు.

సు.రా. భార్య కసురుకుని "ముప్పయి తింటాను. సరేనా" అని అరిచింది.

పాపం, సుబ్బారావు నీరుగారి పోయాడు. "నువ్వు పది ఇడ్లీలు అని చెప్పి ఉంటే నీకో మంచి జోక్ చెప్పి ఉండే వాణ్ణి తెల్సా!" అని బిక్కమొహం వేశాడు.

-గోపి

# అసలు రహస్యం!

-డి.వి.నరసరాజు



ఈ రోజుల్లో తల్లిదండ్రులకు పిల్లల పెళ్లిళ్లు పెద్ద సమస్యగా తయారవుతోంది.

కూతుళ్ల పెళ్లిళ్లేగాదు - కొడుకుల పెళ్ళిళ్లు చేయాలన్నా - తల్లిదండ్రులు భయపడుతున్నారు.

కట్నాలు కానుకల భారం మోయగల ఆర్థిక స్తోమత వున్న వాళ్ళు గూడా - గజగజ లాడుతున్నారు.

అన్నిహంగులతో పెళ్ళిళ్ళు చేసినా - వధువు - వరుడు - బాగా చదువుకున్న వాళ్లయినా - దాంపత్యం - ఏ అరమరికలు లేకుండా - సజావుగా సాగుతుందన్న ధైర్యం వుండడం లేదు.

పెద్దలు ఏర్పాటుచేసిన ఎరేంజ్‌డ్ మ్యారేజెస్ మాత్రమే గాదు - ప్రేమ వివాహాలు గూడా ఫెయిల్ అయి - విడాకులకు దారి తీస్తున్నాయ్!

ఈ నేపథ్యంలో - పి.వి.రాజమన్నారు గారు సూచించిన 'చిట్కా' దాంపత్య స్థిరత్వానికి - విజయానికి - ఏమైనా ఉపయోగపడుతుందేమో ఆలోచించండి!

పి.వి.రాజమన్నారుగారి పేరు - యీ తరం వాళ్లకి తెలియక పోవచ్చుగాని - మాతరం వాళ్ళకి - మా ముందు తరం వాళ్ళకి - ఆయన పేరు చిరపరిచితం.

ఆయన - మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా పని చేసి రిటైరైనారు.

ఆయన న్యాయశాస్త్రంలో నిష్ణాతుడు! గొప్ప సాహితీవేత్త! మంచి రచయిత! ఎన్నో నాటకాలు రాశారు! ఆయన నాటకాలు - బళ్లారి రాఘవాచారి గారు ప్రదర్శించారు.

అన్నిటికంటె - విశేషం - ఆయన గొప్ప హాస్యప్రియుడు!

ఆయనకు కొయెలో అనే స్నేహితుడుండే వాడు. కొయెలో తన కుమారుని వివాహం సందర్భంగా ఒక రిసెప్షన్ ఏర్పాటుచేశారు. ఆ రిసెప్షన్‌కు రాజమన్నారు గారు వెళ్లారు.

నూతన వధూవరులను దీవించడానికి వాళ్ళ దగ్గరకు వెళ్ళి - పెళ్లి కొడుకుతో -

"బాబూ! నేనూ మీ నాన్న పాతిక ముప్పయి సంవత్సరాలకు పైగా ప్రాణ స్నేహితులం. మాకు యింకా చాలా మంది స్నేహితులున్నారు. కాని - వైవాహిక జీవితంలో మీనాన్న చూరగొన్న సుఖమూ - ఆనందము - మా స్నేహితుల్లో ఎవరికీ లభించలేదు. మేమందరం - మీనాన్న వైవాహిక జీవిత సుఖాన్ని చూచి - అసూయపడే వాళ్లం!

నీవుగూడ - మీ నాన్నను ఆదర్శంగా తీసుకుని - ఆయన అడుగు జాడల్లో నడిస్తే - నీవు గూడా ఆయనలాగే వైవాహిక జీవితానందాన్ని అనుభవించగలవని - నేను హామీ యిస్తున్నాను!--

యింతకూ - మీనాన్న వైవాహిక జీవిత సౌఖ్యానికి, ఆనందానికి - అసలు రహస్యం నీకు తెలుసా?

He is a hen - pecked husband! భార్యా విధేయుడు! ధర్మపత్నీ చరణ చారణ చక్రవర్తి!!" అన్నారు.




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. ఒడుపు (మౌనమేలనోయి.... సోది నేను చెపుతా)
ఎ) వీలు బి) ఒడి
సి) శరీరము డి) దుస్తులు

2. మకరందం (అందం...నింగికి)
ఎ) చెయ్యి బి)మొసలి
సి) పూదేనె డి)అందం

3) చాన (తోడికోడళ్ళు.... కారులో షికారుకెళ్లే)
ఎ) శరీరము బి)గురుతు
సి)రంగు డి) స్త్రీ

4) ముచ్చిలి (శ్రీ వెంకటేశ్వర మహత్మ్యం...గోపాలాబాలా)
ఎ)దొంగిలించి బి)మచ్చపడి
సి)అంద విహీనమైన డి)నమూనా

5. కలిమి (ఇంటికి దీపం ఇల్లాలే...కాపలా)
ఎ) ఆనందము బి)సౌఖ్యం
సి)నిప్పు డి)ఐశ్వర్యము

6) ఏమార్చు (సిరిసంపదలు... ఈ పగలు రేయిగా)
ఎ) చల్లార్చు బి)మారిపోవు
సి)ఉపేక్షించు డి)మరచిపోవు

7) అన్నెము (వాగ్దానం... పాహిరామప్రభో)
ఎ) అన్యాయము బి) పాపము
సి)మంచితనము డి)అజ్ఞానము

8) కెంజాయ (మూగప్రేమ....ఈ సంధ్యలో)
ఎ)చల్లనిగాలి బి)సాయంత్రం
సి) ఎర్రని రంగు డి)ఒకరకం పండు

9) తిమిరము (శ్రీ వెంకటేశ్వర వైభవం....తెర తీయరా)
ఎ)చీకటి బి)యుద్ధము
సి)అజ్ఞానము డి) ఒడ్డు

10. కరినాగు (కంచుకోట... లేదు లేదని)
ఎ) విషము బి) ఏనుగుల గుంపు
సి) నల్లని మబ్బు డి) పాము

### జవాబులు

1) a 2) c 3) d
4) a 5) d 6) c
7) b 8) c 9) a
10) d

బాలు

# ఇష్టపది

### మార్కెట్లో విరివిగా అమ్ముడుపోతున్న ఆడియోలపై అభిప్రాయాల వేదిక



## సంతోషం

మ్యూజిక్ సెన్సేషన్ సృష్టిస్తోన్న ఆర్.పి. పట్నాయక్ ఇప్పటివరకూ వర్ధమాన కథానాయకుల చిత్రాలకు సంగీతాన్నందించారు. 'సంతోషం' ద్వారా తొలిసారిగా అగ్రహీరో సినిమాకి పనిచేసే అవకాశం సంపాదించిన ఆర్పీ ఆ ఆడియో పెద్ద హిట్ కావడంతో బాగా సంతోషంతో కనిపిస్తున్నారు. 'ఈ చిత్రంలో మీకు నచ్చిన పాట గురించి చెప్పండి' అని 'హాసం' ఆర్పీని ప్రశ్నించింది.
" 'నే తొలిసారిగా' పాట మీద ఎందుకనో మక్కువ పడ్డాను. ఈ పాట ఆకస్మికంగా నా మనసులో పుట్టింది. దర్శకుడు దశరథ్ నన్ను కారులో ఎక్కించుకుని గండిపేటకు తీసుకెళ్లి ఓ సిట్యుయేషన్ చెప్పి, దానికి తగ్గ పాట కావాలన్నాడు. అప్పటికప్పుడు ఆలోచించి చేసాను ఈ ట్యూన్. సాంగ్‌లో వెరీగుడ్ ఫీల్ వుంది. సాహిత్యంలో అద్భుతమైన సెన్స్ వుంది. ఒక తెలీని గమ్మత్తు ఏదో పాటలో వుందనిపిస్తుంది. పాట ఒక్కసారి వింటే మళ్లీ మళ్లీ వినాలనిపిస్తుంది. ట్యూన్‌లో సీతారామశాస్త్రిగారి సాహిత్యం ఎంత బాగా ఒదిగిపోయిందంటే చెప్పడానికి మాటలే చాలవు" అని వివరించారు ఆర్పీ.



## లాహిరి లాహిరి లాహిరిలో...

'నేను నిన్ను ప్రేమిస్తున్నాను చిత్రం ద్వారా తెలుగు తెరకి పరిచయమైన బెంగాలీ అమ్మాయి రచన కొద్ది గ్యాప్ తర్వాత తెలుగులో చేస్తోన్న చిత్రం 'లాహిరి లాహిరి లాహిరిలో'. ఈ చిత్రంలో సుమన్‌కి జోడీగా నటిస్తోంది రచన.
'లాహిరి లాహిరి లాహిరిలో పాటలు విన్నారా? అని రచనని అడిగితే - "విన్నాను. చాలా బాగున్నాయి. దర్శకుడు చౌదరి టేస్ట్ మ్యూజిక్‌లోనే తెలుస్తోంది" అని చెప్పారు.
"ఏ పాట మీకు నచ్చిందని" ప్రశ్నిస్తే- "అన్ని పాటలూ బాగున్నాయి. మొన్నీమధ్యనే పద్మాలయా స్టూడియోలో ఆఖరి పాట షూట్ చేసారు. హరికృష్ణ - భానుప్రియ, వినీత్ - సంఘవి, సుమన్ - నా మీద 'మంత్రమేదో వేసింది.. మాయచేసి పోయింది... ఓ లాహిరి...' పాట తీసారు. పాట భలే గమ్మత్తుగా అనిపించింది. చిత్రీకరణ కూడా దర్శకుడు చాలా వెరైటీగా చేసారు. ఈ పాటలో మా కాస్ట్యూమ్స్ కూడా చాలా వెరైటీగా అనిపిస్తాయి' అని తెలిపారు రచన.



## మౌనమేలనోయి

తండ్రి కిషోర్‌రాఠీ బాటలోనే నిర్మాణ రంగంలోకి అడుగిడి, క్రమశిక్షణతో, మంచి ప్రణాళికతో సినిమాలను నిర్మిస్తున్నారు యువనిర్మాత మహేష్‌రాఠీ. కొత్త హీరోయిన్లతో శ్యామ్ ప్రసాద్ దర్శకత్వంలో రూపొందించిన 'మౌనమేలనోయి' ఆడియో వరంగా చాలా మంచి క్రేజ్‌ని సంపాదించుకుంది. రమణ గోగుల సంగీతం, వేటూరి సాహిత్యం తమ సినిమాకి హార్ట్ అని' మహేష్‌రాఠీ అభివర్ణించారు. ఈ చిత్రంలో మీకు నచ్చిన పాట ఏదని అడిగితే - " కేసెట్‌లో ఫస్ట్‌సాంగ్ అయిన 'ఓ ప్రియురాలా నా మధుబాలా' ఎక్సలెంట్‌గా వుంది. అందరికీ కూడా ఈ పాట తెగ నచ్చేసింది. రమణ గోగుల గారి సంగీతాన్ని, వేటూరిగారి సాహిత్యాన్ని అందరూ బాగా ఎంజాయ్ చేస్తున్నారు. ఇందులో పాటలన్నీ చాలా రిచ్‌గా చిత్రీకరించారు. 'తమ్ముడు' ఫేమ్ అదితి గోవిత్రికర్‌తో ఓ స్పెషల్‌సాంగ్, 'అశోక్' ఫేమ్ రాజ్యలక్ష్మితో మరో స్పెషల్ సాంగ్ చేసాం. సమ్‌థింగ్ స్పెషల్‌గా వుండాలనే బడ్జెట్ ఎక్కువైనా వారితో సాంగ్స్ చేసాం" అని తెలిపారు



## మనసుంటే చాలు

'శ్రద్ధాంజలి'తో హీరోగా మారి, 'బ్యాచ్‌లర్స్', 'కాలేజ్' చిత్రాలతో తనకంటూ ఓ ప్రత్యేకతను సంపాదించుకున్నారు. యువకథానాయకుడు శివాజీ. ఉషాకిరణ్ మూవీస్ బేనర్‌లో జొన్నలగడ్డ శ్రీనివాసరావు దర్శకత్వంలో రూపొందిన 'మనసుంటే చాలు'లో సాయికిరణ్‌తో పాటు శివాజీ కూడా హీరోగా నటించారు. ఈ చిత్రంలో తనకు నచ్చిన పాట గురించి శివాజీ అభిప్రాయం:
" 'అనాలని వుంది ఓ మాట నీతో' పాట నాకు బాగా నచ్చింది. మెలోడియన్‌గానూ, మీనింగ్‌ఫుల్‌గానూ వుంది. ఓ అమాయకుడు భయపడుతూ తన ప్రేమను ఎలా వ్యక్తపరుస్తాడో సీతారామశాస్త్రిగారు అక్షరాల్లో అందంగా చూపించారు. అలాగే 'ఛం ఛమక్ ఛం రంగుల్లో' పాట యూత్‌కి స్పిరిట్‌నిచ్చే పాట. ఈ పాటలో నేనూ అభినయించాను. ఇందులో నాది విచిత్రమైన పాత్ర. ఇష్టమైన దానికోసం ఏమైనా చేసే పాత్రనాది" అని తెలిపారు శివాజీ.



## ఆడుతూ పాడుతూ

కామెడీ సినిమాలకి మ్యూజిక్ సమకూర్చడం అంత ఈజీయేం కాదు. కానీ 'చక్రి' 'ఆడుతూ పాడుతూ' సినిమాకి మంచి మ్యూజిక్‌నందించి సక్సెస్ అయ్యారు. తనకు నచ్చిన పాట గురించి చక్రి ఇలా వివరిస్తున్నారు.
" 'నీలి నీలి ముత్యమల్లే కనిపిస్తున్నావు, నింగిలోని జాబిలల్లే మురిపిస్తున్నావు' అని హరిహరన్ పాడగా, 'నీతోనే సహవాసం, చేస్తాలే జన్మాంతం' అని కౌసల్య పాడిన ఆ పల్లవి నిజంగా నన్ను ప్రతిక్షణం వెంటాడుతోంది. ముఖ్యంగా కౌసల్య వాయిస్ అద్భుతంగా వుంది. శ్రీకాంత్, సునీల్ ఇద్దరికీ ఈ పాట తెగ నచ్చేసింది.

ఆఖరు పాట షూటింగ్ నానక్‌రామ్ గూడాలో జరుగుతుండగా సునీల్ కొన్న కొత్తకారులో త్రివిక్రమ్ శ్రీనివాస్‌కి మొత్తం పాటలన్నీ వినిపించడం జరిగింది. ఆయన ప్రతి పాటకి షేక్‌హేండ్ ఇవ్వడం మరిచిపోలేని అనుభవం".

## మనసుతో



భవన నిర్మాణరంగంలోంచి 'అమ్మాయే నవ్వితే" ద్వారా చలన చిత్ర నిర్మాణరంగంలోకి ప్రవేశించిన ఆనంద్ ప్రసాద్ తమ ద్వితీయ ప్రయత్నంగా ఎ.ఎస్. రవి కుమార్ చౌదరిని దర్శకునిగా పరిచయం చేస్తూ ఆకాష్, అర్జూ గోవిత్రికర్‌ల కాంబినేషన్‌లో 'మనసుతో' చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఆదిత్యా మ్యూజిక్ ద్వారా ఈ చిత్రం ఆడియో మార్కెట్‌లోకి విడుదలైంది. ఈ చిత్రంలో మీకు నచ్చిన పాట ఏదని ఆనంద్ ప్రసాద్‌ని అడిగితే, 'ఎనిమిది పాటలూ నచ్చాయి' అని అన్నారు. 'సంగీతపరంగా గానీ, సాహిత్యపరంగా గానీ, చిత్రీకరణ పరంగా గానీ మీరు హైలెట్‌గా ఫీలయిన పాట ఏదైనా చెప్పండి' అని ప్రశ్నిస్తే, ఆయన అదే కాన్ఫిడెన్స్‌తో 'ఎనిమిదీ నేను హైలెట్‌గా ఫీలయ్యినవే అని పేర్కొన్నారు. ఆడియో గురించి మాట్లాడుతూ - "సెన్సేనల్ బెస్ట్ సింగర్ అల్కాయాజ్ఞిక్ ఇంతవరకూ తెలుగులో పాడలేదు. మా సినిమాలో ఆమెతో రెండు పాటలు పాడించగలిగాం. టైటిల్ సాంగ్, 'చిన్ని మనసు' సాంగ్ ఆమె పాడారు. చాలా మంది బెస్ట్ సింగర్స్‌తో పాటలు పాడించాం. సాధనా సర్గమ్, జానకీరామన్, శంకర్‌మహదేవన్, హరిహరన్, సుఖ్వీందర్ సింగ్, సందీప్ భౌమిక్, మాళవికలతో పాటు గోరింకా హట్టంగడిలతో పాటలు పాడించాం. వైజాగ్‌కు చెందిన సంగీతదర్శకుడు ఆశీర్వాద్ బాగా కష్టపడ్డాడు. అన్నీ ఫ్రెష్‌ట్యూన్స్ ఇచ్చాడు. సినిమా తప్పకుండా మ్యూజికల్ హిట్ అవుతుంది" అని చెప్పారు ఆనంద్ ప్రసాద్.

## అందం



సహజకవి ఎమ్మెస్ రెడ్డి మల్లెమాలగా ఇప్పటి వరకూ రాసిన ప్రతిపాటా వాడని పరిమళాలతో గుబాళిస్తూ ప్రేక్షకులను అలరిస్తూ వచ్చింది. కొంత గ్యాప్ తర్వాత ఇటీవల తను నిర్మాతగా నిర్మించిన 'అందం' చిత్రం ద్వారా మళ్ళీ తన పాటల సౌరభాల్ని వెదజల్లబోతున్నారాయన. "కవిగా మల్లెమాల రాసిన పాటల్లో నిర్మాతగా ఎమ్మెస్‌రెడ్డికి నచ్చిన పాట ఏది?" అని 'హాసం' అడిగిన మెలిక ప్రశ్నకు ఆయన సమాధానమిస్తూ 'నింగికి రంగుల హరివిల్లందం' పాటను పేర్కొన్నారాయన. ముఖ్యంగా పల్లవిలోని । నీరెండకు నిగనిగలద్దే నీ అందం/అపుడే విరిసిన అరవిందం/ప్రేమదాని మకరందం/ ఆ మకరందం నిండిన హృదయం - సత్యమ్ శివమ్ సుందరమ్ - అనే వాక్యాలను మరీ మరీ చెప్పారాయన తన్మయత్వంతో.

## అల్లరి



పరిశ్రమ అంతా 'చలపాయ్' అంటూ ఆప్యాయంగా పిలుచుకునే నటుడు చలపతిరావు గారబ్బాయి రవిబాబు దర్శకత్వం వహించిన 'అల్లరి' సినిమాని సురేష్ సంస్థ డిస్ట్రిబ్యూషన్ చేస్తోంది. పాల్. జె. అనే సంగీత దర్శకుడు ఈ చిత్రం ద్వారా పరిచయం అవుతున్నాడు. ఇందులోని పాటల్లో మీకే పాట నచ్చిందని ప్రముఖ నిర్మాత సురేష్‌బాబుని అడిగితే - " 'నరం నరం' పాట తనకు నచ్చిందని అన్నారు. ఎందుకన్న ప్రశ్నకు జవాబు చెబుతూ" రెగ్యులర్ ప్యాటర్న్‌కి డిఫరెంట్‌గా తీశాడు రవిబాబు. మొత్తం పాటని విజువల్స్‌తో సహా చూశాను. ఎం.టి.వీ. పాటల లెవెల్లో ఉన్నాయవి. ఇప్పటి వరకు ఇలాంటి విజువల్స్‌తో పాటని ఎవ్వరూ తియ్యలేదు. అందుకే నాకు బాగానచ్చిందీ పాట" అని వివరించారు సురేష్‌బాబు.

## కనులు మూసినా నీవాయే



తెలిన శ్రీమతి మంజులా నాయుడుతో కలిసి 'ఋతు రాగాలు', 'కస్తూరి' వంటి అద్వితీయమైన టెలీ సీరియల్స్‌ని రూపొందించి మంచి పేరు సంపాదించు కున్నారు. 'జిష్ణు'గా పిలవబడే సుధాకర్ పల్లమాల, తాజాగా శ్రీకాంత్ ఎంటర్‌టైన్‌మెంట్స్ బేనర్‌పై దీపక్, అర్చనల కాంబినేషన్‌లో మంజులానాయుడు దర్శకత్వంలో 'కనులు మూసినా నీవాయే' చిత్రాన్ని నిర్మించారు. ఈ చిత్రంలో తనకు నచ్చిన పాట గురించి జిష్ణు ఇలా వివరిస్తున్నారు. "ఇది కమర్షియల్ ఫిలిం కాబట్టి అన్ని కోణాల్ని దృష్టిలో పెట్టుకుని పాటలు చేశాము. కథాపరంగా పర్‌ఫెక్ట్‌గా సూట్ అయిన వాటినే ఎంపిక చేసుకున్నాం కాబట్టి వీటిలో ఏది గొప్ప అని చెప్పడం కష్టం. 'సుబ్బలక్ష్మి' సాంగ్ మాత్రం మాస్‌ని బాగా ఎట్రాక్ట్ చేస్తుంది. రొమాంటిక్ ఫీల్‌ని 'ఏ హులే' పాటలో వీక్షించొచ్చు. మాస్, క్లాస్, రొమాన్స్ కాకుండా వయా మీడియాగా 'చిన్ని నవ్వు చిందిపోవే' వుంటుంది. ఇలా మిగతా పాటలు కూడా ఒక్కో అనుభూతితో సాగుతాయి. నవరసాలు కలిసిన ప్రేమకావ్యాన్ని ఈ చిత్రంలోని పాటల ద్వారా వీక్షించవచ్చు.

## నిన్నే చేరుకుంటా



కాకినాడలో ఎం.సి.ఎ. ఫైనలియర్ చదువుతున్న టి.వి.వి.ఎన్.ఎన్ వర్మ తన తమ్ముణ్ణి ఆర్టిస్ట్‌గా చేయాలనే ఉద్దేశ్యంతో చిత్ర నిర్మాణ రంగంలోకి ప్రవేశించారు. మౌర్య దర్శకత్వంలో రేవంత్, శ్వేతలను హీరో హీరోయిన్లుగా పరిచయం చేస్తూ రూపొందించిన ఈ చిత్రం ఆడియోను ఉగాది పర్వదినాన తిరుపతి, కాణిపాకం పుణ్యక్షేత్రాల్లో సుప్రీం మ్యూజిక్ ద్వారా ఆడియోను ఆవిష్కరించారు. ఈ చిత్రంలో తనకు నచ్చిన పాట గురించి వర్మ ఇలా చెబుతున్నారు.

" 'నీ అడుగుకింద పూవునైతా' పాట ట్యూన్, సాహిత్యం అద్భుతంగా కుదిరాయి. సినిమాలో మొత్తం 'ఎనిమిది' పాటలున్నాయి. అన్నిటికన్నా ఎక్కువ ఖర్చుపెట్టి తీసిన సాంగ్ యిది. వైజాగ్‌లోని బ్యూటిఫుల్ లొకేషన్స్‌లో ఈ పాట చిత్రీకరించాం. మా ఆడియోలో స్పెషల్ ఎట్రాక్షన్ ఏమంటే టాప్ మ్యూజిక్ డైరెక్టర్ ఆర్.పి. పట్నాయక్ నాలుగు పాటలు పాడారు. యూత్‌లో ప్రస్తుతం పట్నాయక్ ట్రెండ్ నడుస్తోంది. ఆయన చాలా మంచి సింగర్ కూడా. ఆయనలోని సింగర్‌ని ఎవరూ పూర్తి స్థాయిలో ఉపయోగించుకోలేదు. శ్రీలేఖ సంగీత సారథ్యంలో మా సినిమాలో ఆయనలోని గాయకుడ్ని పూర్తిస్థాయిలో ఉపయోగించుకున్నాం".

# సంగీత సరస్వతిని రాచకీచకులకమ్మని

# మద్దిరాల వేంకట రాయకవి

**అర్ధరాత్రి!**

**ఎక్కడో నక్కలు ఊళలేస్తున్నాయ్....**

**హోరుగాలికి.... తలుపులు దడదడకొట్టుకుంటున్నాయ్!**

**దీపం ఎప్పుడో ఆరిపోయింది!!**

**మనస్సు ఆనందంగా లేకపోతే... ప్రకృతిలో చెడే గోచరిస్తుందేమో!!**

**చంద్రుడుగూడా కారుమబ్బుల చాటుకి మాయమైపోయాడు!**

**దీర్ఘాలోచనలో పడిపోయాడు వేంకటరాయకవి!**

**ఇదేంటీ ఇలా అయిపోయింది బతుకూ?**

**కళ్ళముందు గతంలో జరిగిన సంఘటనలన్నీ -**

**ముక్కలు - ముక్కలై కనపడ్డం ప్రారంభించాయ్!!**

పిఠాపురం....

కుక్కుటేశ్వరస్వామి వారి ఆలయం....

తనకి అక్షరాభ్యాసం....

గురువుగారు శ్రీ కంచిభట్ల లక్ష్మీనారాయణశాస్త్రిగారు...

ఓం.... నమః.... శివాయః...

అదే మంత్రం....

కుక్కుటేశ్వరుడే దేవుడు!

లక్ష్మీనారాయణ గారే గురూగారు....

గురూగారి ఆశీర్వచనం వల్ల... సరస్వతీ ప్రసన్నం జరగడం....

అద్భుతమైన ధార.... అలవోకగా - తను పాటలు - పద్యాలు రాసెయ్యడం!!

గురూగారు కావ్యాలేవీ నరులకి అంకితం ఇవ్వరాదని, అగ్నిసాక్షిగా ప్రమాణం చేయించుకోవడం....

-వాగ్గేయకారుడిగా తనకి గుర్తింపు...

పిఠాపురం ఆస్థాన కవిగా నియామకం....

ఆస్థాన కవంటే... ఆ భోగం....

దేవేంద్ర భోగం కాదూ!....

తెల్లారగట్ల... వైతాళికుల మేల్కొలుపులు...

పన్నీటి జలకాలు.... పట్టుబట్టలు... అత్తరు సువాసన్లు....

పల్లకీలెక్కడాలు ... ఏనుగులెక్కడాలు...

రాజప్రాసాదానికెళ్తే... పూర్ణకుంభస్వాగతాలు... బరాబరులు... (స్తోత్ర పాఠాలు చేసేవారు)

తన సంగీతం... రాజావారి బహుమానాలు...

ప్రేక్షకుల హర్ష ధ్వానాలు...

ఆహా! బతుకంటే ఇది కదూ!

నేనంటే ఇంత అనుగ్రహంటయ్యా కుక్కుటేశ్వరా!!

సరిగ్గా ఈ సమయంలోనే... పెళ్ళి!!

కుందనపు బొమ్మంటి పిల్ల

బుగ్గన చుక్కతో... ఓరకంటచూసే!....

తమలపాకుల చిలకలందించడం .... తను చటుకున్న వేలుకొరకడం

ఆ సిగ్గు... ఆఁ బిడియము.. ఆఁ విడియము...

ఓహ్ స్వర్గంలో మాత్రం ఇంతకన్నా ఏవుంటుంది!!

కొన్నాళ్ళు రంజుగానే సాగింది కాపురం.

అయితే... ఎల్లకాలం ఒకలాగుంటుందీ?!!

కాల పురుషుడు ఉండనిస్తాడా?

తను తన ఇష్టదైవం అయిన రాజరాజేశ్వరీ దేవి - కుక్కుటేశ్వర స్వాములు వారి మీద 'ఏకాంత సేవావిలాసమనే' కావ్యం రాసాడు!!!

ఆస్థానంలో కొన్ని పాడి వినిపించాడు!!

అంతా తెగమెచ్చుకున్నారు...

ముచ్చటి పడి పోయిన పిఠాపురం రాజావారు! రత్నాల కంకణం తీసిస్తూ....

"భేష్... వేంకట రాయకవీ! నీ ఏకాంత సేవావిలాసం..... నాకు అంకితం...." అనేసీ...! సభ చాలించేసాడు!!

రత్నాల కంకణం... మండ్రగబ్బలాతోచింది!!

పాలు తాగితే విషం అనిపిస్తోంది!!

కళ్ళు మూసుకుంటే.... ఉగ్రంగా చూస్తున్న గురూగారు!

దుఃఖిస్తున్న... సరస్వతి.....

"నరాంకితం చేస్తావురా!".... గురూగారి... గంభీర కంఠస్వరం!!!

ఆ పడుపుకూడు భుజిస్తావా అంటున్నట్టు - వాణి.

బుర్ర తిరిగిపోతోంది.

ఎందరెందరో గుర్తుకొస్తున్నారు.... పోతన... ధూర్జటీ... త్యాగయ్య

"రాజులున్మత్తులు వారిసేవ నరక ప్రాయంబు ..."

కాళహస్తీశ్వర శతకం గుర్తొస్తోంది!!!

నిధి చాలా.. సుఖమా...?

తట్టుకోలేక... ఆలయానికెళ్ళి.... భోరుమని ఏడ్చాడు!!

మంద్రంగా ఓంకారం వినిపిస్తోంది!

లీలగా నమకం... చమకం వినిపిస్తున్నాయ్!!

ప్రశాంతంగా శివలింగం! నిర్వికార స్థితిలో!....

లక్ష ప్రశ్నలేసాడు.... మనస్సులో

ఒక్కటే సమాధానం లభించింది.

అదీ మౌన వ్యాఖ్యానం మాత్రమే!

మర్నాడు... డోలు సన్నాయితో... రాజభటులు కానుకలు పల్లకీలతో వచ్చారు!.... కావ్యం పట్టుకుని రమ్మన్నారు!!

"నేను రాజులకి అంకితం ఇవ్వను"!!

***

తోకతొక్కిన తాచులా లేచాడు... పిఠాపురం రాజా!!

ఎంత పొగరూ!

నామోచేతి కింద గంజినీళ్ళు తాగే వెధవ!!

ఈడ్చుకురండి!!

రాజాజ్ఞ అయింది!!

***

ఏ సభా మండపంలో.... తాంబులం ఆస్వాదిస్తూ అరకన్నులు మోడ్చి... జేజేలు అందుకున్నాడో!

అక్కడే ఇనప సంకెళ్ళలో.... దిక్కుమాలిన వాడిలాగ....

"ఇతని యావదాస్తినీ లాక్కొనీ... రాజ్యం నించి గెంటెయ్యండి"

తరతరాలుగా వస్తున్న... రాజాజ్ఞ!!

అంతే!!

మంత్రం వేసినట్టు ఐశ్వర్యం మాయమై పోయింది!!

ఐశ్వర్యాన్ని ఆసరా చేసుకుని ఉండే - దాసదాసీ జనం మాయమై పోయారు.

బంధుత్వాలు... ఫటాలున తెగిపోయాయ్....

బంగళాలోంచి ... కవి కుటుంబం బజార్న పడింది!!

సర్వాభరణ భూషితయైన లక్ష్మీదేవి... మందహాసం చేసుకుంటూ వేగంగా వెళ్ళిపోయిన ఉత్తర క్షణం... పెద్దమ్మ వెకిలిగా నవ్వుకుంటూ వొచ్చింది!!! పేలు నొక్కుకుంటూ....

దుర్భర దారిద్ర్యం.... తిండి తిప్పలు లేవు! ఒంటిమీద మంచి గుడ్డలేదు. అకస్మాత్తుగా భార్యకి రోగం....

ఇది ఇలా ఉండగానే... తండ్రిగారి ఆబ్దీకం!

తద్దినం అంటే మాటలా...

నాలుగు కూరలు - నాలుగు పచ్చళ్ళు ... నెయ్యి, గారెలు ... అరిసెలు... పాయసం.... బ్రాహ్మలకి దక్షిణలు.... నా శార్దం!

తన దగ్గర... తరతరాలుగా వొస్తున్న 'స్ఫటిక జపమాల తప్ప' మరోటిలేదు!! ఎలా పెట్టడం!

తండ్రికి తద్దినం కూడా పెట్టని దరిద్రుడు అని లోకం దుమ్మెత్తి పోస్తుంది!!

లోకం సంగతి దేవుడెరుగు....

కన్న తండ్రి... వేపకొమ్మ మీద నించి కావుకావుమని అరుస్తున్నాడే!!

అయిదేందో అయిందని... తావళం తాకట్టు పెట్టేశాడు!!

తద్దినమూ పెట్టేశాడు శ్రద్ధగా!...

ఇంక తన దగ్గర ఏమీ మిగల్లేదు!

"పదవే అడవుల్లోకి పోయి ఆకులు అలములు తిందాం...

అవీ దొరకవూ... కలిసి చద్దాం...."

బైలు దేరారు. భార్యా, భర్తలు..... నడుస్తున్నారు... నడుస్తున్నారు...

ఎండ... దారంతా గులకరాళ్ళు... ముళ్ళు....!

వనవాసం... ఇంత కష్టమా....?

ఒక దశకొచ్చే సరికి నడవలేక కళ్ళు తిరిగి పడిపోయాడు. వెంకటరాయకవి!!

స్పృహ పోయింది!!

చీకట్లు!!... చీకట్లు!!! అంతలో చీకట్లను చీల్చుకుంటూ

ఓ పెద్ద వెలుగు.... కళ్ళు వెలుగుకి అలవాటయ్యాక....

అందులో కుక్కుటేశ్వర స్వామి... మంద్రంగా తంబూర నాదం!!

"ఏవయ్యా కవీ!.... విచారంగా ఉన్నావేం!"

"ప్రాణప్రదంగా దాచుకున్న తావళం కుదువ బెట్టాను స్వామి!"

"అదెక్కడికి పోతుంది గానీ ఏదీ ఆకు ముడుపులు పంపెరా.... అనే దరువు మరో మాటు పాడూ...." అర్థించాడు దేవుడు

"ఆకు ముడుపులు పంపెరా ఇవి అందుకొమ్మిట చూడు నా

రాకకే యెదురొచునున్నది... రాజసంబున బ్రోవరా!

శ్రీకరంబుగు నింటికిన్ దయసేయరా తడవాయెరా!

ప్రాకటంబుగ కుక్కుటేశ్వర.... భామ నిను పిలిచిందిరా!...."

అంటూ గట్టిగా పాడేస్తున్నాడు... భార్య ఉలిక్కిపడి లేచింది.



"ఎవ్వరూ లేరు... ఏంటీ వెర్రి...?" అంది.

అంతాకలా!... అనుకున్నాడో లేదో...

భేరీకాహళ వాద్యాలతో... కోలాహలంగా ఓ గుంపు కదలి వొస్తోంది... తీరా చూస్తే... తావళం తాకట్టు పెట్టుకున్న కంచెర్ల కృష్ణయ్య... కవిగారి కాళ్ళమీద పడి పోయాడు..!!

"అయ్యా నన్ను క్షమించండి! ఇది కుక్కుటేశ్వరస్వామి ఆజ్ఞ - అనుజ్ఞ!"

అంటూ కవిగార్ని భార్యా సమేతంగా నూతన గృహ ప్రవేశం చేయించి, తావళంతో పాటు ... బంగారునగలు, పట్టు వస్త్రాలు ఇచ్చి... దణ్ణాలెట్టాడు!!

కవిగారి దరిద్రం వొదిలిపోయింది!!

కానీ... రాజావారు చేసుకున్న పాపం ఎక్కడికి పోతుందీ!

రాజావారికి జబ్బు చేసింది! వొళ్ళంతా బొబ్బలు... బీభత్సంగా రసికారుతూ.... శరీరమంతా దుర్వాసన!

కావాల్సిన వాళ్ళుకూడా ముక్కుకి చెయ్యడ్డం పెట్టుకునీ - 'తప్పక' సేవ చేస్తున్నారు.

ఒక మహావిద్వాంసుణ్ణి క్షోభ పెట్టినందుకే తనకీ శిక్ష పడిందని రాజావారు పశ్చాత్తాపపడి కవిగారి శరణు వేడారు.

"అంతా కుక్కుటేశ్వర స్వామి దయ" అన్నాడు కవి! రాజావారి జబ్బు నయమైంది!

కవిగారికి ఎంచేతనో మళ్ళీ ఐశ్వర్యం మీద మోజు కలగలేదు.

వొచ్చిందంతాదానం చేసి ఐహిక సుఖాలకి లొంగకుండా... కుక్కుటేశ్వర స్వామిని సేవిస్తూ పరమానందంగా కాలం గడిపాడు!!

అన్నట్టు మద్దిరాల వేంకటరాయకవి శ్రీ త్యాగరాజస్వామి సమకాలీకులు.

**-తనికెళ్ళ భరణి**

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వాజ్మయం' చదివి, స్పందించి)

**-భరణి**

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు


**తనికెళ్ళ భరణి,**

**కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212,**

**మోతీనగర్, హైదరాబాదు - 500 018**


అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.

మే 12న చినమౌలానా జయంతి సందర్భంగా

# నాదస్వరానికి జీవరాగం షేక్ చినమౌలానా

ఉత్తమ సంగీతాన్ని విన్నప్పుడు కేవలం రసానుభూతిని పొందడమే తప్ప మరే ఇతర ఆలోచనలు రావు. అలాంటి సంగీతం - ప్రాంత, భాష, సంస్కృతుల కతీతంగా విశ్వవేదికపై ఉన్నత స్థానాన్ని పొందుతుంది. ఇలా సార్వజనీనత సంపాదించుకున్న అతి కొద్దిమంది కళాకారుల్లో అగ్రస్థానంలో నిలువదగిన నాదస్వర వాద్య విద్వాంసులు "షేక్ చినమౌలానా". సుమారు అరశతాబ్దానికి పైగా నాదస్వర విన్యాసంతో శాస్త్రీయ సంగీతానికి జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో ప్రాచుర్యం కల్పించిన మహనీయ కళాకారు లాయన.

కర్ణాటక సంగీత సౌరభాల జిలుగు వెలుగులను దిగంతాలకు విరజిమ్మిన నాదబ్రహ్మ షేక్ చినమౌలానా ఏ కళాశాలలోను, యూనివర్సిటీ ల్లోనూ చదువుకోలేదు. హైస్కూలు చదువుకూడా పూర్తి చేయలేదు. అయితేనేం ఆయనను యూనివర్సిటీలే స్వయంగా ఆహ్వానించి గౌరవ డాక్టరేట్లు బహూకరించి తమను తాము గౌరవించుకున్నాయి. 1924 మే 12న ప్రకాశం జిల్లా కరవది గ్రామంలో నాదస్వర వాద్య విద్వాంసుడు షేక్ ఖాసిం కుమారుడిగా చినమౌలానా జన్మించారు. నాదస్వరంలో తొలిపాఠాలను తండ్రి వద్ద, అనంత రం పెద తండ్రి మదార్‌సాహెబ్ వద్ద అభ్యసించిన చినమౌలానా చిలకలూరిపేటకు చెందిన ఆదం సాహెబ్ వద్ద పూర్తి స్థాయిలో శిక్షణ పొందారు.



సంగీతం, మత విశ్వాసాల విషయంలో ఉస్తాద్ బిస్మిల్లాఖాన్ ఆదర్శంగా గల చినమౌలానా విద్యార్థి దశలోనే తంజావూరు బాణిపట్ల ఆకర్షితులైనారు. ఇందుకై తనే స్వయంగా తంజావూరు వెళ్లి నాచియార్ కోయిల్‌కు చెందిన రాజం, దొరైకణ్ణు సోదరుల వద్ద కొంతకాలం శిక్షణ పొందారు. రాజరత్నం పిళ్లయ్ వంటి వారికి ఏకలవ్య శిష్యుడిగా తన ప్రతిభకు మరింత మెరుగులు దిద్దుకున్నారు.

1959 వరకు చినమౌలానా ప్రతిభా పాటవాల గురించి బయటి ప్రపంచానికి తెలియదు. అదే సంవత్సరం జరిగిన మద్రాసు రేడియో సమ్మేళనంలో నాదస్వర వాదన చేసి కారైకుడి అరుణాచలం, వేదమూర్తి వంటి విద్వాంసులతో సమాన గౌరవం పొందారు. కామరాజ్‌నాడార్‌చే ప్రశంసలందుకున్నారు. అనంతరం అయిదేళ్లపాటు స్వగ్రామంలోనే ఉంటూ ఆంధ్ర, తమిళ, కర్ణాటక రాష్ట్రాల్లో కచేరీలు చేసి దక్షిణ భారతదేశంలో అగ్రశ్రేణి కళాకారులుగా పేరొందారు.

1964 ఏప్రిల్ 15న తిరుచినాపల్లి సమీపంలోని శ్రీరంగానికి తన నివాసం మార్చి అక్కడే స్థిరపడ్డారు చినమౌలానా. నాదస్వర విద్యను ఒక తపస్సుగా నిరంతర సాధన చేసి అన్యులకసాధ్యమైన ప్రావీణ్యాన్ని స్వయం కృషితో సాధించారు. తన నాదస్వర విన్యాసంతో ఆబాలగోపాలాన్ని అలరించే సంగీతమూర్తి చినమౌలానా, సంగీత సంబంధమైన ఆరోహణ, అవరోహణ వంటి గమకాలను తనదైన విలక్షణ శైలిలో అతిమధురంగా, నాదస్వరాన్ని పలికించగలరు. లెక్కకు మించిన కచేరీలు చేసి, అసంఖ్యాకమైన సంగీత ప్రియులను కృతి, ఆలాపనలతో మైమరపించారు. కర్ణాటక సంగీతంలో ఎందరో విద్వాంసులకు ఇష్టప్రదమైన కళ్యాణి, తోడి, కాంభోజి, షణ్ముఖ ప్రియ, ఖరహరప్రియ, భైరవి రాగాలతో ఆయన ఆలాపనలు ప్రామాణికమైనవి. కాగా ముత్తుస్వామి దీక్షితుల అంబ నిలయతాక్షి కీర్తన వింటే ఆయన నాదస్వరంలోనే వినాలి. ఇంకా ఆయన స్వర ప్రజ్ఞ ఎలాంటిదంటే వందల సంఖ్యలో ఆవృతాలను అలవోకగా స్వరప్రస్తారం చేయగల అనితర సామాన్య ప్రతిభాశాలి.

చినమౌలానా నాద స్వరవాదనలో గాత్రకచేరీలో వలె కీర్తనలో సాహితీ భావానుగుణంగా పలుకుతుంది. పురందరదాసు పాత్యక్రమం, రామదాసు భజనరీతి, త్యాగరాయకీర్తనలు ఆయన నాదస్వరంలో ప్రాణం పోసుకున్నాయి.

సుమారు మూడు వందల సంవత్సరాల సంప్రదాయ పరంపరగా వస్తున్న నాదస్వర కళను రేపటి తరాలవారికి అందించేందుకు చినమౌలానా శ్రీరంగంలో శారదా నాదస్వర సంగీత ఆశ్రమాన్ని నెలకొల్పారు. నాలుగు గోడల మధ్య శిక్షణ ఇచ్చి డిగ్రీ ఇచ్చే పద్ధతి సరికాదనే ఆయన గురుకుల వాసంలో మనోధర్మం ప్రకారం సంగీతం నేర్చుకోవాలనేవారు.

షేక్ చినమౌలానా భారతదేశంలో కచేరీ చేయని వేదికలు గానీ, సంగీతోత్సవాలు గానీ లేవు. తాన్‌సేన్ ఫెస్టివల్స్, సార్క్ ఫెస్టివల్స్, త్యాగరాజస్వామి ఆరాధనోత్సవాలు, మరే ఇతర జాతీయ స్థాయి సభలు, సదస్సుల్లో ఆయన కచేరీ ఉండటం తప్పని సరైన అంశం. 1972లో ఢిల్లీలో జరిగిన మూడవ అంతర్జాతీయ పారిశ్రామిక ప్రదర్శనలో ఆయన కచేరీ చేశారు. 1973లోనే భారత స్వతంత్ర రజతోత్స వాల సందర్భంగా ఎర్రకోటలో నాదస్వరవాదన నిర్వహించారు. ఇలా దేశవ్యాప్తంగా కచేరీలు చేసిన ఆయన విదేశాల్లో పర్యటించి భారతీయ సాంస్కృతిక రాయబారిగా నిర్వహించిన పాత్ర చిరస్మరణీయమైనది. బర్మా, కెనడాల్లో పర్యటించారు. 1982లో హాంకాంగ్, 1987లో ఫెస్టివల్ ఇండియా క్రింద సోవియట్ యూనియన్‌లో పర్యటించారు. 1997లో యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ వెళ్లి భారత స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల సందర్భంగా పలు ప్రధాన నగరాల్లో కచేరీలు చేశారు. తీన్‌మూర్తి భవన్‌లో సంగీత కచేరీ చేసిన అతికొద్ది మంది కళాకారుల్లో వీరొకరు. సంగీత కచేరీలతోనే సరిపెట్టుకోకుండా పలుచోట్ల నాదస్వర వాదనపై లెక్చర్లు ఇచ్చారాయన. ఇంకా చినమౌలానా అమెరికా, సింగపూర్, శ్రీలంక దేశాల్లో పర్యటించి నాదస్వర వాదనకు విశ్వఖ్యాతి నార్జించి పెట్టారు.

నాదస్వర వాదనలో చినమౌలానా ప్రతిభా పాండిత్యాలకు నిరుపమాన కళాసేవకు గుర్తింపుగా లభించిన గౌరవాలు, పురస్కారాలు 200లకు పైగా ఉంటాయి. భారత ప్రభుత్వం 1977లో 'పద్మశ్రీ' పురస్కారం, అదే సంవత్సరం సంగీత నాటక అకాడమీ అవార్డు, 1980లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సంగీత నాటక అకాడమీ 'గానకళా ప్రపూర్ణ' అవార్డు, 1981లో రాజమండ్రి విజయశంకర కళాసమితి వారి "గంధర్వ కళానిధి" బిరుదు, 1982లో ఢిల్లీ కచేరీలో ఇందిరాగాంధిచే సన్మానం, 1982లో హాంగ్‌కాంగ్

కళోత్సవంలో సన్మానం, 1983లో మధురై సద్గురు సభ వారి 'మధుర కళా ప్రవీణ' జంబుకేశ్వరస్వామి కమిటీ వారి "భారత నాదస్వర చక్రవర్తి", నెల్లూరు కళాప్రవీణ వారి "సంగీత సామ్రాట్" పురస్కారం, 1985లో ఆంధ్ర విశ్వవిద్యాలయంచే "కళాప్రపూర్ణ", 1984లో తమిళనాడు ముఖ్యమంత్రిచే ఆస్థాన విద్వాంసుడి పదవి, తిరుమల తిరుపతి దేవస్థానం వారి "సప్తగిరి సంగీత విద్వన్మణి" బిరుదు, 1976లో తమిళనాడు ప్రభుత్వ "కలైమామణి" బిరుదు, మధ్యప్రదేశ్ గ్వాలియర్ తాన్‌సేన్ సమారోహ్ వారి సత్కారం, 1987లో తెలుగు యూనివర్సిటీ సత్కారం, 1993లో భారత ప్రభుత్వం వారి "ఎమెరిటస్ ఫెలోషిప్", 1999లో మద్రాసు మ్యూజిక్ అకాడమీ వారి "సంగీత కళానిధి" పురస్కారం అందుకున్నారు. ఇక్కడ విశేషమేమిటంటే ప్రఖ్యాత నాదస్వర విద్వాంసుడు రాజరత్నం పిళ్లై "సంగీత కళానిధి" అందుకున్న 1962 తరువాత మళ్లీ 37 ఏళ్ళకు అదీ ఆయన శతజయంతి సంవత్సరంలో మళ్లీ ఒక నాదస్వర విద్వాంసుడు అందుకోవడం మౌలానా వల్లనే సాధ్యం కావడం.

ఈ నేపథ్యంలో ఆయన అందుకున్న సన్మానాల గురించిన మరికొన్ని ప్రధాన విషయాలను ప్రస్తుతించుకోక తప్పదు. 1964లో కుంభకోణంలో చేసిన ఒక కచేరి తరువాత మంజంగుడి రాజగోపాలశాస్త్రి చేసిన ఒక సన్మానంలో అయిదు గ్రాములు బంగారంతో బాటు "మంగళవాద్య విశారద" బిరుదునందుకున్నారు. 1966లో తంజావురు జిల్లా మన్నారుగుడిలో జరిగిన కాంగ్రెస్ మహాసభలో చేసిన కచేరీ అనంతరం స్వర్గీయ ఇందిరా గాంధిచే సన్మానితులైనారు. 1966లోనే నాటి మద్రాసులోని వివేకానంద కాలేజీ రజతోత్సవాలలో కచేరి చేసి అప్పటి భారత రాష్ట్రపతి వి.వి.గిరిచే సన్మానించబడ్డారు. 1999 ఫిబ్రవరిలో హైదరాబాద్‌లో దక్షిణ భారత సాంస్కృతిక సంస్థ 5 కిలోల వెండి కిరీటంతో ఘనంగా సత్కరించింది. ఇలా ఆయనకు వరించి తమ గౌరవాలను పెంచుకున్న పురస్కారాలను గురించి వ్రాస్తూపోతే ఎప్పటికీ ముగియని జాబితానే అవుతుంది. 1993లో శృంగేరీ శారదా విద్యాపీఠానికి ఆస్థాన విద్వాంసుడి పదవి కూడా ఆ జాబితాలో ఒకటిగా నిలుస్తుంది.

కర్ణాటక సంగీత ప్రపంచాన్ని తన నాదస్వర వాదనతో సుమారు ఆరు దశాబ్దాల పాటు చకచ్చకితం చేసిన మహా విద్వాంసుడైన చినమౌలానా 1999 ఏప్రిల్ 13న మృతిచెంది తన నాదస్వరాన్ని విడిచారు. చివరగా మద్రాసు సంగీత అకాడమి కార్యదర్శి మైత్రేయ రామదురై అన్నట్లుగా "సంప్రదాయ సంగీత ప్రపంచంలో మూడు వందల ఏండ్ల నాదస్వర సంగీత పరంపరకు ఒక ఆలంబనగా నిలిచిన షేక్‌చినమౌలానా అచిరకాలం మనకు గుర్తుండి పోయే కళామూర్తి."

-హెచ్.రమేష్‌బాబు

## జస్ట్ ఫర్ ఫన్

## కోడిపుంజు

తూర్పుగోదావరి జిల్లాలోని ఓ చిన్న ఊరది.

ఆ వూళ్లో మెథడిస్ట్ చర్చ్‌లో కన్ఫెషన్ బాక్స్‌లో కూర్చుని వున్నాడు ప్రీస్ట్ సెబాస్టియన్. నిత్యం నిర్ణీత సమయంలో ఓ అరగంట పాటు అక్కడ కూర్చుంటాడతను. ఒకటి రెండు రోజులకొకరు వచ్చి తాము చేసిన పాపం చెప్తారు. ఏం చేస్తే ఆ పాపం పోతుందో సెబాస్టియన్ తగిన సలహా ఇస్తాడు. ఆ చర్చి ఆరంభించినప్పటి నించి ఇది ఆనవాయితీగా వస్తోంది. సాధారణంగా భర్తని కొట్టిన భార్య, పక్కతోటలోని కొబ్బరి చెట్ల నించి కాయలు దొంగిలించిన వారు, సారాయి తాగి పోట్లాటకి దిగిన వాళ్ళు కన్ఫెషన్ బాక్స్ దగ్గరికి వస్తుంటారు.

ఆ రోజు సెబాస్టియన్ కన్ఫెషన్ బాక్స్‌లో కూర్చునీ కూర్చోగానే బయటనించి కోడిపెట్ట రెక్కల చప్పుడు వినిపించింది.

"ఎవరది?" అడిగాడు సెబాస్టియన్.

"నమస్కారం ఫాదరూ, నేను మరియమ్మ కొడుకుని 'కన్నుపెనను' చెప్పుకుందామని వచ్చానండయ్యా" వినిపించిందో గొంతు.

"చెప్పు, ఏం పాపం చేసావు?" అడిగాడు ఫాదర్ సెబాస్టియన్

"కోడి పుంజయ్యా. ఉదయమే ఒకళ్ళింట్లోంచి



దొంగిలించానయ్యా. ఇంటికెళ్లి కొయ్యబోయే ముందు నాకు పాపం సేస్తున్నాననే బాధేసి, ఇక్కడికి లగెత్తు కొచ్చానయ్యా. కోడిపుంజుని వెంట తెచ్చానయ్యా. దాన్ని నువ్వు తీసేసుకుని నా పాపాన్ని పోగొట్టమని చెప్పడానికి వచ్చానయ్యా".

"ఊహు.. నేను తీసుకోనా కోడి పుంజుని..."

"తీసుకో ఫాదరూ. తీసుకుని నా పాపం కాయమని బెతిమాలడానికి పనివేళా ఇక్కడికి వచ్చానయ్యా".

"నేను తీసుకోనన్నాగా? నీ పాపం పోవాలంటే, నువ్వు దాన్ని ఎవరింట్లోంచి దొంగిలించావో ఆ ఇంటాయనకి తిరిగి ఇచ్చేసేయ్. దాంతో నీ పాపం ప్రక్షాళనమై నువ్వు నరకం నించి కాపాడ బడతావు".

"అక్కడే చిన్న చిక్కొచ్చిందయ్య. ఆ ఇంటాయన కోడిని తీసుకోనంటున్నాడు".

కొద్ది క్షణాలు ఆలోచించి చెప్పాడు ఫాదర్

"అలాగా? నువ్వు చెప్పేది నిజమేనా?"

"నీతోడు ఫాదరు"

"సరే, అది నిజమే అయితే నువ్వు దాన్ని నీ కుటుంబం కోసం నీ దగ్గరే ఉంచు కోవచ్చు".

"అలాసేస్తే పాపమేమోనన్న అనుమానం తీర్చుకోడానికి వచ్చానయ్యా".

"కోడి అసలు యజమాని వద్దన్నాక పాపం లేదు. అందుకు హామీ నాది. వెళ్ళు".

"సిత్తం.. ధర్మ ప్రభువులు" కన్ఫెషన్ బాక్స్‌కి మొక్కి మరియమ్మ కొడుకు చంకలో కోడితో వెళ్ళిపోయాడు.

చర్చి మూసాక ఆ రాత్రి తన ఇంటికి వెళ్ళాడు ఫాదర్ సెబాస్టియన్.

"ఏమండీ. ఈ ఉదయం మన కోడి పుంజుని ఎవరో ఎత్తుకెళ్ళారండీ" అతని కెదురొచ్చిన భార్య చెప్పింది ఆయనతో.

-మల్లాది వెంకట కృష్ణమూర్తి

# వాటి వలన సినిమా తర్వాత కూడా పాట మిగిలి పోతుంది

**-చంద్రబోస్**



ఓ కొత్తదనం
కొంత కొంటెతనం
ఎంతో స్కైలింగు
ఎన్నెన్నో ఛమక్కులు

## ఇవన్నీ చంద్రబోస్ పాట లక్షణాలు

ప్రస్తుతం ఉన్న ప్రతి సంగీత దర్శకుడి కాంబినేషన్‌లోనూ అతని హిట్ సాంగ్స్ ఉన్నాయి. ఈ మధ్య కాలంలో హిట్ అయిన ఆడియోలలో ఎక్కువ క్రేజీ సాంగ్స్‌కి కేరాఫ్ అడ్రస్ అతని కలమే! అందుకే అతి తక్కువ కాలంలోనే సక్సెస్‌ఫుల్ రైటర్‌గా పేరు తెచ్చుకున్నాడతను. ఆ 'టైలెంట్ చంద్రబోస్' తో 'హాసం' జరిపిన ఇంటర్వ్యూ ఇది:

**అసలు పాట రాయగలనన్న నమ్మకం గాని, రాద్దామన్న ఉత్సాహం గాని ఎలా కలిగింది?**

వరంగల్ జిల్లా చల్లగరిగ మా వూరు. ఇంటి పక్కనే ఉన్న ఆలయం నుంచి ప్రతిరోజూ ఘంటసాల గారి భక్తిగీతాలు, ఎమ్మెస్ సుబ్బలక్ష్మి భజగోవిందం, బాలమురళి గణపతి ప్రార్థనలు, ఎమ్మెస్ రామారావు సుందరకాండ, శోభారాజు అన్నమయ్య కీర్తనలు, బాలు గారి శివస్తోత్రం తెల్లవారుఝామున 4.30 నుంచి 6.00 వరకు వినబడేవి. అలా పాట వంటబట్టింది. ప్రతి సోమవారం జరిగే భజనల్లో కూచోవటం, ఆ తర్వాత పాడటం, అలా క్రమేపీ దేవుడిమీద పాట రాయటం, పాడటం, విన్నవాళ్ళు మెచ్చుకోవటం, అలా పాట నాకు సెకండ్ నేచర్ అయిపోయింది.



భార్య సుచిత్ర (ప్రముఖ నృత్య దర్శకురాలు) తో...

**అప్పుడు మీ వయసెంత?**

పన్నెండేళ్ళు.

**ఆ తర్వాత? పదమూడేళ్ళని చెప్పకుండా ఏం జరిగిందో చెప్పండి?**

మా వూరికి మల్లంపల్లి సుబ్రహ్మణ్యశర్మ భాగవతార్ వచ్చారు. మా ఇంటి పక్కనే బస చేశారు. ఆయన నన్ను బాగా ప్రభావితం చేశారు. ఆయనతోపాటు హరికథలకు వెళ్ళేవాణ్ణి. ఆయన తబలా నేర్పారు. హరికథలకి తబలా వాయిస్తే రోజుకి పది రూపాయలిచ్చేవారు. ఆయన ఎన్నో పుస్తకాలు చదివే వారు. అలా ఎక్కువగా చదవటం నాకు ఆయన దగ్గర్నుంచే అలవాటయింది. ఇవాళ్టికీ భోం చేస్తూ కూడా చదువుతాను - ఇంట్లో వాళ్ళు తిట్టినా సరే!

**ఆయన ప్రభావం ఇంకా వేటి మీద పడింది?**

ఆయన స్వంతంగా హరికథలు రాసుకునే వారు. ఎవరైనా వచ్చి ఫలానా వాళ్ళ మీద కావాలండీ అని అడిగితే ఆ వ్యక్తికి సంబంధించిన జీవిత చరిత్ర అంతా హరికథలా తమాషాగా అనుకుని ట్యూన్ కట్టిపాడేవారు. అలా ఆయన దగ్గర స్పాంటేనిటీ, క్రియేటివిటీ అలవాటయ్యాయి. కాలేజీ రోజుల్లో ఫ్రెండ్స్ బర్త్‌డేలకి, కాలేజీ ఫంక్షన్లకి ఆయన పద్ధతిలోనే పాటలు రాసి ట్యూన్ చేసుకుని పాడేవాణ్ణి. అందరూ బావుందనే వారు. పాటకు సంబంధించి ఏదో ఒకటి అవాలని వుండేది. ఆకాశవాణి, దూరదర్శన్‌లలో ఆడిషన్స్‌కి కూడా వెళ్ళాను. కానీ ఫెయిలయ్యాను.

**మరి బిటెక్ డిగ్రీ...?**

పాసవడమే కాదు. థర్డ్ ర్యాంక్ కూడా తెచ్చుకున్నానండీ బాబూ.

**అలాంటప్పుడు వైట్ కాలర్‌జాబ్ చూసుకోవాలనిపించలేదా? ఏ నమ్మకంతో పాటను నమ్ముకున్నారు?**

చెప్పాను కదండి పాటకు సంబంధించి ఏదో ఒకటి కావాలని ఉండేదని. నా పాటలు అవీ చూశాక నా ఫ్రెండ్స్ అందరూ రచయితగానే సైకొస్తానని నమ్మేరు. అదేమాట నాతో అన్నారు కూడా..... ఆ మాటలే నేను రచయితగా మరింత కృషి చేసి స్థిరపడడానికి పనికొచ్చాయి. తాజ్‌మహల్, పెళ్ళిసందడి సినిమాలకు రాసిన తర్వాత మరొక సంవత్సరం పాటు చూసి అప్పటికీ ఈ రంగంలో రాణించలేక పోతే మీరన్నట్టు ఇంజనీరింగ్ ఫీల్డ్‌లో సెటిల్ అవుదామనే అనుకున్నాను. ఓ రోజు ఎయిర్‌పోర్ట్‌లో రాఘవేంద్రరావు గారు కనబడి "ఇప్పుడు ఏం చేస్తున్నావు?" అని అడిగితే అదే సమాధానాన్ని ఇచ్చాను కూడా. దానికాయన "బాగా కృషి చేస్తే ఇందులోనే సెటిల్ అవచ్చు. కొత్తరకంగా రాయడానికి ట్రై చెయ్యి' అని సలహా ఇచ్చారు. మర్నాడు ఆయన దగ్గర్నుంచే పిలుపు. 'బొంబాయి ప్రియుడు'లో పాటలు రాయడానికి రమ్మని. ముందురోజు ఏ టైమ్‌లో ఆయనతో మాట్లాడేనో మర్నాడు అదే టైమ్‌కి ఫ్లయిట్‌లో ఉన్నాను. 'బొంబాయి ప్రియుడు' తర్వాత వేరే జాబ్ గురించి ఆలోచించే అవకాశమే రాలేదు.

**'బొంబాయి ప్రియుడు'లో 'బాలమురళీకృష్ణ నాకు బాల్యమిత్రుడే' 'రాజ్‌కపూర్ సినిమాలోని హీరోయిన్‌లా ఉంది' అంటూ వ్యక్తుల మీద 'చందనా చీరను కట్టి'లో యాడ్‌ల మీద రాసిన తర్వాత ఎటువంటి రెస్పాన్స్ లభించింది?**

చూడగానే కొత్తగా ఉందని రాఘవేంద్రరావుగారు వీలయినా మూడు ఒక్కలాగే ఉంటాయోమోనని 'చందనా చీరను కట్టి' పాటను ఆ తర్వాత చూద్దాం అని మిగిలిన రెండు పాటల రికార్డింగు, షూటింగు మొదలు పెట్టారు. 'బాలమురళీకృష్ణ నాకు బాల్యమిత్రుడే' పాట షూటింగ్ అవుతుండగా రాఘవేంద్రరావుగారు ఫోన్ చేశారు.



"బ్రహ్మానందం, భరణి, జెడి మిగిలిన ఆర్టిస్టులంతా పాటని తెగ ఎన్‌జాయ్ చేస్తున్నారు. నువ్వొకసారి వస్తే బావుంటుంది" అని. అలాగే వెళ్ళాను. కొత్త వాణ్ణయినా అక్కడ ఉన్న అందరూ ఎంతో మెచ్చుకున్నారు. ఆ హుషారుతో 'ఇంకో పాట కూడా రాశానండి' అంటూ 'చందనా చీరను కట్టి' పాటను వినిపించాను. దాంతో 'ఇది బ్రహ్మాండంగా ఉంది కదండీ' అంటూ ఆర్టిస్టులంతా రాఘవేంద్రరావు గారితో పర్సనల్‌గా అన్నారు. ఆ తర్వాత నుంచి అందరికీ తెలిసిన కథే...

**'చందనా చీరను కట్టి'లో యాడ్‌ల మీద, 'చిక్కలేదు చిన్నదాని ఆచూకీ' పాటలో వంటల మీద- ఆ తర్వాత నుంచి ఇంచుమించు చాలా పాటలు ఒక స్కీముతో, ఒక కాన్సెప్ట్‌తో రాస్తున్నట్టుగా ఉంది. చాలామంది 'స్కీముల చంద్రబోసు' అంటుంటారు. మీ రియాక్షన్ ఏమిటి?**

ఒక్కసారి తరచి చూడండి. ఎంతో మంది పాటలలో ఓ కాన్సెప్ట్, ఓ స్కీము ఉంటూనే ఉంటాయి. అంతెందుకు... అన్నమయ్య పాటలలో స్కీము లేదంటారా? బ్రహ్మకడిగిన పాదములో పాదం స్కీము, బ్రహ్మమొకటే పరబ్రహ్మమొకటేలో ఒక్కటే అన్నది స్కీము, కలగంటి కలగంటిలో ఏయే కలలు కన్నారో అది స్కీము, కొండల రాయుడే మా కులం దైవములో నిజదైవం, ఇంటిదైవం ఇలా దైవం స్కీము, ఇందరికి అభయమిచ్చు చేయిలో చెయ్యి స్కీము... ఇలా...! ఇది నేను వినమ్రతతో చెబుతున్న మాటే తప్ప పొగరుతో మాత్రం కాదు.

**ఓ పనైపోతుంది బాబు, ఉచితం లాంటి హుక్‌లైన్‌లతోను హుక్‌వర్డ్‌లతోను పాటలు రాయడం విషయం?**

దీనికి కూడా అన్నమయ్య 'ఛాంగుభళా' కీర్తనను నేను ఉదహరిస్తే అందరూ సహృదయంతో స్వీకరించాలని నా మనవి.

**ఇలా స్కీములు, కాన్సెప్ట్‌లు, హుక్‌లైన్‌లు, హుక్‌వరల్డ్‌లు వీటితో రాయడం వల్ల లాభం ఏమిటి? నష్టం ఏమిటి?**

వీటి వలన పాటకి ఫలానా అని ఓ హెడ్‌లైన్ ఏర్పడుతుంది. అగస్త్యభ్రాత, హనుమాయమ్మ గారి మొగుడులా కాకుండా ఓ ప్రత్యేకమైన గుర్తింపు వస్తుంది. సిట్యుయేషన్‌తో పాటు కొన్ని నిత్యసత్యాలు కూడా కలిసిపోతాయి కనుక సినిమా తర్వాత కూడా పాట మిగిలిపోతుంది. ఇక నష్టం అనడం కంటే కొన్ని సమస్యలు ఉన్నాయనడం బెటరు. ఈ స్టయిల్‌లో రాయడానికి ఆకాశమే హద్దు. అంచేత ఎన్నో అంశాలను ఒక గొడుగు కిందకి తీసుకోవడంలో టైమింగ్ విషయంలో ప్రాబ్లెమ్ వస్తుంది. చాలా ఎక్కువ టైమ్ తీసుకునిరాయాల్సి ఉంటుంది. ఒక్కోసారి భావం కంటిన్యూ అవుతూనే ఉంటుంది. ట్యూన్ ఎండ్ అయిపోతుంది. ఆకాశమే హద్దుగా రాసుకునే ఇటువంటి పాటలు ట్యూన్‌కి సెట్ అవడం విషయంలో చిన్నచిన్న సమస్యలు ఉంటుంటాయి.

**ఇప్పటిదాకా సమీక్షించుకుంటే మీ కెరీర్‌గురించి మీరేం అనుకుంటున్నారు?**

వచ్చిన ప్రతి అవకాశాన్ని సద్వినియోగం చేసుకున్నాననే అనుకుంటున్నాను.

## చంద్రబోస్‌కు నచ్చిన తన పాటలు

| పాటపల్లవి | సినిమా | కాన్సెప్ట్ |
|---|---|---|
| 1. ఎక్కడో పుట్టి | స్టూడెంట్ నం.1 | ఫేర్‌వెల్, కాలేజ్ ముచ్చట్లు |
| 2. అమ్మాయె సన్నగా | ఖుషి | ఫైన్ క్వాలిటీస్ |
| 3. ఎలా ఎలా | నువ్వులేక నేను లేను | హౌ టు ఎక్స్‌ప్రెస్ లవ్ |
| 4. నలుగురికి నచ్చినది | టక్కరిదొంగ | యూత్‌ఫుల్ థాట్స్ |
| 5. అందానికే అర్థానివే | మురారి | ప్రేయసికోసం తనలో ఉన్నవి ఏవేవి... ఎందుకు... |
| 6. నీ నవ్వుల తెల్లదనాన్ని | ఆది | ఏది ఇవ్వొచ్చు, ఏది ఇవ్వొద్దు? |
| 7. మంచితనం ఇంటిపేరు | సీమసింహం | నాయకుడికి ఉండాల్సిన లక్షణాలు |
| 8. ఉచితం | ముత్యం | ఫ్రీగా ఏవేవి ఉంటాయి |
| 9. ఎవరేమి అనుకున్న | బడ్జెట్ పద్మనాభం | అవమానాలు ఎదురైనా కూడా ఎలా నిలదొక్కుకోవాలి |
| 10. బూంబూం శకలక | కలిసుందాం రా..... | ప్రపంచ శాంతి |
| 11. ఓ మారియా.. | చూడాలని వుంది | ఇన్స్‌పిరేషన్, మనిషి కష్టపడాలి |
| 12. ఆడపిల్ల సిగ్గుపడితే | పెళ్ళి సంబంధం | ఏవేవి ఎంతెంత గ్లామర్‌గా ఉంటాయి |
| 13. హాయ్‌రేహాయ్.. | సిందూరం | అమ్మాయిని రకరకాల వస్తువులతో పోల్చడం |
| 14. చందన చీరలు కట్టి | బొంబాయి ప్రియుడు | రకరకాల యాడ్స్‌ని ఉపయోగించడం |
| 15. కొత్తిమీర పువ్వులాంటి | సర్దుకుపోదాం రండి | ఫుడ్ ఐటమ్స్ |

## సుచిత్రకు నచ్చిన చంద్రబోస్ పాటలు

| | | |
|---|---|---|
| 1. ప్రేమిస్తున్నా | స్వప్నలోకం | దేన్ని దేన్ని ప్రేమిస్తున్నాడు |
| 2. మా నాన్న జేమ్స్‌బాండ్ | దీర్ఘసుమంగళీభవ | ఫాదర్‌లోని బోల్డ్‌నెస్ |
| 3. తారక దిగివచ్చి | ఊయల | కాదనలేకపోవడం |
| 4. తణుకో, అరకో | పరదేశి | ఊర్లు, దేశాల పేర్లు |
| 5. జిల్ జిల్ జిల్ | పెళ్ళిపీటలు | ప్రకృతిని అమ్మాయిని పోల్చడం |
| 6. ఒకరికి ఒకరై | స్టూడెంట్ నెం.1 | షేరింగ్ అనే ఫీలింగ్ |
| 7. ఏ ఛాయ్ చటుక్కున | మృగరాజు | చాయ్ (టీ) గొప్పతనం |
| 8. ఓ పనైపోతుంది బాబూ | ప్రేమించుకుందాం రా.... | ఏమేమి చేస్తే ఓ పనై పోతుందో అనే వాటికి హుక్ లైన్ |
| 9. రైలు బండిని | నువ్వు వస్తావని | డబ్బు ప్రాముఖ్యత |
| 10. ఆడవాళ్ళమండి మేము | క్షేమంగా వెళ్ళి లాభంగా రండి | ఆడవాళ్ళ గొప్పతనం |
| 11. డోన్ట్ మిస్ సోదరా | జయం మనదేరా | ఏమేమి మిస్ కాకూడదో వాటికి హుక్ లైన్ |
| 12. వినరా వినరా దోస్తు | పట్టుకోండి చూద్దాం | వాస్తు ప్రాముఖ్యత |
| 13. నూటొక్క జిల్లాల్లో | ఇద్దరు మిత్రులు | ఒక ఆడ మగ మధ్య నిజమైన స్నేహం విలువ |
| 14. తిరుపతిలో ఏనాడో | శ్రీమతీ వెళ్ళొస్తా | జాబ్‌కి అవసరమైన వాటిని లవ్‌కి అన్వయించడం |
| 15. రంగుల రెక్కలు నాగ్గాని | ప్రేమకు స్వాగతం | రకరకాల ఊహలు |

# కమాల్ ప్రశ్న - ఢమాల్ జవాబుల స్పెషల్



"మీ ఆయన పుస్తకాల పురుగట కదా?"
"అంతసీన్ లేదులెండి ఆయన జస్ట్ మామూలు పురుగే..."



"బొమ్మ వెయ్యమంటే నా ముఖం కేసి చూస్తావేం?"
"కోతి బొమ్మ వెయ్యమన్నారుగా.... జస్ట్ రిఫరెన్స్ కోసం".



"తప్పు... అలా కొట్టుకోగూడదమ్మా... శత్రువుని కూడా ప్రేమించటం నేర్చుకోవాలి..." చెప్పింది తల్లి.
"నువ్వు చెప్పింది నిజమేనమ్మా.... కానీ వాడు శత్రువు కాదు.. తమ్ముడు కదా..." అన్నాడు నాని.






ఇనప్పెట్టె తెరుస్తుండగా కేకవెయ్యబోతున్న పెద్దమనిషితో "నీకు నీ డబ్బు కావాలా లేక నీ జీవితం కావాలా?" అని కత్తి చూపిస్తూ బెదిరించి అడిగేడు దొంగ.
"జీవితం కావాలంటే నువ్వే తీసుకోవయ్యా బాబూ.... ముసలితనంలో అవసరం వస్తుందని డబ్బు దాచుకున్నాను. అది మాత్రం నాకే కావాలిలే..." చెప్పాడు పెద్దమనిషి



"ఈ పండక్కి నీకు ఏం కావాలి డార్లింగ్"
"విడాకులు".



"ఏమోయ్... ఇది టీయా? పాచి కడిగిన నీళ్ళలా వుంది" ఫిర్యాదు చేశాడు కస్టమర్.
"పాండిసార్... పాచి కడిగిన నీళ్ళు అచ్చు ఇలాగే వుంటాయని మీకెలా తెలుసు?" అన్నాడు సర్వర్ నవ్వుతూ.



"ఆ డాక్టరు నీ జీవితాన్ని కాపాడేడా ఎలా....?"
"ఆ మధ్య నాకు జబ్బు చేసినప్పుడు మా వాళ్ళు ఆయన కోసం కబురు పంపేరు. ఆయన రాలేదు. అలా బతికి బైట పడ్డానన్నమాట.'

"గట్టిగ శ్వాస పీలిస్తే సూక్ష్మజీవులు చచ్చిపోతాయటగా..."
"కరక్టే.. కాని గట్టిగా వాటిచేత శ్వాస పీల్చేలా చేయటం ఎలా సాధ్యం?

సూక్ష్మజీవులను చూడటం సాధ్యం కాదు కనుక ఇక్కడ కార్టూన్ లేదు.

# కమాల్ ప్రశ్న - ఢమాల్ జవాబుల స్పెషల్



"మగాళ్ళ కంటే ఆడాళ్ళే ఎక్కువ కాలం బ్రతకటానికి కారణం ఏమిటంటావ్!?"
"ఆ ఏముంది... వాళ్ళకి భార్యలు వుండరుగా...."



"ఆఫీసుకి లేటుగా ఎందుకు వచ్చావ్?"
"ప్రొద్దుటే నా పెళ్ళి అయిందండీ"
"సర్లే ఇంకెప్పుడూ అలాంటి పని చెయ్యకు..."
"అలాంటి పనంటే లేట్‌గా రావడమా? పెళ్ళి చేసుకోవడమా సార్?"



"టీనేజిలో వున్న వాళ్ళంతా లిప్‌స్టిక్ వేసుకుంటారా?"
"లేదు... టీనేజిలో వున్న ఆడపిల్లలు మాత్రమే వేసుకుంటారు."






"నేను విడాకులు తీసుకుందామనుకుంటున్నాను. ఆర్నెల్ల నుంచి నాతో మా ఆవిడ మాట్లాడటమే లేదు"
"ఎందుకైనా మంచిది ఇంకోసారి ఆలోచించరా... అలాంటి భార్యలు దొరకటం చాలా అరుదురా... అదృష్టంరా..."



"మీ ఆయన ఆడపిల్లల వెంట పడుతున్నాడట"..
"ఏం ఫర్వాలేదు... కుక్కలు కార్ల వెంట పరుగెట్టినంత మాత్రాన కారుని నడప లేవుగా..."



"భయం అన్న పదానికి అర్థమే నాకు తెలియదురా" గొప్పగా చెప్పాడు గోపాల్.
"పోన్లే.. ఏదైనా డిక్షనరీ తీసి చూళ్ళేకపోయావా?" వేళాకోళంగా అన్నాడు వెంకటేష్.



"నేనందరికీ బాగా తెలుసండీ... నన్ను మీరు బహుశా చాలా సినిమాల్లో చూసుండాలే"
"మీరింతకీ ఏ టిక్కెట్టుకి వెళుతుంటారు?".

# న్యూస్ వ్యూస్

## ఆర్పీ పట్నాయక్ రికార్డింగ్ థియేటర్ 'సంగీత్ ప్రాడిజీ' ప్రారంభం



అడుగు పెట్టిన అనతి కాలంలోనే అత్యున్నత శిఖరాలను చేరుకున్న ఆర్పీ పట్నాయక్ వర్కింగ్ పార్ట్‌నర్‌గా నెలకొల్పిన 'సంగీత్ ప్రాడిజీ' రికార్డింగ్, రీరికార్డింగ్ థియేటర్ హైదరాబాద్‌లో ఏప్రిల్ 22న 'జయం' సినిమాలోని పాటతో ప్రారంభమైంది. ప్రొటూల్స్ అనే లేటెస్ట్ ఎక్విప్‌మెంట్ ఈ థియేటర్‌లో ఉందని దీని ద్వారా మరింత స్పష్టంగా వినిపిస్తుందని, లగాన్, దిల్ చాహతా హై చిత్రాలు ఇటువంటి ప్రొటూల్స్ ఎక్విప్‌మెంట్‌లోనే రికార్డయినాయని ఈ రికార్డింగ్ థియేటర్‌ని ప్రారంభించిన ప్రముఖ నిర్మాత డి.సురేష్ బాబు తెలిపారు. ప్రాడిజీ అంటే బాలమేధావి అని అర్థం ఉంది కనుక ప్రొటూల్స్ లో మొదటి అక్షరాన్ని, డిజిటల్‌లో 'డిజి' అనే అక్షరాల్ని కలుపుకుని 'సంగీత్ ప్రాడిజీ'గా ఈ రికార్డింగ్ అండ్ రీరికార్డింగ్ థియేటర్‌కి పేరు పెట్టుకున్నామని ఆర్పీ పట్నాయక్ అన్నారు.

1 నవంబర్ నుంచి రికార్డింగ్ అండ్ రీరికార్డింగ్ కూడా ఖచ్చితంగా ఆంధ్రప్రదేశ్‌లోనే చేసితీరాలన్న రూలు రాబోతోందని, ఇదివరకైతే తగిన థియేటర్ లేకపోవటంవలన ఈ రూలుని కొంత సడలించారుగాని ఇప్పుడు తగిన థియేటర్‌లు ఉన్నాయి కనుక ఇక తెలుగు సినీసంగీతరంగం అంతా హైద్రాబాద్‌లో పూర్తిగా స్థిరపడతాయన్న ఆశాభావాన్ని, ప్రముఖ నిర్మాత డా॥ కె.యల్.నారాయణ వ్యక్తంచేశారు. ఈ 'సంగీత్ ప్రాడిజీ' థియేటర్ పైభాగంలో ప్రముఖ దర్శకుడు తేజ యొక్క డబ్బింగ్ థియేటర్ అతిత్వరలో రాబోతోంది.

## కనులు మూసినా నీవాయే ఆడియో ఆవిష్కరణ



'ఋతురాగాలు' 'కస్తూరి' సీరియల్స్ ద్వారా టీవీ మీడియా పాప్యులారిటీని పెంచిన దర్శకురాలు మంజులానాయుడు, నిర్మాత సుధాకర్ పల్లమాల (జిష్ణు) కలిసి శ్రీకాంత్ ఎంటర్‌టెయిన్‌మెంట్ మూవీస్ పతాకంపై నిర్మించిన 'కనులు మూసినా నీవాయె' సినిమా ఆడియో ఆవిష్కరణ హైద్రాబాద్ గ్రీన్‌పార్క్ హోటల్‌లో జరిగింది. హాజరైన అతిథులలో ఒకరైన తమ్మారెడ్డి భరద్వాజ మాట్లాడుతూ సినిమా ఇండస్ట్రీ చాలావరకు హైదరాబాద్ వచ్చేసినా మ్యూజిక్ సెక్షన్ ఇంకా చెన్నైలోనే ఉందని ఆర్పీ పట్నాయక్, చక్రి వంటివారు మాత్రం హైదరాబాద్‌లో రికార్డింగ్ చేస్తూ లోకల్‌టాలెంట్‌ని బాగా ఉపయోగించడం ప్రశంసించదగ్గ విషయమని అన్నారు. అదే విషయాన్ని సమర్థిస్తూ మురళీమోహన్ మాట్లాడారు. తను వినిపించిన ఏ ట్యూన్‌కి దర్శకురాలు మంజులానాయుడు ఆల్టర్నేటివ్ ట్యూన్ ఏదీ అడగకుండా ప్రతీ వరుసనూ, మొదటిసారి వినగానే ఓ.కే.చేశారని సంగీతదర్శకుడు చక్రి అన్నారు. ఆయనను మాట్లాడమని కోరినప్పుడు 'ముందు నా సింగర్స్ మాట్లాడిన తరువాత నేను మాట్లాడతాను' అంటూ తన బృందానికి ప్రాముఖ్యతను ఇవ్వడం సంగీతాభిమానులను ఆకట్టుకుంది.

## అందం ఆడియో ఆవిష్కరణ



దాసరి నారాయణ రావు అధ్యక్షతన తీగల కృష్ణారెడ్డి ముఖ్య అతిథిగా, దర్శకుడు విజయ భాస్కర్, నిర్మాత రవికిషోర్, నటుడు విజయచందర్ మొదలైనవారు విశిష్ట అతిథులుగా హాజరైన 'అందం' ఆడియో ఆవిష్కరణ సభ ఏప్రిల్ 14న శబ్దాలయ స్టూడియోలో జరిగింది. చిత్రానికి నిర్మాత, పాటల రచయిత కూడా అయిన ఎమ్మెస్ మాట్లాడుతూ చిన్న సినిమాలకు, పత్రికలు, మీడియా సరియైన ప్రచారాన్ని ఇవ్వవలసిందిగా కోరారు. ఈ సందర్భంగా ఎమ్మెస్ రెడ్డి ఉదహరించిన:

'కవి తిక్కన లేకపోతే
ఖడ్గతిక్కన ఎవరికి తెలుసు?
పిల్ల వాయువు లేకపోతే
మల్లెపూల వాసన ఎవరికి తెలుసు?'

అనే వాక్యాలు సభికుల ప్రశంసల నందుకున్నాయి. దాసరి నారాయణరావు మాట్లాడుతూ 'ఇవాళ చిన్న సినిమా ఫిల్మ్‌నగర్ సెంటర్‌లో పబ్లిక్‌గా హత్య చేయబడింది' అంటూ బాధపడ్డారు. ఆహూతులనందరినీ వేదికపైకి ఆహ్వానించడానికి ఎమ్మెస్ రెడ్డి ప్రత్యేకంగా రాసిన స్వాగతగీతం అందరినీ అలరించింది. తన యూనిట్‌లో పనిచేసే ప్రతీవ్యక్తికీ ప్రతినెలా ఒకటో తారీఖున తలుపు తట్టి జీతం ఇచ్చే వ్యక్తిగా ఎమ్మెస్ రెడ్డిని ఆహూతులందరూ కొనియాడారు.

## బాలీవుడ్ స్థాయిలో జరిగిన '123' ఆడియో ఆవిష్కరణ



నగ్మా సోదరి జ్యోతికతో ప్రభుదేవా సోదరత్రయం నటించిన '123' సినిమా ఆడియో ఆవిష్కరణ ఏప్రిల్ 21న హైదరాబాద్‌లోని కంట్రీక్లబ్‌లో బాలీవుడ్ ఫంక్షన్ల స్థాయిలో జరిగింది. ఓవైపు సినిమాలోని పాటలను స్క్రీన్‌పై చూపించి, మరోవైపు స్టేజిపై అందులోని కొన్ని పాటలను బెంగుళూరుకి చెందిన 'స్టూడియో ఫోకస్' వారు వేరేగా సమకూర్చిన కొరియోగ్రఫీతో ప్రదర్శించారు. ఆడియో క్యాసెట్‌ను నిర్మాత డి.రామానాయుడు ఆవిష్కరించి తొలిక్యాసెట్‌ను నటి జయప్రదకు అందజేశారు. సాంగ్స్ ప్రొజక్షన్, స్టేజిపై ప్రదర్శించిన నృత్యాలు, పెద్దగా ఉపన్యాసాలు లేకపోవడం ఇవన్నీ వచ్చినవారిని ఆకట్టుకున్నాయి. తెలుగు, తమిళం, హిందీ మూడు భాషలలో తయారైన ఈ చిత్రంలోని పాటలు, వాటి చిత్రీకరణ చిత్రాన్ని విజయవంతంగా నడిపించే స్థాయిలో ఉన్నాయి.




'హాసం' 16-31 మార్చి 2002 పత్రిక 58-59 పేజీల్లో అర్థం చేసుకుందాం - ఆస్వాదిద్దాం -లో 'బహారోం ఫూల్ బర్‌సావో' పాటను విశ్లేషణలో చూస్తుంటే 'దీక్ష' అనే సినిమాలో ఘంటసాల గారు (ఎన్.టి.ఆర్) పాడిన 'మెరిసే మేఘమాలికా! ఉరుములు చాలు చాలిక - అనే పాట గుర్తొచ్చింది. సాహిత్యం అలాగ ఉందా - ఆ సంగీతం అవే వరుసలా తెలియదు - నాకు రెండు పాటలూ ఒకేసారి జ్ఞాపకం వచ్చి ఈ కార్డు వ్రాస్తున్నాను. దయచేసి ఈ విషయం క్లారిఫై చేయగలరు.

-కె.వి.వి.సత్యనారాయణ, భద్రాచలం

'మెరిసే మేఘమాలికా' పాట పల్లవి కూడా శివరంజని రాగచ్ఛాయలలోనే ఉండటం మీకు అలా అనిపించటానికి మొదట కారణం. ఇక రెండవ కారణం - ఆ పాట రచయిత సి.నారాయణరెడ్డి, సంగీత దర్శకుడు పెండ్యాల, దర్శకుడు కె.ప్రత్యగాత్మ ఈ ముగ్గురు 'బహారో ఫూల్ బర్‌సావో' పాటనే అనుసరించాలన్న నిర్ణయాన్ని తీసుకోవడం! ఈ విషయాన్నే మరింత విపులంగా చర్చిస్తూ 'మెరిసే మేఘమాలిక' పాటని ఆ 'బహారో ఫూల్ బర్‌సావో' పాట చట్రం నుండి బైట పడుతూ ఎలా రాశారో - 'పాటలో ఏముంది నా మాటలో ఏముంది' పుస్తకం రెండవ భాగంలో సి.నారాయణరెడ్డి వివరించారు. వీలైతే ఆ పుస్తకాన్ని సంపాదించి చదవండి.

-ఎడిటర్

"తైయ్ పిరందాల్ వళి పిరక్కుం" తమిళ చిత్రం ఆధారంగా 'శ్రీ' ప్రొడక్షన్స్ వారు సి.ఎస్.రావు దర్శకత్వంలో "మంచి మనసుకు మంచి రోజులు"గా ఎన్టీఆర్, రాజసులోచన, రమణ మూర్తి, గిరిజలతో తెలుగులో నిర్మించారు. తమిళ చిత్రానికి సంగీతం కె.వి. మహదేవన్ కాగా తెలుగుకు ఘంటసాల.

తమిళంలో వున్న పాటల్ని యథాతథంగా తెలుగులో వాడుకున్నారు. 1. వినవమ్మా వినవమ్మా 2. కలవారి స్వార్థం నిరుపేద దుఃఖం, 3. ధరణికి గిరి భారమా 4. అనుకున్నదొక్కటి అయినది ఒక్కటి. కాని తమిళంలో సూపర్ హిట్టయిన పాట "ఆశయే అలైపోలే" తిరుచ్చి లోకనాధన్ పాడినది తెలుగులో వాడుకోలేదు. 'శ్రీ' ప్రొడక్షన్స్ వారు తదుపరి తీసిన "శభాష్ రాముడు" చిత్రంలో "ఆశయే అలైపోలే" పాటను రేలంగిపై "ఆశలే అలలాగా, ఊగెనే సరదాగా" చిత్రీకరించారు కథకు అవసరం లేకుండ. "శభాష్ రాముడు" చిత్రానికి సంగీతం ఘంటసాల, దర్శకుడు సి.ఎస్.రావు గార్లే. ఇలా ఎందుకు జరిగింది?

-ఎస్.శ్రీనివాస్‌రావు, ఎమ్మిగనూరు

ఆ రోజుల్లో ట్రాక్స్ కొనుక్కోవటం అనే సంప్రదాయం ఒకటుండేది. ఒకసారి కొన్న ట్రాక్‌ని ఏ కారణం చేతనైనా సదరు రీమేక్ చిత్రంలో ఉపయోగించుకోలేకపోతే వారి తరువాతి ప్రొడక్షన్స్‌లో వాడుకోవటం సహజం. ఇలాంటి సంఘటనలు సుందర్‌లాల్ నహతా - డూండీ నిర్మాతలుగా ఉన్న సినిమాలలోనూ, ఏవీయమ్ వారి సినిమాలలోను చాలా జరిగాయి. వీటి గురించి 'ఆపాతమధురం' శీర్షికలో ముందు ముందు సందర్భానుసారంగా ప్రస్తావించటం జరుగుతుంది. రెగ్యులర్‌గా ఫాలో అవుతూ ఉండండి. మీకే అర్థమయిపోతుంది.

-ఎడిటర్

ఈ ఉత్తరం చదివి "దొంగ పడ్డ ఆర్నెల్లకు..." అనుకోకండి. పాత పత్రికలు చాలా ఆలస్యంగా తెప్పించుకున్నాను. అందులో 16-31 అక్టోబరు పత్రికలో టేకులు-మిస్టేకులు శీర్షికలో మొదటిది 'బుద్ధిమంతుడు' సినిమా గురించి వేసారు. 'అల్లరి పెడతారే - పిల్లలు అల్లరి పెడతారే" పల్లవి ముందు "ఎట్లా పుడతారే - పిల్లలు ఎట్లా పుడతారే" అనే వుండి వుండటం నూరుపాళ్ళ నిజం. ఎందుకు అంటారా, బుద్ధిమంతుడు ఎల్.పి.లో ఈ పాట "ఎట్లా, అసలెట్లా" అని రాసి వుంటుంది. అదీ కాక పల్లవి ప్రారంభమయ్యేముందు ఈ పదం అన్నాకనే ప్రీ-లూడ్ స్టార్ట్ అయి పల్లవి ప్రారంభ మవుతుంది. కాబట్టి మీరు అన్నమాటే నిజం. ఏది ఏమయినా ఈ శీర్షికను పత్రికలో కొనసాగిస్తూ పోతే హాసానికే అందం వస్తుంది.

-సోమయాజుల సాయిప్రసాద్
ఒనకడిల్లీ (ఒరిస్సా)

16-30 ఏప్రిల్ 'హాసం' సంచికలో ఆనంద్ బక్షీ మీద వచ్చిన నివాళిలో కొన్ని తప్పులు దొర్లినవి. "అమర్‌ప్రేమ్" విడుదలైంది 1972లో కాదు 1971లో. అలాగే "షాగిర్ద్", "వాపస్" "అనిత" చిత్రాల పాటల రచయిత ఆనంద్ బక్షీ కాదు. "షాగిర్ద్", 'వాపస్ ' చిత్రాలకు మజ్‌రూహ్ సుల్తాన్‌పూరి. "అనిత " చిత్రానికి రాజామెహందీ అలీఖాన్ పాటలు వ్రాశారు. నివాళిలో యిటువంటి తప్పులు రాకుండా చూడమని మనవి.

-బి.శ్రీనివాసరావు, హైదరాబాద్.

మీ ఉత్తరం చూశాక - హిందీ సినిమా పాటలకు సంబంధించినంతవరకు అథారిటీ అని చెప్పదగ్గ 'గీత్‌కోశ్' తెప్పించి చూశాం. మీరన్నవన్నీ ఆ 'గీత్‌కోశ్'లోని వివరాలతో సరిపోయాయి. వెంటనే చెన్నైకి ఫోన్ చేసి భువనచంద్రగారితో మాట్లాడాం. ఆయన ఎయిర్‌ఫోర్స్‌లో చేరేముందు బోర్డర్‌లో తన మనసుకు ఉపశమనంగా ఉంటుందని కొన్ని పాటల పుస్తకాలు కొనుక్కున్నానని - అందులో ఉన్న ఇన్ఫర్మేషన్ రాశానని ఆయన తెలిపారు. గీత్‌కోశ్ గురించి చెప్పాక ఖచ్చితంగా ఆ పుస్తకాన్ని తెప్పించుకుంటానని తన దగ్గరున్న ఇన్ఫర్మేషన్‌ని కరెక్ట్ చేసుకుంటానని తెలుపుతూ నిర్మాణాత్మక మైన విమర్శ చేసిన మిమ్మల్ని, మీ వంటి పాఠకులున్న 'హాసం' పత్రికని మనస్ఫూర్తిగా ప్రశంసించారు.

-ఎడిటర్

16-30 ఏప్రిల్ '02 సంచికలో కీ.శే. ఆనందబక్షీగారి వ్యాసం బావుంది. మీరు ప్రచురించిన కొన్ని పాటల్లో అపశ్రుతి. "అనిత" చిత్రంలో "తుమ్ బిన్ జీనవ్ కైసే బీతా పూఛోమేరే దిల్‌సే" పాటను ముకేష్ పాడారు. మన్నాడే కాదు.

వి.శాంతారాం నిర్మించిన "ఝనక్ ఝనక్ పాయల్ బాజే" చిత్రంలో లతా మంగేష్కర్ మరియు హేమంతకుమార్‌గార్లు పాడిన "నైన్ సె నైన్ నాహీ మిలావో" పాట ప్రచురించినందులకు పాఠకులకు వీనులవిందు. ఈ పాటను చూస్తూ వింటే ఆనందం, పారవశ్యం కలుగుతాయి. కాని పాటను అసంపూర్ణంగా ప్రచురించారు. మీరు వదిలివేసిన చరణాలు యివిగో!

"రిం ఝిం ఝిం గాయే ఝరణోకి ధార్
దిల్‌కో లుభాయే కోయల్ పుకార్
ఝరణోకి ధారోమే తేరా సంగీత్
గాయే కోయల్ తేరాహీగీత్ గుయ్యా!
"నైన్‌సెనైన్"

పై చరణాలు మీరు ప్రచురించిన పాట మధ్యలో ఉండాలి.

-ఎస్.శ్రీనివాసరావ్, ఎమ్మిగనూరు

మీ ఉత్తరం వచ్చిన తర్వాత కూడా మళ్ళీ 'గీత్‌కోశ్' తెప్పించి చూశాం. మీరే కరెక్టు. అది పాడింది. ముకేషే. మళ్ళీ భువనచంద్ర గారికి ఫోన్ చేస్తే ఆయన ఏమంటారో ముందు లెటర్‌లోనే ఉంది కనుక తిరిగి ఆయనకి ఫోన్ చెయ్యలేదు. తప్పు సరిదిద్దినందుకు, వదిలేసిన చరణాన్ని యిచ్చినందుకు థాంక్స్.

-ఎడిటర్

## న్యూస్ వ్యూస్

### టి.వి. సీరియల్‌గా కన్యాశుల్కం

తెలుగు ప్రజల మనోఫలకాలపై చెరగని ముద్రవేసిన నాటకం - గురజాడ వారి "కన్యాశుల్కం". ఆ నాటకాన్ని, అదే ఆర్డర్‌లో ఫాలో అవుతూ, ఆరుద్ర ఎడిట్ చేసి ఇచ్చిన వెర్షన్‌ని ఒక శాటిలైట్ టి.వి.కి 26 ఎపిసోడ్స్ సీరియల్స్‌గా సాయి దర్శన్ మీడియా ప్రై.లి. (విశాఖపట్నం) బ్యానర్‌పై ఎమ్. వెంకట్రావుగారు నిర్మిస్తున్నారు. రావి కొండలరావు దర్శకత్వంలో ఇప్పటికే 40% షూటింగ్ పూర్తి చేసుకున్న ఈ టి.వి. సీరియల్‌లో ప్రధాన పాత్ర అయిన "గిరీశం"గా గొల్లపూడి మారుతీరావు పోషిస్తుండగా, లుబ్ధావధాన్లుగా నలభైఏళ్ళుగా రంగస్థలం మీద జీవించిన పీసపాటి నర సింహ మూర్తి, మధురవాణిగా జయలలిత, వెంకమ్మగా రాధా కుమారి, బుచ్చమ్మగా లావణ్య, అగ్నిహోత్రావధానులుగా ఎ. గోపాలకృష్ణ తదితరులు నటిస్తున్నారు. ఈ సీరియల్‌కి సంబంధించి టైటిల్ సాంగ్‌ని 'లక్స్ క్రియేషన్స్ స్టుడియో' (వైజాగ్)లో ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం పాడగా, రికార్డ్ చేశారు. "తెలుగు కథకు శ్రీకారం,, మెరిసే ముత్యాల సరం, అక్షరాల వెలుగు జాడ - అతడే మన గురజాడ" అన్నది పల్లవి. రాంభట్ల నృసింహశర్మ వ్రాయగా, మాధవపెద్ది సురేష్ స్వరపరిచారీ పాటని. ఈ నెల 27 నుంచి 15 రోజులపాటు జరిగే షెడ్యూలులో చాలా భాగం పూర్తవుతుంది. క్వాలిటీతో, పూర్తి ధ్యేయంతో, ఈ వ్యావహారిక ఆదికావ్యాన్ని నిర్మిస్తున్నామని నిర్మాత ఎమ్. వెంకట్రావు తెలిపారు.



### లిమ్కా బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో హాస్యానికి పెద్దపీట



లిమ్కా బుక్ ఆఫ్ రికార్డ్స్ గురించి తెలియని వారుండరు. ఇప్పటిదాకా వివిధ రంగాల్లోని వ్యక్తులను గుర్తించిన వీరు, ప్ర ప్రథమంగా హాస్యానికి కూడా చోటు కల్పించారు. 2003 ఎడిషన్‌లో ఈ విభాగం చోటు చేసుకోనుంది. హాస్యావధాని శంకర నారాయణ గారిని ఈ రంగంలో రికార్డు సృష్టించిన వారిగా పేరు నమోదు చేయదలిచారు. గత సంవత్సరం మార్చి 18న హైద్రాబాద్‌లో సుకన్యా ఆర్ట్ థియేటర్స్ వారు నిర్వహించిన ఓ కార్యక్రమంలో ఏకధాటిగా 12 గంటల పాటు ప్రేక్షకులను తన హాస్య చతురతతో నవ్వించి, అలరించినందుకు గాను శ్రీ శంకర నారాయణ గారికి ఈ గౌరవం దక్కనుంది.

### 25 మంది విజేతలకు 'స్వర్ణోత్సవ గాయని సుశీల' డబుల్ ప్యాక్ ఉచితంగా...



HMV   RPG   saregama   హాసం

1. H.M.V. అబ్రివియేషన్ ఫుల్‌ఫార్మ్‌లో ఏమిటి?
2. స్వర్ణోత్సవ గాయని పి. సుశీల డబుల్ ప్యాక్ క్యాసెట్‌లో ఇటీవల పరమపదించిన చక్రవర్తి సంగీత దర్శకత్వంలో వచ్చిన పాటలెన్ని ఉన్నాయి? అవి ఏమిటి?



పై ప్రశ్నలకు కరెక్ట్‌గా ఓ తెల్లకాగితంపై సమాధానం రాసి దిగువనున్న కూపన్‌ను సరిగ్గా నింపి జతపరిచి పంపిన వారిలో 25మందికి 'స్వర్ణోత్సవ గాయని పి. సుశీల' డబుల్ ప్యాక్ (అంటే టోటల్‌గా 50 క్యాసెట్లన్నమాట) కొరియర్‌లో పంపబడతాయి. ఎంట్రీలు 'హాసం' ఆఫీసుకి 15-5-2002 తేదీలోగా అందాలి.

పేరు :------------------------------------------------

అడ్రసు :------------------------------------------------

------------------------------------------------

------------------------------ ఫోన్ నం.----------------



* ఇటీవల విడుదలైన హెచ్.ఎం.వి. వారి క్యాసెట్లలో మీకు నచ్చిన క్యాసెట్‌ను టిక్ చేయండి.

ఎ. పుట్టినరోజు పాటలు    బి. ఘంటసాల - లీల బెస్ట్ పెయిర్

సి. యస్వీ రంగారావు డైలాగ్స్    డి. భరణీ వారి 'చింతామణి'




8 మౌనమేలనోయి




మౌనమేలనోయి 1




8 అందం




అందం 1

రచన: వేటూరి — **1** — గానం: రమణగోగుల, ప్రియ

ప/ఆ: ఓ ప్రియురాలా... నా మధుబాలా... నిజాలకలా
నీ నయనాలా... ఆ గగనాలా... సితారకలా
మల్లెమాలికలే... రచించే... మౌనగీతికలా
సన్నజాజులలో... సుమించే... సందె కోరికలా
ఆ: ఓ చెలికాడా... యీ చెలికాడా... యిదేం రగడ
నా నిను చూడ... నీ జతగూడ... యిదేమి దడ
తేనే వెన్నెలతో... లిఖించే... ప్రేమ పత్రికలా
పిల్లగాలులతో... ధ్వనించే... వేణుగీతికలా — అ: ॥ఓ ప్రియురాలా॥
చ/ఆ: నీ పెదవిదాటే... పూల ఋతువేదో
మీటింది నాలో... సుఖవీణలే
ఆ: నీ కనుల దాటే... తీపికల ఏదో
రాసింది నాకే... శుభలేఖలే — అ: ॥ ఓ ప్రియురాలా॥
చ/ఆ: నా కథలు రాసే... నీ కవితలెన్నో
కరిగించే నాలో... కనుపాపలే
అ: నీ నడుముదాచే... ఊయలలు ఎన్నో
పలికించే నాలో... ప్రియజోలలే — ఆ: ॥ ఓ చెలికాడా॥

రచన:వేటూరి — **2** — గానం: రమణగోగుల

యాహు... బ్రీతింగ్ ఫర్ యు... యాహు... హే హే హేయా...
వెయిటింగ్ ఫర్... ఐయామ్ వెయిటింగ్ ఫర్‌యు..
ఐయామ్ సో హేపి రైట్ నెక్ట్స్ టు మి
ప/అ: కృష్ణవేణి తీరంలో సంధ్యా సమయంలో
కనుల ఒకతార మెరిసె
కృష్ణవేణి గానంలో యమునా తీరంలో
మెరిసిన తార నేడు రాధలాగ దిగివచ్చే
తుంగభద్ర తీరంలో హంపి క్షేత్రంలో శిలలే చిగురించి కదిలే
నీవులేని రాత్రుల్లో నిద్రపోని నేత్రములో కలలే మిగిలే
ప/అ: అందాలలో... ఎన్ని అందాలో... అందాయిలే... నాకు ఒక్క చూపుకే
ఆ చూపులో... ఎన్ని గ్రంథాలో... చదివానులే... లేత కన్నెమనసునే
ఆ నడకలో... ఎన్ని నాట్యాలో... చూసానులే... నా సుందరాంగిలో
అమ్మాయిలో... ఎన్ని శిల్పాలో
టి.వి. యమ్.టి.వి... యం.టి.వి. చూస్తే చాలునంట



ఉన్నమాట చెపుత... చెపుతూ...
చెపితే... కిల కిల నవ్వాలంట
ఎక్కడున్నాడంటే... ఆ చక్కనైనవాడు
నీ పక్కనున్నవాడే... వలచిన బుల్లోడు
ఒడుపే చేసుకో... ఒడిలో దాచుకో
వలపే దోచుకో... వయ్యారి వగలతో
మలుపే దాటిపో... తలుపే తీసుకో
చెలిపై వాలిపో... సింగారి సెగలతో
సోది నేను చెపుత... నీ కన్నె సొగసు మీద
ఉన్నమాట చెబుతా చెబుతా తికమక పడమాక
చ: గుట్టుతీసి గట్టుమీద పెడతా... చిట్టిపాప సిగ్గు పడేలా
చెట్టుమీది పిట్టకథలు చెపుత... చక్కనమ్మ చిక్కుపడేలా
వస్తామళ్లీ పెళ్లినాటికి... మూడుముళ్ల ముద్దులాటకి
పెడతా... లగ్గం... శోభనానికి
పదరా... భళాభళి... కథాకళి... కౌగిట్లో... ॥సోది॥
చ: బొడ్డుకోసి బిడ్డపేరు పెడతా... ఒడ్డుకొచ్చి చేపపడేలా
బొట్టుపెట్టి తొట్టిలోన పెడతా... లాలిపాట పట్టుపడేలా
వస్తామళ్లీ బారసాలకి... ఏమిస్తావో ఎరుకసానికి
చూస్తా నాడి కోడెగాడికి...
ముదిరే... ముఖాముఖి... సఖాసఖి... సందిట్లో... ॥సోది॥

రచన: వేటూరి — **6** — గానం: రమణగోగుల

ప: ప్రేమే గానమాయె పెదవేమో మౌనమాయె
కలలేమో కన్నులాయె శిలపైన వెన్నెలాయె
వడగాలి వేణువూదే వయసంతా వెచ్చనాయె వడగాలి వేణువూదే వలపంతా
వేసవాయెనులే
చ: నీవులేని చీకటిలోన క్షణమైనా ఉండలేక
రేపులేని రాతిరిలోన కలనైనా నిదరపోక
నేనున్నా నీడలాగ ఇకనైనా తోడుకావా ॥ప్రేమే॥
చ: పూతలోనే రాలిపోయె పువ్వులేనా ప్రేమలంటే
మూడు నెలలే పాడిపోయె కోయిలేనా హృదయమంటే
మెరుపేనా మేఘమేనా మరుపేనా మాయమేనా ॥ప్రేమే॥



రచన: మల్లెమాల — **1** — గానం: శంకర మహదేవన్, కోరస్

ప: నింగికి రంగుల హరివిల్లందం!
నేలకు తొలకరి చిరుజిల్లందం! ॥నింగికి॥
నీరెండకు నిగనిగలద్దే నీ అందం (2)
అపుడే విరిసిన అరవిందం!
ప్రేమ దాని మకరందం!
ఆ మకరందం నిండిన హృదయం
సత్యమ్ - శివమ్ - సుందరమ్ (4) ॥నింగికి॥
చ: కనుమూసిన నా ఆశలను కదిలించిన శ్వాసవు నీవు! (2)
శ్రమజీవన పరమార్థాన్నీ
యెరిగించిన దేవత నీవు!
ఆకాశం నుండి నీవు - నా కోసం దిగి వచ్చావు!
యేనాడూ పొందని ప్రేమా- యెదనిండా నింపేశావు!
ఇంతనురాగం పంచిన నీకు
నేనిపుడేమి ఇవ్వగలను?
తనువున ప్రాణం ఉండేదాకా
నిన్నెలా నే మరువగలను?! ॥నింగికి॥
చ: ఒక్కసారి నీ చెయ్యి తగిలితే వెదురు వేణువౌతుంది! (2)
ఓరగంట నువు చూపు విసిరితే
మోడు పల్లవిస్తుంది!
నీ పాద ముద్రల్లోన - నా దారి కనిపిస్తోంది!
నా గుండె చప్పుళ్లందు - నీ మాటే వినిపిస్తోంది!
అడుగడుగున నిన్నారాధిస్తూ
వడివడిగా నే నడుగేస్తాను!
అనుకున్నది నే సాధిస్తాను!
అమ్మ కలలను పండిస్తాను ॥నింగికి॥

రచన: బాపు లైదల — **2** — గానం: ఘంటాడి కృష్ణ, మోహన్, బాపు, ఫెబి, కోరస్

ప/కో: సిలుకు చీర చిన్నది - సెగలు రేపుతున్నది
కందిరీగ నడుముది - కవ్విస్తూ వున్నది
అ: ఏరా బాగా పాడుతున్నావుగా నువ్వే కంటిన్యూ చేసేయ్ ॥సిలుకు॥
చమక్ చమక్ పోరి - నాజూకుగుంది ప్యారి!
దీని సోకు సోలాపూరురో - నడుమే నైజామురో ॥సిలుకు॥
ప/కో: కోటి సెంటర్లో నువ్వు -
కోకు తాగుతుంటెనే
నీ... చెక్కిళ్లను చూసి మాకు - ఎక్కిళ్లే పుట్టెనే
ఆ: చుక్కాలాంటి నన్ను -
చూశాకే పిల్లడా
పండూ ముసలాడైన - మురిసిపోయి గిల్లడా?
అ: నిమ్మా పండూలాంటి -



ఆ: ఇంతకాలమాశలణుచుకున్నా - ఇంక - ఆగలేక హత్తుకున్నా!
అ: సదా నువ్వు నా వెంటుంటే - సుఖాలన్ని మనవెంటే!
ఆ: అదే మాట నేనంటున్నా - సదా వెంట ఉంటున్నా!
అ: ఈడు కోడై కూస్తుంది నేడు!
ఆ: తోడు నీడ నువ్వే అంటుంది చూడు!
అ: ఇది... మరపురాని... మరువలేని తరుణం!
గమపా... పసనీ... పమగా... ॥మనసు॥
చ/ఆ: నింగి తొంగి తొంగి చూస్తోంది - నేల పక్కపరిచి కూర్చుంది!
ఆ: జొగుచేస్తే పానుపలుగుతుంది - పైనచేర్తే హాయి పంచుతుంది
అ: సరాగాల ఈ సాయంత్రం - వరాలెన్నో యిచ్చింది!
ఆ: బలే మంచి ఈ అవకాశం - మరోసారి రాదంది!
అ: ప్రేమ తేనై కురిసింది నేడు!
ఆ: తీపి తగ్గకుండ ఉండేట్టు చూడు!
అ: ఇది... మరపురాని -
మరువలేని ప్రణయం!
లలనా... చెలియా... వినవా... ॥మనసు॥

రచన: మల్లెమాల — **7** — గానం: మనో

అందమంటే మేని సోయగం కాదని
ఆత్మసౌందర్యమే అసలైన అందమని
చాటిచెప్పిన నీకు సౌభాగ్యమస్తు
అఖిల మానవులకు
అభ్యుదయమస్తు... అభ్యుదయమస్తు

రచన: మల్లెమాల — **8** — గానం: హరిహరన్, ఉష, కోరస్

ప/ఆ: ఇన్నాళ్లూ నువ్వెవరో అనుకున్నా
ఇప్పుడు నువ్వే నేనంటున్నా (2)
ప్రియతమా ప్రియతమా నీ ప్రేమలో
నీ తీపి విలువను తెలుసుకున్నా
ఆ తలపుతోనే బ్రతుకుతున్నా ॥ఇన్నాళ్లూ॥
కో: చూడచక్కని చిన్నారి కావాలంటుంది... జోడి కావాలంటుంది...
చ/ఆ: తొలిసారిగ నులివెచ్చని ఊహల
అలజడి నాలో రేపావు! (2)
కలకాలం గుర్తుండే మనసును కానుకగా నాకిచ్చావు
ఇంక నిన్ను క్షణమైనా... నే మరువలేను కలనైనా (2)
ప్రియతమా నీ ప్రేమలో
నీ తీపి విలువను తెలుసుకున్నా...ఆ తలపుతోనే బతుకుతున్నా అ: ॥ఇన్నాళ్లూ॥
చ/ఆ: రెక్కలు మొలవని నా కోరికలను చుక్కల పక్కన నిలిపావు (2)
ఎన్నోనాళ్ళుగ మూగపోయిన మనసుకు మాటలు నేర్పావు
ఈ ఆనందం నేనూ జారవిడుచుకోలేను (2)
ప్రియతమా నీ పిలుపులో నీ ప్రేమ విలువను తెలుసుకున్నా
ఆ... తలపుతోనే బ్రతుకుతున్నా ఇ: ॥ఇన్నాళ్లూ॥

తెరలో... మెరిసే... చెమకులట ॥సీతమ్మ॥

కో: కొత్త కోడలమ్మ గోరంత దీపం వోయమ్మ
కోరుకున్న వాడు కొండంత వెలుగేనమ్మ (2)

**రచన: రమణగోగుల 4 గానం: రమణగోగుల**

ఏటైం ఇజ్ కమ్ ఫర్ అజ్ టుగో హోయేయే.. ఎవరిబడీసే హోయేయే...
హోయేయేయే...యూ...యూ అండ్ యూ... హోయేయే. గూమ్ మచాంగేరీ
రాక్‌దషో... హో యేయే... హో యే యే...
ప: యాద్‌కరో ఉస్‌పర్‌కో
ఆ: దేఖా జబ్ అపనా దిల్‌బర్‌కో
లవ్ నిన్ను ఏం చేసిందో... ఈ క్యాంపస్‌లో
యాద్‌కరో... యాద్‌కరో
వయ్యారి నడకలు చూసే లక్కుందా
లేడీస్ హాస్టల్ ముందు బీటుకు హక్కుందా
క్యాంపస్ లైఫ్ ముగిసిందరో... గుడ్‌బాయెరో
యాద్‌కరో... యాద్‌కరో...
చ: చోడో మత్ ఇస్ యాదోంకో
రకలో అపనా దిల్‌మే యాదో
యహీతో హై జిందగి
కాలేజి లైఫ్ అనే చాప్టరింకా మూసేసామ్
ముందుంది మన జీవితం
సో డాన్స్ బైట్ రాక్ అండ్ రోల్
మూగబారి ఉంది బీట్... ఎవ్రిబడీ సింగ్ లాంగ్
చ: క్యాంటిన్ బాతాఖాని
జంక్షన్‌లో ప్రేమ్ కహాని
అన్నిటికి ఫుల్‌స్టాపింకా
గుడ్‌బై మరియా... రమ్యా... శ్రీదేవి... వైదేహి...
ఫ్రెండ్‌షిప్‌కి జోహారులు
సో డాన్స్ బైట్ రాక్ అండ్ రోల్
మూగబారి జిందగీ... ఎవ్రిబడి సింగ్ లాంగ్

**రచన: వేటూరి 5 గానం: ప్రియ**

ఇది బెనారసి అన్నపూర్ణ... నేను బెజవాడలో కనకదుర్గనౌతా...
ఇది పదేపదే పొడుతున్న యిక పడే ముడి పడతదంట ఒంట
ప: సోది నేను చెపుత... నీ కన్నె సొగసు మీద

అ: వంశధార తీరంలో వనితా కుసుమంలో విరిసే విరివేనా మనసా
వాలుచూపు గానంలో వలచిన మౌనంలో
కలిసిన భామనేడు ప్రేమలాగ ఎదురొచ్చే
సీ మై లవ్.. హెయా...
నెక్స్ట్ హర్ యువర్ డ్రీమ్స్ హేవ్ విత్ మి సీ మై లవ్.. సీ మై లవ్...
ఐ యామ్ సో హేపి రైట్ నెక్స్ట్ టు మి
ఆతారకే... నేను ఆకాశం
సంధ్యవేళ పుట్టాను ఆమే కోసమె
ఆ భావనే... లేత శృంగారం
ఎంకిపాట... అయ్యాను ఆమె కోసమె
ఆ నవ్వుల మల్లెజాజుల్లో
వేగానులే... విరహజీవినై
అమ్మాయితో... ఏమి చెప్పాలో
డోన్ట్ నో ఐ డోన్ట్ నో వాట్ టు టెల్ హర్ ॥కృష్ణ వేణి

**రచన: వేటూరి 3 గానం: రమణగోగుల, ప్రియ**

షఆ: దంచేటి అమ్మలక్కల్లో... ఆ చెమ్మచెక్కల్లో... పడుచుల పకపకలు...
నలిగేటి పసుపుకొమ్ముల్లో ఆ నడుము ఒంపుల్లో సొగసరి కదలికలు
కో: ధిన ధిన ధింధిన... డుం డుం డుం డుమ్మా...
ఆ: సీతమ్మకోక చిలుకలు... జతపడే తలుకులు
తొలి వలపు కులుకులు
ముద్దొచ్చే... మూగ పిలుపులు...
ఉరమని మెలుపులు... ఉడుకుడుకు చినుకులు
కో: ధిన ధిన ధింధిన... డుం డుం డుం డుమ్మా... డోలూ సన్నాయ్
మాంగల్యం తంతూ... నేనా అన్నాయ్ (2)
చ: పలుకే బంగారమా...
యీ వేళ పడుచు శృంగారమా
అలకే సింగారమా... అందాలే పలిచే పరువాలమ్మా
వయసు... వయసు... జతకుదిరే
ఒకటై... ఒదిగే... శృతిముదిరే ॥సీతమ్మ॥
చ: పసుపు కుంకాలుగా... ఈ జంట కలిసిపోవాలంట
చిలకా గోరింకలే... క్రీగంట చూసి అడగాలంట
పొగలో... సెగలో... చమటలట

మౌనమేలనోయి

మౌనమేలనోయి

3

ఆ: కన్నుల పంటగ జంటగసాగే - గువ్వలదే అదృష్టం
అ: నాకీ జన్మకు సుఖపడు యోగం - లేనేలేదిది సత్యం
ఆ: విధి బలీయం అన్న యదార్థం - ఇప్పుడర్థమైంది
అ: చీకటి వెలుగును మింగేస్తే - ఇక చేసేదేముంది ॥మధు॥

**రచన: మల్లెమాల 4 గానం: మనో**

అమర ప్రేమికుల జీవనగాథకు అద్భుత సంకేతం
విశ్వమంతటా వినుతి గడించిన వెన్నెల జలపాతం (2)
తాజ్‌మహల్ సందర్శన భాగ్యము అరుదుగ దొరికే వరము
తాజ్‌మహల్ సౌందర్య వర్ణనకు
తపించి తీరు ప్రతి కలము (2)

**రచన: మల్లెమాల 5 గానం: మాల్గాడిశుభ, సంగీత, కోరస్**

ప: బోడి గుండుకీ - మేడిపండుకీ (2)
అంటుగట్టి - లింకుపెట్టి - జంట కలుపుతాం!
పిలకజుట్టుకీ - పోనీటెలుకీ (2)
నలుగుపెట్టి, డోలుకట్టి - తాళి కట్టుతాం!
ఓరచూపులూ - ఓల్డ్ ప్యాషను (2)
ఒళ్ళు ఒళ్ళు తగిలినాక లేదు రేషను ॥బోడి॥
చ: క్యాటువాకు నేర్పుతాము బామ్మగారికి!
పాప్‌సాంగ్ నేర్పుతాము బాలమురళికి! (2)
వాజ్‌పాయినైనా - లాలోకి లాగుతాం!
జార్జిబుష్‌తోనే - డ్యూయెట్లు పాడతాం!
ఉడుకునెత్తురోయ్ - ఉరకలేస్తుందోయ్!
కో: ఓల్డ్ మేబి గోల్డ్ - బట్ ఉయ్ డోంట్ కేర్ ॥బోడి॥
చ: టీనేజీ జారిపోతే - తిరిగిరాదురా! (2)
ఓల్డేజీ డ్రాపైతే - మజా లేదురా!
మాకు నచ్చితే ఒళ్ళోకే వచ్చి వాలుతాం!
మాకు నచ్చకుంటే - మీ షేపు మార్చి తీరుతాం!
కళ్ళ భాషలో - మాదేరా ఫస్ట్ మార్క్!
క్లాసు రూములో - మీదేర లాస్ట్‌మార్క్! ॥బోడి॥

**రచన: మల్లెమాల 6 గానం: టిప్పు, హరిణి**

షఆ: మనసులోని మాట నీకు చెపుతున్నా!
నిన్ను చూడకుండ ఉండలేకపోతున్నా!
అ: మనసులోని మాట నీకు చెపుతున్నా!
నువ్వులేక నేను లేనంటున్నా!
ఆ: మళ్ళీ తిరిగి చూడకుండ - మారు మాటలాడకుండ
సన్నజాజి తీగలా చుట్టేశా - ఉన్నవన్ని మూటగట్టి యిచ్చేశా!
అ: మూటలోనివన్ని నే దోచేశా!
గుండె గుళ్ళో దాచి తాళమేసేశా ॥మనసు॥
షఆ: ఏరి కోరి నిన్ను ఎంచుకున్నా - నీ మీద మోజు పెంచుకున్నా!

నిన్నూ చూసి
లాయిలప్పాలాగా లాగెనె మనసు
ఆ: అల్లాటప్పాదాన్ని కానుర నేను
కళ్ళతోనే నిన్ను - కట్టేస్తాను
అ: బలె బలె బంగారు ఒళ్ళు - చూస్తుంటె గుండె జల్లురో
అరె... ముద్దూ ముద్దూ గుమ్మరో - కంప్యూటర్ బొమ్మరో
మనసు లాగుతుందిరో - మత్తులో ముంచిందిరో ॥సిలుకు॥
చఆ: చింతపూల రైకలోని - సొగసులన్ని చూస్తుంటే
ఉన్నచోట నిలవకుండ - మనసు ఊగుతున్నదే
ఆ: ఊగుతున్న మనసుకింక - కళ్ళెమెయ్యబోకురో
మూతిమీద మీసముంటె - చాతనైంది చెయ్యరో
అ: అట్టా నువ్వు సిగ్గలిచ్చావంటే - అరుబైట మంచమేసినట్టే
ఆ: పెన్నా నీళ్ళు తాగి పెరిగానురో
పెదవినిండా చెరుకు రసముందిరో
అ: దీని... మాటవింటె నరనరాలు -జివ్వుజివ్వుమంటున్నాయిరో
కత్తిలాగుందిరో - కైపు రేపుతుందిరో
గరం గరం పోరిరో - గాలమేయమందిరో ॥సిలుకు॥

**రచన: మల్లెమాల 3 గానం: యస్.పి.బాలు, సుజాత**

షఆ: మధుమాసం యెద మీటింది మనసు గిటారై మోగింది (2)
రాగం తాళం కలవకముందే తీగ ముక్కలై పోయింది
తీపి చేదుగా మిగిలింది ॥మధు॥
చఆ: నా కన్నీటికి నోరున్నా...
నీ హృదయానికి కళ్ళున్నా...
నా బాధ నీకు తెలిసేది
మన ప్రేమ సఫలమయ్యేది
ఆ: ముందుచూపు నాకింతున్నా
నే తొందరపడి మాటిచ్చున్నా...
నీ బ్రతుకు మరోలా ఉండేది
ఈ బాధ నాకు తప్పేది
ఆ: అన్నీ ఉండి యేమీలేని అనాధనైపోయాను
అ: గమ్యం లేనీ బాటసారిలా - గమనం సాగిస్తున్నాను
ఆ: ఎక్కక ముందే ఆశల పల్లకి - ముక్కలైనది
అ: పకపక నవ్వుచు నా మనసే నన్ను ప్రశ్నిస్తున్నది ॥మధు॥
చఆ: నిన్న కన్న నా కలలన్నీ
నిలువున బూడిదై పోయాయి
ఆ: కాచిన వెన్నెలలన్నీ
కానలకే వలసెళ్ళాయి
ఆ: అలరించిన ఆ శుభఘడియే
ఆవేదన రగిలించింది
అ: కనుపించని చెయ్యేదో
కనుపాపను చిదిమేసింది

కిషోర్ రాఠి సమర్పించు
మనీషా ఫిల్మ్స్ పతాకంపై

# మౌనమేలనోయి..!

A SILENT LOVE STORY

శ్యామ్ ప్రసాద్ రమణగోగుల J.M. జోషి.. మహేష్ రాఠి

## తారాగణం

సచిన్, సంపద
చలపతిరావు, దేవన్, తనికెళ్ళ భరణి,
యం.యస్.నారాయణ, అలీ, శివాజీరాజా,
కిషోర్‌రాఠి, కవిత, అన్నపూర్ణ, శ్రీలక్ష్మి, ఢిల్లీ రాజేశ్వరి,
సరస్వతమ్మ
స్పెషల్ అప్పియరెన్స్ : అదితి గోవిత్రికర్, రాజ్యలక్ష్మి
కన్విల్కర్ రాయ్
బబ్లూ, బాషా, వేణు, ప్రమోద్, ఆయుష్మాన్,
మాస్టర్ నందన్, మాస్టర్ గంగాధర్, మాస్టర్
దుర్గాప్రసాద్, మాస్టర్ స్వప్నిల్,
బేబి నిత్య, బేబి వైష్ణవి, బేబి జ్యోత్స్న, బేబి ధృతి



కిషోర్‌రాఠి

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : సాయికృష్ణ |
| పాటలు | : వేటూరి సుందరరామ్మూర్తి |
| సంగీతం | : రమణ గోగుల |
| కెమెరా | : వాసు |
| ఎడిటింగ్ | : నాగిరెడ్డి |
| ఆర్ట్ | : కృష్ణ |
| కాస్ట్యూమ్స్ | : ప్రసాద్ |
| డాన్స్ | : బృంద, రెమొడిసౌజా, గీత (ముంబై) |
| స్టిల్స్ | : పాండ్యన్ |
| పి.ఆర్.ఓ. | : వినాయకరావు |
| కో- డైరెక్టర్ | : కోటపాటి శ్రీనివాసరావు |
| సమర్పణ | : కిషోర్ రాఠి |
| నిర్మాతలు | : జె.యం. జోషి, మహేష్ రాఠి |
| కథ, స్క్రీన్ ప్లే దర్శకత్వం | : శ్యాంప్రసాద్ |

పాఠక
పుస్తక
ప్రియులకోసం
సినీ సంగీత
విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో
'హాసం'
అందిస్తున్న
ప్రత్యేక
కానుక
ఇది.



శ్యాంప్రసాద్



వేటూరి సుందరరామ్మూర్తి



మహేష్‌రాఠి



రమణ గోగుల



శిల్పాలయా థియేటర్స్

# అందం

Nothing But Love

యం. యస్. రెడ్డి శ్రీనివాస రెడ్డి. యస్



యం.యస్. రెడ్డి

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ | : రాంప్రసాద్ |
| మాటలు | : యమ్.వి.యస్. హరనాథ్‌రావు |
| పాటలు | : మల్లెమాల, శైదలబాపు |
| సంగీతం | : ఘంటాడి కృష్ణ |
| కెమెరా | : దత్తు కె. |
| ఎడిటింగ్ | : కె.వి. కృష్ణారెడ్డి |
| ఆర్ట్ | : వి.వి. నారాయణరావు |
| కాస్ట్యూమ్స్ | : గాలిబ్ |
| మేకప్ | : నాని |
| ఫైట్స్ | : రాహుల్ |
| డాన్స్ | : స్వర్ణబాబు |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : కురిమిండ్ల రవి |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : సూరపనేని కిషోర్ |
| అసిస్టెంట్ డైరెక్టర్ | : వై. శ్రీనివాస్ |
| అసోసియేట్ డైరెక్టర్ | : కూతాని నారాయణ |
| కో-డైరెక్టర్ | : యస్. శ్రీనివాస్ గాంధీ |
| స్క్రీన్ ప్లే దర్శకత్వం | : శ్రీనివాస రెడ్డి .యస్ |



శ్రీనివాసరెడ్డి



ఘంటాడి కృష్ణ


పాఠక
పుస్తక
ప్రియులకోసం
సినీ సంగీత
విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో
'హాసం'
అందిస్తున్న
ప్రత్యేక
కానుక
ఇది.


## తారాగణం

రాహుల్, సహన, ప్రసన్న,
తనికెళ్ళభరణి, ఎ.వి.యస్., విజయచందర్,
అలీ, శివాజీరాజా, వేణుమాధవ్,
గుండుహనుమంతరావు, గౌతంరాజు,
రఘునాథరెడ్డి, ఖయ్యూమ్, గీత, సంగీత,
సన, రమ్యశ్రీ, లత, లావణ్య, సఖి, జ్యోతి,
వేణు, రంజిత్

అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | |
|---|---|
| చిత్రం | : మేరానామ్ జోకర్ (1970) |
| బ్యానర్ | : ఆర్.కే. |
| సంగీతం | : శంకర్-జైకిషన్ |
| గాయకుడు | : మన్నాదే |
| అభినయం | : రాజ్‌కపూర్, ఇతరులు |

# ఏ భాయ్ జరా దేఖ్‌కే చలో...



ఏ భాయ్ జరా దేఖ్ కే చలో !
ఆగే భీ నహీ పీఛేభీ, దాయేఁ భీ నహీఁ బాయేఁభీ
ఊపర్ హీ నహీ నీచే భీ
యే భాయ్... తూ జహాఁ ఆయాఁ హై
వో తేరా ఘర్ నహీఁ, గాఁవ్ నహీఁ, కూచా నహీఁ,
రస్తా నహీఁ, దునియా హై
ఔర్ దునియా హై ప్యారే సర్‌కస్
ఔర్ సర్‌కస్‌మేఁ బడే కోభీ ఛోటే కో భీ దుబ్‌లే కో భీ మోటే కో భీ
ఊపర్‌సే నీచే ఔర్ నీచే సే ఊపర్ కో ఆనా జానా పడ్‌తా హై
ఔర్ రింగ్‌మాస్టర్ కే కోడే పర్ నాచ్‌నా పడతా హై
కోడా జో భూఖ్ హై, కోడా జో పైసా హై, కోడా జో కిస్మత్ హై
డర్‌డర్ నాచ్ కే దిఖానా యహాఁ పడ్‌తా హై
బార్‌బార్ రోనా ఔర్ గానా యహాఁ పడ్‌తా హై
హీరోసే, హీరో సే జోకర్ బన్ జానా పడ్‌తా హై, యే భాయ్...
క్యా హై కరిశ్మా కైసా ఖిల్‌వాడ్ హై
జాన్‌వర్ ఆద్మీసే జ్యాదా వఫాదార్ హై
ఖాతా హై కోడా భీ, రహ్‌తా హై భూఖా భీ
ఫిర్ భీ వో మాలిక్ సే కర్‌తా నహీఁ వార్ హై
ఔర్ ఇన్‌సాన్ యే...
మాల్ జిస్‌కా ఖాతా హై
ప్యార్ జిస్‌సే పాతా హై
గీత్ జిస్‌కా గాతా హై
ఉస్‌కే హీ సీనే మేఁ భోంక్‌తా కటార్ హై
కహియే శ్రీమాన్, ఆప్‌కా క్యా విచార్ హై?, యే భాయ్...
గిర్‌నేసే డర్‌తా హై క్యోం, మర్‌నే సే డర్‌తా హై క్యోం
ఠోకర్ తూ జబ్ తక్ న ఖాయేగా
పాస్ కిసీ గమ్‌కో నా జబ్ తక్ బులాయేగా
జిందగీ హై చీజ్ క్యా నహీఁ జాన్ పాయేగా
రోతా హువా ఆయా హై రోతా చలా జాయేగా, యే భాయ్...
సరకస్, హాఁ బాబూ యే సర్‌కస్ హై
ఔర్ యే సర్‌కస్ హై శో తీన్ ఘంటే కా
పహ్‌లా ఘంటా బచ్‌పన్ హై, దూస్‌రా జవానీ హై
తీస్‌రా బుఢాపా హై
ఔర్ ఉస్‌కే బాద్ మాఁ నహీఁ, బాప్ నహీఁ, బేటా నహీఁ బేటీ నహీఁ
కుఛ్ భీ నహీఁ, కుఛ్ భీ నహీఁ రహ్‌తా హై
రహతా హై జో కుఛ్ భీ
ఖాలీ ఖాలీ కుర్సియాఁ హై
ఖాలీ ఖాలీ తంబూ హై, ఖాలీ ఖాలీ డేరా హై
బినా చిడియా కా బసేరా హై,
నా తేరా హై నా మేరా హై





మన్నాదేను మన్నాడేగా వ్యవహరించడం "హాసం"12వ సంచిక (16-31 మార్చి)లో జోకుగా రాసుకోవడానికి పనికివచ్చింది కానీ ఆయన ఇంటిపేరు "దే"యే. ఇంగ్లీషులో Dey వ్రాయడంతో ఇతర భాషల్లోకి వచ్చేసరికి "డే" అని రాసేస్తున్నారు. ఆయన పెదతండ్రి, అంధగాయకుడు "మన్‌కీ ఆంఖే ఖోల్ బాబా" పాట పాడిన కె.సి.దే కు అదే యోగం పట్టింది.



ఎన్నో హిందీ పాటలకు చక్కని సంగీతం సమకూర్చిన సచిన్‌దేవ్ బర్మన్‌కు హిందీ (దేవనాగరి) లిపి రాయడం రాదట. బెంగాలీలో రాసుకుని పాడించేవారట. మరి మన్నాదేకు కూడా అదే ప్రాబ్లెమేమో తెలియదు. హిందీ చిత్రసీమలో "మన్నాదే"కు బదులు "మన్నాడే" అనేస్తూంటే ఎందుకు అభ్యంతరపెట్టలేదో!?

ఈ మే 1న పుట్టిన రోజు కానుకగా మన్నాదేకు ఒక అరుదైన గౌరవం లభిస్తోంది. ఆయనపై ఒక బెంగాలీ డాక్యుమెంటరీ వెలువడుతోంది ఆ రోజున. ఒక గాయకుడిని పాత్రగా తీసుకుని కథ అల్లి డాక్యుమెంటరీ తీయడం అరుదే కదా! అభిజిత్ గుహ, సుదేష్ణా రాయ్ డైరక్టు చేస్తున్న ఈ 90 ని॥ల చిత్రం పేరు "అమి ( బెంగాలీలో నేను అని అర్థం) శ్రీశ్రీ భజోహరి మన్నా". 'ప్రథమ్ కదమ్ ఫూల్' అనే బెంగాలీ చిత్రంలో మన్నా పాడిన ఓ పాటపల్లవినే ఈ చిత్రానికి మకుటంగా ఎంచుకున్నారు. ఈ చిత్రానికి నాయకుడు ఒక మన్నాదే వీరాభిమాని. ఖరజ్ ముఖర్జీ నటిస్తున్న ఈ పాత్రకు తెరపై పేరు అనాది సేన్. అతనొక టీవీస్టార్. మన్నా బెంగాలీ పాటలను తలుచుకుంటూ గడుపుతూ ఉంటాడు. ఓ పెళ్ళి సంబంధం వచ్చినప్పుడు పెళ్ళికూతురి పేరు లలిత అనివుంటాడు. అది మన్నా పాడిన - పాట పల్లవిలో వస్తుంది కాబట్టి వెంటనే ఒప్పేసుకుంటాడు. పెళ్ళయ్యాక మొట్టమొదటిసారి అత్తవారింటికి వెళ్ళవలసిన ఫంక్షన్ ఎగ్గొట్టి మన్నా పాటకచ్చేరికి హాజరవుతాడు! ఇలాటి పాత్ర ద్వారా మన్నా పాడిన పాతపాటలను, ప్రత్యక్షంగా మన్నాదేను చూపించేలా కథని అల్లుకున్నారు దర్శకులు. మన్నా కెరియర్‌ని, కుటుంబాన్ని చూపించడంతో బాటు ఆయన తరచుగా సందర్శించే "అడ్డా" (బంకించంద్ చటర్జీ వీధిలోని కాఫీహౌస్)ను కూడా తెరకెక్కించారు.



మన్నాదే కొన్ని చిత్రాలకు సంగీతదర్శకత్వం వహించినా ఆయన ప్రధానంగా గాయకుడు, ప్రథమశ్రేణి గాయకుడు. ఏ రకమైన పాటనైనా- శాస్త్రీయం కానీయండి, హాస్యగీతం కానీయండి, భజనగీతం కానీయండి, ప్రేమగీతం కానీయండి- అవలీలగా, అలవోకగా పాడగల సమర్థుడు. ఆయన పుట్టినరోజు సందర్భంగా ఏ పాటను ప్రస్తావించాలా అని ఆలోచిస్తే ఎంచుకోవడం కష్టమే. అంచేత ఏదో ఒక మార్గాన్ని పట్టి ఎంపిక ముగించాలి.

ఇంతటి వైవిధ్యం, వోకల్‌రేంజ్ ఉన్న మన్నాదే బెంగాలీ హీరోలకు విస్తృతంగా పాడినా, హిందీహీరోలకు పాడిన పాటలు తక్కువే. హిందీహీరోలకు ముందులో రఫీ, తర్వాత కిశోర్ ఎక్కువగా పాడారు. మహేంద్రకపూర్‌ను కొందరు మాత్రమే ఉపయోగించుకున్నారు. కొంతమంది హీరోలకు మన్నాదే గొంతు ఎరువిచ్చినా సూట్ కాలేదని ఫీలయ్యేవారు శ్రోతలు, నిర్మాతలు! కానీ మన్నా వాయిస్ తనకు సూట్ అవుతుందని భావించినవాడు రాజ్‌కపూర్. ముఖేష్ తర్వాతి ఛాన్స్ మన్నాకే ఇచ్చాడు. అందువల్లనే 'శ్రీ 420'లో తక్కినవి ముఖేష్ పాడినా, "దిల్‌కా హాల్ సునే దిల్‌వాలా" మన్నాకు వచ్చింది. "చోరీచోరీ"లో ప్రఖ్యాతి చెందిన యుగళగీతాలు "ఆజా సనమ్", "యే రాత్ భీగిభీగి" రెండింటిలోనూ రాజ్‌కపూర్‌కి గళమిచ్చినది మన్నాయే. మన్నాకు పేరు తెచ్చిన శాస్త్రీయగీతం "లాగా చునరీమే దాగ్" (దిల్ హి తో హై)పాట కూడా రాజ్‌కపూర్ మీదే చిత్రీకరించబడింది.

రాజ్‌కపూర్ "మేరానామ్ జోకర్" (1970) తీస్తూ తక్కిన పాటలు ముఖేష్ (ఒకటి రఫీకి) వచ్చినా ఒక ప్రధానమైన గీతం "ఏ భాయ్ జరా దేఖ్ కే చలో" మన్నాకు ఇవ్వదలచుకున్నాడు. ఆ పాటలో ఒకసారి వినోదం, ఇంకోసారి హుషారు, మరోసారి విషాదం - అన్నీ వస్తాయి. అన్ని భావాలను సమానప్రతిభతో వెలువరించాడు మన్నాదే. సర్కస్ బఫూన్ల మధ్య సరదాగా మొదలయినట్లు మొదలయిన ఈ పాటలో ఎంతో వేదాంతం గుప్పించాడు రాజ్‌కపూర్.

పదాలు ఎంతో చిన్నవి. అర్థం మాత్రం గొప్పది. జీవితాన్ని అనేక కోణాలలో నుండి చెప్పడం జరిగింది. పల్లవి సింపుల్‌గా ప్రారంభమవుతుంది.

**చూసినడువు సోదరా**
**ముందుకే కాదు, వెనక్కి కూడా చూసుకో**
**కుడివైపే కాదు, ఎడమవైపు కూడా**
**పైకే కాదు, కిందకు కూడా**

మొదటిచరణంలో మనం వచ్చిన లోకం గురించి చెబుతాడు. నాది నాది అనుకోవడం పొరబాటని, లోకం అనే ఈ సర్కస్‌లో ఎవరైనా సరే, ఎన్నో మొగ్గలు వేసి, పలురకాల వేషాలు మార్చి, ఆకలికి అలమటించి, దెబ్బలు తిని బతకవలసివస్తుందని హెచ్చరిస్తాడు. కూచా అంటే సందు, కోడా అంటే కొరడా. భగవంతుణ్ని రింగ్‌మాస్టర్‌కి అన్వయిస్తాడు.

**నువ్వు వచ్చినచోటు వుందే**
**అది నీ యిల్లు కాదు, ఊరు కాదు, సందు కాదు, దారి కాదు**
**ఇది లోకం, లోకం అంటే ఓ నాయనా అదో సర్కస్**
**సర్కస్‌లో చిన్నవాడికైనా, సన్నవాడికైనా, లావు వాడికైనా**
**పైనుండి కిందకు, కిందనుండి పైకి వస్తూ పోతూనే ఉండాలి**
**అంతేకాదు రింగ్‌మాస్టర్ కొరడా చెప్పినట్టు ఆడాలి**
**కొరడా ఉందే అదే ఆకలి, అదే డబ్బు, అదే అదృష్టం**
**ఒళ్ళు దగ్గరపెట్టుకుని అది చెప్పినట్లల్లా ఆడి చూపించాలి**
**ఒకసారి పాడాలి, మరోసారి ఏడవాలి**
**హీరోనుండి జోకర్ దాకా ఏ వేషమైనా వేయాలి**

ఇక్కడ హీరో నుండి జోకర్ కావలసివస్తుంది అనడంలో రాజ్‌కపూర్ స్వోత్కర్ష కనిపిస్తుంది. రాజ్‌కపూర్‌ని మిమిక్రీ చేసేవాళ్ళు సాధారణంగా "జిస్ దేశ్‌మే..."లో బాగా చెయ్యెత్తి అమాయకుడిలా మాట్లాడడం ఇమిటేట్ చేయడంతో అతను అన్నీ అలాటి పాత్రలే వేసాడనుకునే ప్రమాదం ఉంది. "బర్‌సాత్", "అందాజ్", "ఆహ్" వంటి అనేక సినిమాలలో రాజ్ గంభీరమైన రొమాంటిక్ పాత్రలు వేసి మెప్పించాడు. "ఆవారా"లో కొన్ని సరదా సంఘటనలున్నా, ఎన్నో విషాద దృశ్యాలు, సీరియస్ సన్నివేశాలు ఉన్నాయి. చాప్లిన్ టైపు పాత్రలు వేసిన "శ్రీ 420", "అనాడీ" వంటి సినిమాలవల్ల





రాజ్‌కి అమాయకపు ముద్ర పడిపోయింది. చివరికి ఈ సినిమాలో సర్కస్ బఫూన్ పాత్ర వేయడం పై తనపై తానే వ్యాఖ్యానించుకున్నాడు.

కరిశ్మా అంటే తమాషా, చమత్కారం, ఖిల్‌వాడ్ అంటే ఆట. వఫా అంటే విశ్వాసం, వార్ అంటే దాడి, భోంక్‌నా అంటే పొడవడం. కటార్ అంటే చురకత్తి.



**భలే ఆట ఇది, భలే తమాషా ఇది**
**మనిషి కంటె జంతువునెక్కువగా నమ్మవచ్చు**
**దెబ్బలు తింటుంది, ఆకలితో మాడుతుంది**
**అయినా యజమానిపై దాడి చెయ్యదు మృగం**
**మరి మనిషి మాటంటారా...?**
**ఎవడి ఉప్పు తింటాడో, ఎవడి ప్రేమ పొందుతాడో**
**ఎవణ్ని స్తుతిస్తాడో, వాడి గుండెల్లోనే చురకత్తి పొడుస్తాడు**
**ఏం మహాశయా? మీరేమంటారు?**

జీవితంలో ఎగుడుదిగుడులు చూసిన రాజ్‌కపూర్ ఈ చరణంలో మనిషి ఎంతటి విశ్వాసఘాతకుడో చెప్పాడు. ఈ భవిష్యవాణి, వేరెవరికో కాదు, రాజ్‌కపూర్‌కే అనుభవంలోకి వచ్చింది. ఎన్నో ఆశలతో నిర్మించిన 'మేరానామ్ జోకర్' ఘోరంగా ఫ్లాప్ అయింది. అప్పటిదాకా పాదాభివందనాలు చేసిన సినీజనులు మొహం చాటేశారు. ఆ కసితో "బాబీ" తీసి రాజ్‌కపూర్ పూర్వస్థానం పొందడం వేరే కథ అనుకోండి. రెండోభాగంగా తీద్దామనీ, దానిలో భానుమతికి పాత్ర నిద్దామనీ అనుకున్నాడు రాజ్‌కపూర్. అదింకో కథ.



అసలు కథ కాస్తా తర్వాతి చరణంలో ఈ సర్కస్ లాంటి లోకం లోకి వచ్చి ఎలా నడుచుకోవాలో చెబుతున్నాడు.

**పడిపోవడమంటే బెదురెందుకు?**
**చావంటే భయం ఎందుకు?**
**దెబ్బలు తిననంత వరకు**
**దుఃఖాన్ని ఆహ్వానించనంతవరకు**
**జీవితమంటే అర్థమే తెలియదు నీకు**
**ఏడుస్తూ వచ్చావు ఏడుస్తూనే పోతావు**

ఈ చరణంలో కళాకారుడి జీవితం నుండి ఉదాహరణ తీసుకుని మానవజీవితానికి అన్వయించాడు. ఈ ఆట మూడు భాగాలు. బాల్యం, యవ్వనం, వృద్ధాప్యం. ఆ తర్వాత? మాతా నాస్తి, పితానాస్తి, ఖాళీఖాళీ డేరా, ఖాళీఖాళీ కుర్చీలు. మిగిలేది ఖాళీ పంజరమే. చిలక ఎగిరిపోతుంది.

**సర్కస్, అవును నాయనా ఇది**
**సరకస్సే, మూడు గంటల సర్కస్**
**మొదటి గంట బాల్యం, రెండోది యవ్వనం, మూడోది వృద్ధాప్యం**
**దాని తర్వాత, తల్లి లేదు, తండ్రి లేదు,**
**కొడుకు లేదు, కూతురు లేదు**
**ఏదీ లేదు, ఏదీ మిగలదు, మిగలినదేదైనా ఉంటే ఖాళీ ఖాళీ కుర్చీలు**
**ఖాళీ ఖాళీ డేరాలు, ఖాళీ ఖాళీ గుడారాలు,**
**పక్షిలేని ఈ గూడు - నీది కాదు, నాది కాదు.**



ఈ పాటకు శంకర్-జైకిషన్ సమకూర్చిన సంగీతం గురించి ప్రత్యేకంగా ముచ్చటించవలసిన వనిలేదు. రాజ్‌కపూర్ సినిమాలన్నిటికీ వారు అద్భుతమైన సంగీతాన్ని ఇచ్చారు. "సంగమ్" తర్వాత శంకర్-జైకిషన్ విడిపోయినా ఈ సినిమాకు మాత్రం ఆ ఇద్దరూ ఇచ్చినట్టు కనబడుతుంది. ట్యూన్‌లు ఎప్పుడో సమకూర్చుకున్నారని అంటారు. రాజ్‌కపూర్ పాత సినిమాల బాణీలు కూడా ధారాళంగా వినబబతాయి ఈ చిత్రంలో. ఇంత గొప్ప సంగీతాన్నిచ్చినా తన తర్వాతి చిత్రం "బాబీ"కు రాజ్‌కపూర్ లక్ష్మీకాంత్-ప్యారేలాల్‌లను ఎంచుకున్నాడు.

-కమ్యూనికేటర్ ఫీచర్స్

## కొంటె కొశ్చెన్లు - తుంటరి జవాబులు

వి.మంజు రాణి - హైదరాబాద్




ప్ర॥ పనిగట్టుకుని చమత్కారం చెయ్యటం అంటే...!?

జ॥ 'మా షాపులో సామాన్లు కొన్నవారికి ఉచితంగా హోమ్ డెలివరీ' అనే బోర్డు చూసి షాపులోకెళ్ళి "మా ఆవిడకు నెలలు నిండగానే కబురు పెడతాను.... సిజేరియన్ చేయాల్సి వస్తే ఎక్స్ట్రా అడగరు కదా!? అని అడగటం.

ప్ర॥ అదృష్టదేవత మర్యాదస్తురాలని దురదృష్టదేవతకు మర్యాద తెలియదని ఎలా చెప్పగలం?

జ॥ అదృష్టదేవత తలుపుతట్టి వస్తుంది. దురదృష్ట దేవత తలుపులు బద్దలు కొట్టి మరీ వస్తుంది కనుక ....!

ప్ర॥ ఎదుటివారి సొమ్ము తినరాదు అని అంటే...!?

జ॥ (డ్రింక్ రూపంలో) తాగొచ్చు అని అర్థం.

## చిలిపి లిపి



జాన +కి: జానకి

Raw Son: రాకుమారుడు

E ర why ADO: ఇరవైఏడు

- జె.ఎల్.జిలానీ, బనగానపల్లి



## ఈ రూటే వేరు



పల్లెటూర్లు: పల్లెలకు చేసే టూర్లు

-తరిగొప్పుల విఎల్లెన్ మూర్తి, హైదరాబాద్

పెళ్ళికొడుకు: పెళ్ళి అవుతుండగా పుట్టిన కొడుకు

-డి.చంద్రయ్య, నెల్లూరు

కురువీరులు: జుట్టును విపరీతంగా పెంచుకొనువారు

-కొమరగిరి పద్మావతమ్మ, కడప

## పేరు - రిపేరు



'దేశంలో దొంగలు పడ్డారు - పట్టుకోండి చూద్దాం'

-దాసరి చంద్రయ్య, దామానెల్లూరు.

'ప్రేయసిరావే - నీ తోడు కావాలి'

'ఓ చినదానా - నువ్వు నాకు నచ్చావ్ - ప్రేమతో - రా'

-ఎం.డి.ముస్తఖీమ్, కొల్లాపూర్.

## డబుల్ రోల్




పోలేరమ్మా... నిన్ను దాటి ఎవ్వరూ పోలేరమ్మా!
ఇవాళ అందరూ పొగిడేది ఆయన 'గురి' - 'గురి'ంచే!
'ఆ రంగు' అక్కడ ఆ 'అరంగు'ఆల చోటుకి సరిపోతుందిలే

-బి.శ్రీసత్య, హైదరాబాద్

## చిలిపి కవిత




మై డియర్ సుబ్బు
ఎంచక్కా కొందాం పియర్స్ సబ్బు
రెడీగా ఉంది బాత్రూంలో టబ్బు
కలిసి స్నానం చేయాలని
మనసు అవుతోంది తబ్బిబ్బు
కొంపదీసి నీకుగాని లేదు కదా
ఎయిడ్స్ జబ్బు!!

-దాసరి చంద్రయ్య, తిరుపతి

## పేరడీ పేరేడ్



అందనంత ఎత్తా మామిడికాయ
ఆ గోడ ఎక్కి కోద్దాం రా
ఆ గోడ ఎక్కి కొంచెం కాలెత్తేస్తే
కాయ మన సొంతం కాదా
చిందే బురదా
పొంగే సరదా
అయినా మనమెలాగో
కొయ్యాలి ॥అందనంత॥
చెట్టు నీడలో కాయకొట్టుకో
కుర్రవేడిలో క్యూకూ
కూతకూయకు
కాయలన్ని తెంచే వేగంలో
కాళ్ళు విరుగు కథలే ఎన్నో
గుప్పెడంత కులాసా గుండెల్లో
గుప్పుమన్న కంగారెంతో
తోటమాలి చూడకుండా
ఏటవాలు గోడనుండి
కాయ నువ్వు కోసుకుంటె
నోటికింక పండగంట ॥అందనంత॥
కొంటెదానిలా కాయకొట్టుకో
కొత్తకోకలో ఓహో మూటకట్టుకో
కోలకళ్ళ జిలేబి మొహంలో
దాచుకున్న భయాలెన్నో
కమ్ముకున్న కిలాడి కొమ్మల్లో
పుచ్చులున్న కాయలే ఎన్నో
లాగుతున్న గాలి వెంట
ఎగురుతున్న పైట తంట
ఊరుకుంటె దొరకవంట
చెట్టుమీద కాయలంట ॥అందనంత॥

(క్షణక్షణం సినిమాలోని
'అందనంత ఎత్తా తారా తీరం'
పాట ఆధారంగా)

-వి.శ్రీగౌరి సుబ్రహ్మణ్వేశ్వరి, హైదరాబాదు







విడుదల : సుప్రీమ్
వెల : రూ.39/-

ప్రముఖ ఛాయా గ్రాహకుడు యన్. గోపాలరెడ్డి సమర్పణలో నాగార్జున, గ్రేసీసింగ్ (లగాన్ హీరోయిన్), శ్రేయ కాంబినేషన్‌లో దశరథ్ దర్శకుడిగా డా॥కె.యల్. నారాయణ నిర్మించిన 'సంతోషం' సినిమా ఆడియో క్యాసెట్ విడుదలయింది. ఈ తరం క్రేజీ మ్యూజిక్ డైరెక్టర్ ఆర్.పి. పట్నాయక్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

రాజేష్, ఉష పాడిన 'నువ్వంటే నాకిష్టమని అన్నది నా ప్రతిశ్వాస' పాట క్యాసెట్‌కి 'గుడ్ బిగినింగ్' లా అనిపించేట్టుంది. సంగీత పరంగా చెప్పాలంటే 'మనసంతా నువ్వే'లోని 'చెప్పనా ప్రేమ చెలిమి చిరునామా' పాటకి ఈ పాట మరో చెల్లెల్లాంటిది.

ఆ పోలికలను గుర్తు చేస్తూ వేరే వ్యక్తిత్వంతో ఉన్న ఈ పాటకి - జనాదరణ పొందవలసిన పాటకుండే లక్షణాలన్నీ ఉన్నాయి. ఇక సాహిత్యపరంగా చూసుకుంటే లవ్‌సాంగ్స్‌ని రాయటంలో సీతారామశాస్త్రిలోని ఇంకుకి థింకుకి హ్యాట్సాఫ్ చెయ్యాలనిపిస్తుంది.

తిలంగ్‌రాగచ్ఛాయలలో శంకర్ మహదేవన్ పాడిన 'ధీం తనక్తిరి నక్తితోం' పాట సంగీత దర్శకుడిగా ఆర్పీకి ప్రత్యేకమైన పేరుని తీసుకువచ్చేపాట. క్యాచీగా ఉండే ఈ పాట స్టేజీషోలకు, నలుగురు కలిసే చోట ప్రదర్శించటానికి చాలాబాగా ఉపయోగపడుతుంది. పూర్వ కవుల ప్రయోగాలు తెలిసిన వాడు కనుక రచయితగా కులశేఖర్ 'అక్షింతలు - లక్షింతలు' లాంటి పదాల క్రెడిట్‌ని పూర్తిగా తీసుకోడు గానీ... ఆరుద్ర తర్వాత ఇన్నాళ్ళకి మళ్ళీ ఆ కాయినింగ్‌ని వాడినందుకు అభినందనలను స్వీకరించక తప్పదు.

"దేవుడే దిగి వచ్చినా స్వర్గమే నాకిచ్చినా' పాట హుషారైన పాట. ఉషతో పాటు ఈ పాటను పాడినది కె.కె. అయినా వినడానికి పట్నాయక్ పాడినట్టే ఉంది. బహుశా పట్నాయక్ పాడి వినిపించటం వలన కలిగిన ప్రభావం అయివుంటుందేమో! ఈ పాటలో ఫ్లూటు గతంలో పట్నాయక్ ట్యూన్స్‌లో వినిపించనంత డిఫరెంట్‌గా వినిపించింది. రెహమాన్ ఆర్కెస్ట్రాలో వాయించే నవీన్ అనే ఫ్లూటిస్టే ఈ పాటకు వాయించాడట. 'కోయిలా నేర్చుకో యిలా ఆమె నవ్వులో తేనె సంతకం / హాయిగా తీర్చుకో యిలా చల్లగాలిలో ఆమె పరిమళం/అణువంతే ఉంటుందమ్మా ప్రేమా అణచాలని అనుకున్నామా చేస్తుంది హంగామా' లాంటి ఎక్స్‌ప్రెషన్స్‌తో కులశేఖర్ సెపరేట్‌గా మార్కులు వేయించుకుంటాడు.

సిరివెన్నెల రాయగా ఉష పాడిన 'నే తొలిసారిగా కలగన్నదీ నిన్నేకదా' పాట అక్షరాలా ఆర్పీ మార్కు పాట. ఆర్పీ పట్నాయక్ స్టయిల్‌ని సునిశితంగా గమనిస్తే ఓపినయ్యర్ మెలోడీస్ ప్రభావం ఉందేమోనని ఈ సమీక్షకుని వ్యక్తిగత అభిప్రాయం. ఓపి నయ్యర్ మెలోడీస్‌లో కొన్నిటికి బీట్‌ని మినహాయించి పాడుకొని చూడండి. ఉదాహరణకి - ఆవో హుజూర్ తుమ్‌కో (కిస్మత్), మై ప్యార్ కా రాహీ హూ( (ఏక్ ముసాఫిర్ ఏక్ హసీనా)యే హై రేశ్మీ జుల్ఫోంకా అంధేరా న ఘబ్‌రాయియే (మేరే సనమ్) పాటల నడకని గుర్తుచేసుకుంటూ ఈ - 'నే తొలిసారిగా కలగన్నదీ నిన్నేకదా' పాటని సైడ్ బై సైడ్‌గా ఆలపించుకుంటూ మీ గళాన్ని పూర్తిగా మీ మనసు ఎలా చెబితే అలా నడిపించుకుంటూ పాండి. ఆ పాటల్లోంచి ఈ పాటలోకి - ఈ పాటలోంచి ఆ పాటలోకి ఎంత సులువుగా ప్రయాణించవచ్చో అనుభవంలోకి వస్తుంది. ఒకవేళ అదే గనుక నిజమైతే సంగీత ప్రియులందరూ పట్నాయక్‌కి ఋణపడి ఉండక తప్పదు. ఎందుకంటే నయ్యర్ మెలోడీస్‌ని మరో ఫార్మేట్‌లో అందించేవారు లేరు కనుక. ఆ రోజుల్లో ఉషాఖన్నా మధ్యలో అనూమల్లిక్ కొంత ప్రయత్నించినా అది ఇంత ప్రస్ఫుటంగా లేదు. ఈ అభిప్రాయంతో పట్నాయక్ గనుక ఏకీభవిస్తే 'ఓపీ వెర్సెస్ ఆర్పీ' మీద పరిశోధనకు కావలసిన సమాచారాన్ని పోగు చేసుకోవటానికి ఈ పాట నాందిగా ఉపయోగపడుతుందనే చెప్పాలి.

విశ్వ రాయగా మనో, విశ్వ, భార్గవి పాడిన 'మెహబూబా మెహబూబా లవ్ ప్రిన్సే మనమబ్బా' పాట పూర్తిగా యూత్‌ఫుల్ సాంగ్. పాట మధ్యలో 'ప్రేమికుడు' సినిమాలోని 'చిక్‌బుక్ చిక్‌బుక్ రైలే' పాటలోని 'మీకు ఏమి కావాలో మాకు అర్థం కాలేదే / పూల బాణాలేశామే పిచ్చివాళ్ళమై పోయామే' అన్న లైన్లు గుర్తొస్తే - ఈ 'మెహబూబా' పాటని ప్రభుదేవా మీద చిత్రీకరించారు కనుక సరదాకి అలా గుర్తొచ్చేట్టు చేసేరనుకుంటే తప్పులేదు.

ఈ సినిమాకి సంబంధించి ఆడియో పరంగా మరో ప్రయోగం ఉంది. ఒకే ట్యూన్‌కి ఇంగ్లీషులో 'సో మచ్ టు సే' అంటూ చంద్ర సిద్ధార్థ చేత 'ఏమైనదో ఏమో నాలో' అంటూ కులశేఖర్ చేత రాయించారు. ట్యూన్‌లో మెలోడీ ఉంది కనుక ఈ రెండు స్వరఖండికల్ని కలిపి ఓ చిన్ని పాటగా పాడుకోవచ్చు. రెండు స్వరఖండికలని రాజేష్ పాడేరు. అయితే తెలుగు వెర్షన్ ఆర్.పి. పట్నాయక్ పాడినట్టుగా ఇన్ లే కవర్ పై అచ్చు తప్పు దొర్లింది.

కులశేఖర్ రాయగా కె.కె., ఉష పాడిన 'డిరి డిరి డిరి డీ వారెవా' పాట కూడా పైన పేర్కొన్న 'మెహబూబా పాటలాగా ఫుల్‌గా యూత్‌ఫుల్ సాంగే...! టోటల్‌గా ఇదొక సక్సెస్‌ఫుల్ ఆడియో!

# రాజా ఆడియో రివ్యూ

విడుదల : హెచ్.ఎం.వి
వెల : 40/-




1954లో తమిళం నుంచి వచ్చిన మనోహర, 1959లో హిందీ నుంచి వచ్చిన జింబో - ఈ రెండు డబ్బింగ్ చిత్రాలలోని పాటలను ఒక ఆడియో క్యాసెట్‌గా హెచ్.ఎం.వి.వారు విడుదల చేశారు. సినీ సంగీతప్రియులకు ఇది నిజంగా ఓ వీనులవిందైన అవకాశం.

జింబోకి పాటల రచన శ్రీశ్రీ, సంగీతం హిందీలో చిత్రగుప్త కాగా అనువాద బాధ్యతలను విజయ్‌భాస్కర్ నిర్వర్తించారు. నా ఆట నా పాట, అవును నిజం, సోగ్గాడమ్మా అందాలయ్యా, ఈ కథ ఇది కల కాదు, రేరాణియే ముస్తాబై, పాటలు జింబోలో ఉన్నాయి. వీటిని జమునారాణి, సుశీల, పిఠాపురం నాగేశ్వరరావు, నాగేంద్ర పాడేరు. ఈ పాటలను వింటుంటే మనసు ఆ రోజుల్లోకి వెళ్ళిపోతుంది. ముఖ్యంగా 'అవును నిజం ప్రణయ రథం సాగెను నేడే కోరిన కోరిక పారటలాడే' పాటలోనూ 'ఈ కథ ఇది కల కాదు' పాటలోనూ హిందీ భాషని తెలుగుకి అనువదించడంలోనూ లిప్‌మూమెంట్‌కి అనుగుణంగా తెలుగు పదాల్ని ఎంపిక చేసుకోవడంలోనూ వాటిని రాగ తాళ భావాలకు అనుగుణంగా పొందుపరచడంలోనూ శ్రీశ్రీ చేసిన విన్యాసాల గురించి చెప్పాలంటే అది ఒక ప్రత్యేక వ్యాసమే అవుతుంది. ఈ సినిమా ఆడియోను ఇప్పటితరానికి అందించటం హెచ్.ఎం.వి.వారు చేసిన మంచిపనులలో ఒకటి.

ఇక మనోహర - ఈ చిత్రానికి శ్రీశ్రీ, ఆత్రేయ, బలిజేపల్లి లక్ష్మీకాంత కవి పాటలను రాయగా యస్.వి.వెంకటరమణ-రామనాథన్ సంగీతాన్ని అందించారు. జిక్కి, ఎ.మోతి, ఏ.ఎం.రాజా, జయలక్ష్మి, పిఠాపురం నాగేశ్వరరావు, సుబ్రహ్మణ్యన్, మాధవపెద్ది సత్యం ఇందులోని పాటలను, పద్యాలను పాడారు.

ఆ రోజుల్లో సంగీతం, ఆర్కెస్ట్రయిజేషన్-ముఖ్యంగా ఏయే వాద్యాలు ఉపయోగించేవారు, సెమీక్లాసిక్‌గా ఉండేలా ట్యూన్‌లను ఎలా రూపొందించేవారు-వీటన్నిటినీ తెలుసుకోవాలనుకుంటే, ఈ 'మనోహర' క్యాసెట్‌ని మామూలుగా వినడం కాదు, అధ్యయనం చేసి తీరాలి.

నిజానికి ఈ జింబో, మనోహర చిత్రాలలోని సంగీత సాహిత్య గాన విశేషాల గురించి క్లుప్తంగా సమీక్షించటం చాలా కష్టం. విపులంగా చర్చించటానికి తగిన సమయం, సందర్భం, స్థలం దొరికేవరకూ నిరీక్షించటం అంతకన్నా కష్టం. అందుకే ఈ రివ్యూ కూడా అసంతృప్తిగా, అసంపూర్ణంగా ఉన్నట్టు లెక్క.

(ఇంకా 52వ పేజీలో)



## మే 7 కన్నాంబ వర్ధంతి సందర్భంగా

# సాటిలేని నటగాయని కన్నాంబ

**ఎక్కువ మంది ప్రతిభావంతులు సజీవంగా ఉన్నప్పుడు తక్కువ మందికి తెలియడం, నిర్జీవులైన తర్వాత ఎక్కువ మందికి తెలియడం జరుగుతూ ఉంటుంది. కానీ, కన్నాంబ విషయంలో మాత్రం ఇది వర్తించదు. జీవించి ఉండగానే ప్రఖ్యాతి చెందిందామె. అయితే కీర్తికీ, ప్రతిభకూ ఎంత వరకు సంబంధం ఉంటుందీ? అనేది కూడా ఆలోచించాల్సిన విషయమే. ప్రతిభ లేని వాళ్లు కూడా కీర్తితో ప్రకాశించిన సందర్భాలున్నాయి. కానీ, కన్నాంబ కీర్తి - ఆమెలో దాగివున్న నటనా ప్రతిభా వ్యుత్పత్తుల పరిణామమే.**

20-09-1913న జన్మించిన కన్నాంబ, బాల్యంలోనే సంగీతం, నృత్యం తదితర లలిత కళలను ఆరాధించడం మొదలు పెట్టింది. ఈమె బాల్యదశ అంతా ఏలూరులో గడిచింది. ఈమె కళాజీవితం కూడా అక్కడే మొగ్గతొడిగింది. కన్నాంబ తన 13 ఏళ్ల ప్రాయంలోనే ఆ రోజుల్లో గొప్ప నాటక సంస్థగా పేరు పొందిన 'నవకళా నాటక సంఘం'లో చేరి బాలపాత్రలెన్నో ధరించింది. అచిరకాలంలోనే ఈమె విభిన్నమైన పాత్రలెన్నో పోషించి, సమర్థవంతమైన నటిగా పేరు తెచ్చుకుంది. ఆ నాటక సంస్థలోనే కడారు బి.నాగభూషణం నాటక ప్రయోక్తగా ఉండేవాడు. అక్కడ ఏర్పడిన పరిచయం గాఢ స్నేహంగా పరిణమించి వారిని దంపతుల్ని చేసింది.

సతీసావిత్రి, అనసూయ, చంద్రమతి, ద్రౌపది లాంటి కరుణ రసాత్మక పాత్రలెన్నిటినో రంగస్థలంపై విజయవంతంగా పోషించి, గ్లిజరిన్ అవసరం లేని నటిగా పేరు తెచ్చుకున్న కన్నాంబ, తనకు లభించిన పేరు ప్రఖ్యాతులతో "శ్రీ రాజరాజేశ్వరి నాట్యమండలి" స్థాపించి ఆంధ్రదేశంలోని అన్ని పట్టణాల్లో ప్రదర్శనలు ఇచ్చింది. కన్నాంబ మహానటిగా ఎదగడంలో కడారు బి.నాగభూషణం కృషి ఎంతో ఉంది.

కన్నాంబ రంగస్థలం మీద డైలాగులు చెబుతుంటే ప్రేక్షకులు మంత్రముగ్ధులయ్యే వారట. రాగయుక్తంగా పద్యాలు చదివే వాళ్లంతా నటులే అనిపించుకుంటున్న ఆ రోజుల్లో కన్నాంబ రాగానికి భావాన్ని కూడా జోడించి, చక్కని భాషోచ్చారణతో పద్యాలూ, పాటలు పాడి ప్రేక్షకులకు చేరువయ్యారు. కన్నాంబకు మరో ప్లస్ పాయింటు. ఆమె రూపం. చారడేసి



'సౌదామిని'లో సి.ఎస్.ఆర్. మొదలైన వారితో



'జగదేకవీరుని కథ'లో ఎన్.టి.ఆర్.తో

కళ్లు, చక్కని ముక్కు. ఖంగుమని కంచులా మ్రోగే గొంతు. పై పెచ్చు మనిషి మంచి పొడగిరి. కన్నాంబ గురించి ప్రముఖ నటి టి.జి.కమలాదేవి చెబుతూ-

"ఆ రోజుల్లో కన్నాంబ గారి గొంతు కంచుకన్న మిన్నగా మ్రోగేది. నేను వారిని రంగస్థల నటిగా చూచే భాగ్యానికి నోచుకోకపోయినా వారి నటనను గురించి ఎంతో మంది చెప్పుకోగా విని వారిని చూడాలని తపించేదాన్ని. మన తెలుగు నాటక రంగంలో పద్యానికున్నటు వంటి ప్రాముఖ్యత తెలియంది కాదు. పద్యం పాడి రాగాలాపన చేసేటప్పుడు కన్నాంబ గారు పై షడ్జమంలో నిలిపి ఆ తర్వాత సంగతులు వేసి పాడితే ప్రేక్షకుల కరతాళ ధ్వనులతో హోలు మారుమ్రోగి పోవడమే గాకుండా వన్స్‌మోర్ అనేవారట" అని చెప్పారు టి.జి.కమలాదేవి. సినిమా పాటలకు అధిక ప్రజాదరణ లభించని రోజుల్లో గ్రాంఫోను పాటలే జన బాహుళ్యంలో ఉండేవి. కన్నాంబ పాడిన "కృష్ణంభజ రాధా" అనే రికార్డు నాటి ఆంధ్రదేశాన్ని ఉర్రూత లూగించి కన్నాంబ పేరును గగనవీధుల్లో నిలబెట్టింది.

ఈ విధంగా నటిగా, గాయనిగా, ప్రజా హృదయాల్లో కన్నాంబ గొప్ప స్థానం సంపాదించుకుంటున్న తరుణంలో సినిమా వచ్చి నాటకాన్ని సవాలు చేసింది. దాంతో నాటకాల వాళ్లంతా వెండితెర వైపు వాయువేగ, మనోవేగాలతో పరుగెత్తక తప్పింది కాదు. 'నలుగురితో పాటు నారాయణ' అంటూ సినిమా రంగంలోకి తాను కూడా ఓ మంచి రోజు చూసి అడుగు పెట్టింది కన్నాంబ.

కన్నాంబ మొట్టమొదటి సారిగా స్టార్ కంబైన్స్ సంస్థ నిర్మించిన 'హరిశ్చంద్ర' (1935)లో నటించింది. అద్దంకి శ్రీరామమూర్తి హరిశ్చంద్రుడుగా, ఈమె చంద్రమతిగా నటించిన ఈ చిత్రానికి రాజోపాధ్యాయ దర్శకత్వం వహించాడు. ఆ చిత్రం అఖండ విజయం సాధించింది. గ్లిసరిన్ లేకుండా తను కంట నీరు పెట్టడమే గాక, వేలాది ప్రేక్షకులను శోకావహులను చేయగల ప్రజ్ఞ ఆమె సొత్తు. కన్నాంబ రెండో చిత్రం సరస్వతీ టాకీసు వారి ''ద్రౌపదీ వస్త్రాపహరణం''. 1936లో 'ద్రౌపదీ వస్త్రాపహరణం', 'ద్రౌపదీ మాన సంరక్షణ' చిత్రాలు ఒకేసారి విడుదలయ్యాయి. బళ్ళారి రాఘవ వంటి మహానటుడు నటించినా, రెండో చిత్రం పరాజయం పొందింది. హెచ్.వి.బాబు దర్శకత్వంలో, బ్రహ్మాండమైన పద్యాలతో కృష్ణుడుగా సి.ఎస్.ఆర్., ద్రౌపదిగా కన్నాంబ నటించిన 'ద్రౌపదీ వస్త్రాపహరణం' విజయం సాధించింది. దీంతో కన్నాంబ పేరు దక్షిణాదిన మారుమ్రోగింది.


'జగదేకవీరునికథ'లో

## సహనటునితో తాగుడు మాన్పించిన కథ

1937లో సరస్వతీ టాకీసు వాళ్లే నిర్మించిన 'కనకతార' (హెచ్.వి.బాబు దర్శకుడు) ఘన విజయం సాధించింది. ఈ సినిమాలో మహారాణిగా కన్నాంబ, దుర్మార్గుడైన మరిది పాత్రలో దొమ్మేటి సూర్యనారాయణ బాగా నటించి అమృతగానం చేశారు. ఈ చిత్ర నిర్మాణ సమయంలో కన్నాంబ ఓ సంఘర్షణకు గురైంది. బాగా తాగి షూటింగ్‌కు వచ్చేవాడు దొమ్మేటి. "షూటింగ్ ప్రారంభమైంది. వితంతువైన రాణి పాత్రలో కన్నాంబ డైలాగ్ చెప్పింది. ఆ తర్వాత క్రూరుడైన మరిది పాత్రలో దొమ్మేటి డైలాగ్ చెప్పాలి. కానీ తప్పతాగి మత్తులో ఉన్న దొమ్మేటి అందంగా ఉన్న కన్నాంబను కన్నార్పకుండా చూసాడు. ఆమె సౌందర్యం అతని మతి పోగొట్టింది. అందులోనూ బాగా తాగున్నాడు. అమాంతం కన్నాంబను గట్టిగా పట్టుకున్నాడు. కన్నాంబ వెంటనే అతడి చెంప పగల గొట్టింది. షూటింగు కాన్సిలయ్యింది. ఆ మరుసటి రోజు దొమ్మేటి, కన్నాంబ ఇంటికొచ్చి "అక్కా, పాపం చేసాను. తాగుడు ఆ పని చేయించింది. నన్ను క్షమించవా?" అంటూ ఆమె కాళ్ళకు దండం పెట్టాడు. "ఇక ఎప్పుడూ తాగి షూటింగ్‌కు రానని ప్రమాణం చెయ్యి తమ్ముడూ" అందామె. "షూటింగ్‌కు రావడం కాదు. ఈ క్షణం నుంచీ అసలు తాగుడే మానేస్తాను. అక్కా, నీ పాదాల సాక్షి" అని చెప్పాడు. దొమ్మేటి ఆడిన మాట నిలబెట్టుకున్నాడు. జీవితంలో మళ్ళీ తాగలేదు.

రోహిణీ వారి 'గృహలక్ష్మి' (1938)లో కన్నాంబ, రామానుజాచారి నాయికా నాయకులు. హెచ్.ఎం.రెడ్డి నిర్మాతగా, బి.ఎన్.రెడ్డి సహ నిర్మాతగా వ్యవహరించిన ఈ చిత్రంలో కన్నాంబ నాయికగా నటిస్తూనే సినిమా నిర్మాణంలో వాటాదారుగా చేరింది. ఈ చిత్రం పుష్కలంగా డబ్బు చేసుకుంది. 'గృహలక్ష్మి'లో "దేవుడు లేడా? సత్యం జయించదూ?" అని పిచ్చిదానిలా, ఉన్మాదినిలా అరుస్తూ మద్రాసు వీధుల్లో ఆమె పరుగెత్తిన దృశ్యాన్ని ఆనాటి ప్రేక్షకులెవరూ మరచిపోలేరు.

భవానీ పిక్చర్సు వారి 'చండిక' (1941)లో కన్నాంబ, బళ్ళారి రాఘవ కలిసి నటించారు. ఈ చిత్రంలో "నేనే రాణీనైతే... ఏలనె ఈ ధర ఏకధాటిగా..." అని ఒక పాట పాడింది కన్నాంబ. చేతిలో కత్తిపట్టుకుని గుర్రం మీద ఠీవిగా కూర్చుని వీరావేశంతో పాడిన ఆ పాట గురించీ, ఆమె నటన గురించీ ప్రత్యేకంగా చెప్పుకునే వారారోజుల్లో. అందులోనే ఆమె పాడిన "ఏమో ఓ కోకిలా.... ఏమో పాడెదవు...." అనే పాట మధ్యలో కన్నాంబ నవ్విన నవ్వు అమోఘం. ఈ పాటలన్నీ 'అలనాటి అందాలు' పేరుతో నాగయ్య పాటలతో కలిపి వి.ఎ.కె. రంగారావు గారు హెచ్.ఎం.వి తరపున ఆడియో కాసెట్ సంకలనం చేశారు. "కన్నాంబ, నాగయ్యగార్ల పాటలు ఎంత గొప్పగా ఉన్నా, వాటిని ఆదరించే గొప్ప హృదయం నేటి శ్రోతలకేదీ? ఆ కాసెట్ సరిగ్గా ఖర్చు కాలేదని గ్రాం ఫోను కంపెనీ వారు వాపోతూనే ఉంటారు" అని వి.ఎ.కె.రంగారావు గారు అప్పుడప్పుడూ చమత్కరిస్తుంటారు.


తమిళచిత్రం
'అశోక్ కుమార్'లో
ఎమ్.కె.త్యాగరాజు భాగవతార్‌తో

ఈ 'చండిక' నిర్మాణ సమయంలోనే కన్నాంబ ప్రతిరోజూ చిరుతపులులకు ఆహారం స్వయంగా తినిపిస్తూ, వాటిని మచ్చిక చేసుకొనే వారు. స్త్రీలు క్రూర జంతువులతో నటించే సన్నివేశాలు గల తెలుగు సినిమాల్లో 'చండిక' మొదటిది. 1941లో వచ్చిన జయఫిలింస్ వారి 'భోజ కాళిదాసు'లో మరోసారి అద్దంకి శ్రీరామమూర్తి, కన్నాంబ కలిసి నటించారు.

కొంతడబ్బు, మరికొంత కీర్తి తెచ్చుకున్న తర్వాత తాముకూడా సొంతంగా సినిమాలు నిర్మించవచ్చునే ధైర్యం వచ్చిన తర్వాత కన్నాంబ, కె.బి.నాగ భూషణం సొంతంగా "శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీ" స్థాపించి 'తల్లిప్రేమ' (1941) సాంఘిక చిత్రం నిర్మించారు. ఈ చిత్రానికి కె.బి.నాగభూషణం తొలిసారిగా దర్శకత్వం వహించాడు. కన్నాంబ శ్రీ రాజరాజేశ్వరీ దేవి ఉపాసకురాలు. అందుకే ఆ దేవత పేరుతోనే ఫిలిం కంపెనీని స్థాపించారు. 1942లో "సతీసుమతి" నిర్మించారు. 'సుమతి' కూడా ఆర్థిక విజయం సాధించింది. ఆ తర్వాత అనారోగ్య కారణంగా ఆమె రెండేండ్లు సినిమాల్లో నటించలేదు. తిరిగి 1945లో 'మాయలోకం' (సారథీ పిక్చర్స్), 'మాయా మశ్చీంద్ర' (ఫేమస్ కంబైన్స్), 'పాదుకా పట్టాభిషేకం' (ఆమె సొంత చిత్రం)లలో నటించింది.

ప్రేక్షకుల చేత కంట తడి పెట్టించే పాత్రలెన్ని చేశారో, అదే ప్రేక్షకుల చేత శాపనార్థాలు పెట్టించుకునే పాత్రలూ అన్నీ చేశారు కన్నాంబ.

## నిప్పులు చెరిగే కళ్ళు

ప్రతిభా వారి 'ముగ్గురు మరాఠీలు' (1946)లో డా॥ గోవింద రాజుల సుబ్బారావు సరసన మహారాణిగా నటించి ప్రజల దూషణకు గురైంది. "ప్రజల దూషణ కూడా నా నటనా చాతుర్యానికి భూషణే" అని సమర్థించుకుంది కన్నాంబ. "ముగ్గురు మరాఠీలు చిత్రంలో నేను రఘూబాయి పాత్ర వేశాను. నేను పాలకోవా చేతిలో పట్టుకుని పాట పాడుతూ మా బావ (ఎ.ఎన్.ఆర్)కు ఇవ్వడానికి వెళ్తుంటాను - పాట పూర్తి కాగానే మహారాణి పాత్రలో కన్నాంబ గారొచ్చి ఆ పాలకోవా పళ్లెం నా చేతిలోంచి విసిరి కొడతారు. అప్పుడు ఆమె నా వంక చూసిన చూపులు ఇప్పుడు తల్చుకున్నా ఒళ్లు జలదరిస్తుంది. అంతగా నిప్పులు చెరిగే కళ్లు ఆమెవి. అంతటి నటన ఆమెది" అన్నారు టి.జి.కమలాదేవి.

శారదా వారి 'పల్నాటియుద్ధం' (1947)లో నాయకురాలు నాగమ్మగా

కన్నాంబ, బ్రహ్మనాయుడుగా డా॥ గోవిందరాజులు సుబ్బారావు పోటీ పడి నటించారు. కన్నాంబ ఈ చిత్రంలో ఎంత ప్రతిభావంతంగా నటించిందంటే, సాక్షాత్తూ మహా మంత్రిణి నాగమ్మే దిగివచ్చిందా అనిపించింది. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ఈ చిత్రాన్ని చూసి మెచ్చుకుని, తర్వాత ఇందిరాగాంధికి చూపించారు.

తొలి రోజుల్లోనే చిత్తూరు వి.నాగయ్య, తమిళం నేర్చుకోమని, తనలాగా ఆ భాషలోనూ రాణించొచ్చని కన్నాంబకు సలహా ఇచ్చారు. ఆమె పట్టుబట్టి అరవం నేర్చుకుని, అరవ సినిమాలలో నటించి ద్విభాషా నటిగా పేరు తెచ్చుకుంది.



తమిళ చిత్రం 'కణ్ణగి'లో

మహాకావ్యం 'శిలప్పదికారం' ఆధారంగా నిర్మించిన 'కణ్ణగి'లో కన్నాంబ అత్యద్భుతంగా నటించి తమిళ ప్రేక్షకుల నీరాజనాలందుకుంది. ఒకనాడు దొమ్మేటి పక్కన 'రంగూన్ రౌడీ'లో ప్రభావతి పాత్రకూ, అద్దంకి పక్కన 'హరిశ్చంద్ర'లో చంద్రమతి పాత్రకూ, తెలుగులో ఎంత గౌరవం లభించిందో, కణ్ణగి పాత్రకు తమిళంలో అంతే గౌరవం లభించింది కన్నాంబకు. ఆమె చెప్పే డైలాగులు కోసమే జనం ఆమె నటించిన చిత్రాలకు ఎగబడే వారు. ఈ విషయంలో ఒక్క శివాజీ గణేశన్ మాత్రమే ఆమెతో సరితూగుతాడు. 'మనోహర' (1955)చిత్రంలో వీరిద్దరూ పోటీ పడి నటించారు.

వాహినీ వారి 'రాజమకుటం' (1961) చిత్రాన్ని బి.ఎన్.రెడ్డి తెలుగు, తమిళ భాషల్లో నిర్మించారు. తెలుగు చిత్రం కన్నా తమిళ చిత్రం నిడివి ఎక్కువ. కారణం అద్భుతమైన కన్నాంబ డైలాగులు. 'రాజమకుటం' తెలుగులో కన్నా తమిళంలో కన్నాంబకు ఎక్కువగా డైలాగు లున్నాయి. కానీ దురదృష్టం బి.ఎన్.రెడ్డి తీయక తీయక తీసినా ఆ ఒక్క తమిళ చిత్రం పరాజయం పొందింది.

## 'అత్తపాత్రలు కన్నాంబను చూసే వేశాను' అనేది సూర్యకాంతం

1952లో విడుదలైన కన్నాంబ సొంత చిత్రం 'పేదరైతు' ఘన విజయం సాధించింది. ఆ తర్వాత 'లక్ష్మి' (1953) తీసారు. ఫ్లాపయ్యింది. తమిళంలో 'నవజీవనం' (1947) నిర్మించి ఘన విజయం సాధించిన కన్నాంబ దంపతులు అదే చిత్రాన్ని తిరిగి తెలుగులో 'ధర్మమే జయం' (1960)గా తీస్తే ఫ్లాపయ్యింది. తమ సంస్థే నిర్మించిన 'సతీసక్కుబాయి' (1954), 'శ్రీకృష్ణ తులాభారం' (1955) ఘన విజయం సాధించాయి. ముఖ్యంగా 'సక్కుబాయి' చిత్రంలో అత్తగా కన్నాంబ విజృంభించింది. అతి భయం కరంగా నటించింది. సినిమా చూస్తున్నంత సేపు ప్రేక్షకులు భయంతో ఊగిపోయేవారట. ''అసలు కన్నాంబ గారిని చూసే కదండీ నేను అత్త పాత్రలు వేయడం ప్రారంభించింది.'' అనే వారు సూర్యకాంతం. 'శ్రీ కృష్ణతులాభారం' చిత్రం ద్వారా తన అల్లుడు సి.ఎస్.రావును తొలిసారిగా దర్శకుడుగా పరిచయం చేసింది కన్నాంబ. కె.బి.నాగభూషణం కేవలం నిర్మాతగా వ్యవహరించారు.



'తోడికోడళ్ళు'లో సూర్యకాంతం, సావిత్రితో



లవకుశలో సంధ్య, ఎన్.టి.ఆర్‌తో

## ఆవిడ నటించకపోతే దర్శకత్వం వహించేవారు కాదాయన

"విధి ఎంత చిత్రమైందో గమనించండి. మా వారు దర్శకత్వం వహించిన ప్రతి చిత్రంలోనూ నేను నటించాల్సిందే. అయితే మా 'కృష్ణ తులాభారం'లో నాకు పరిపడే పాత్రలేదు గనుక నేను నటించలేదు. మరి ఆయన (నాగభూషణం) దర్శకత్వం వహించవచ్చు గదా! సి.ఎస్.రావుకు ఛాన్సిచ్చాం. అంటే విధాత భార్యాభర్తల బంధాన్ని ఎంత గాఢంగా ఏర్పరిచాడంటే, నేను నటించకపోతే, ఆయన నిర్మాతగా వ్యవహరించారే గానీ, దర్శకత్వం వహించలేదు" అనే వారు కన్నాంబ.

ఒకే సారి తెలుగు తమిళ భాషలలో చిత్రాలను నిర్మించే పద్ధతికి శ్రీకారం చుట్టిన సంస్థ కన్నాంబదే. అయితే తమిళ నిర్మాతల మోసంతో ఓ సారి మోసపోయారు కన్నాంబ దంపతులు. ఏ.వి.యం.వారు 'నాగుల చవితి' తెలుగు, కన్నడ భాషలలో ప్రారంభించారు. ఆ సమయంలోనే రాజరాజేశ్వరి సంస్థ 'నాగపంచమి' (1956) ప్రారంభించింది. ఒకే కథ కావడం వల్ల పోటీ లేకుండా మూడు రాష్ట్రాలలో విడుదల చేయాలని ఒప్పందం కుదుర్చుకున్నారు.

కానీ తమిళ చిత్రం 'నాగపంచమి' తమిళనాడులో విడుదల కాగానే, ఏ.వి.యం వారు 'నాగులచవితి' (1956) చిత్రాన్ని తమిళంలోకి డబ్ చేసి విడుదల చేశారు. దెబ్బతిన్న కన్నాంబ దంపతులు వెనువెంటనే తమ 'నాగపంచమి' తమిళ చిత్రాన్ని తెలుగులో డబ్ చేసి విడుదల చేశారు. ఏమైనా తమిళుల ముందు మోసపోయింది కన్నాంబ, నాగభూషణమే.

శ్రీరాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీకి అనుబంధ సంస్థగా 'వరలక్ష్మీ పిక్చర్స్' స్థాపించి సతీసావిత్రి (1957), దక్షయజ్ఞం (1962) మొ॥ చిత్రాలను నిర్మించింది కన్నాంబ. ఎన్.టి.రామారావును తొలిసారిగా శివుడి పాత్రలో పరిచయం చేసింది కన్నాంబ దంపతులే. (దక్షయజ్ఞం)

నెల జీతాలు ఇవ్వడంలో రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీకి గొప్ప పేరుండేది. ప్రతి నెలా ఒకటో తేదీ రాకముందే, ముందునెల చివరిరోజునే స్టాఫ్‌కి జీతాలు ఇచ్చేసేది ఆ కంపెనీ! తామెన్ని ఇబ్బందులెదుర్కొన్నా క్రమం తప్పకుండా, చివరకు తన నగలు తాకట్టు పెట్టి అయినా సరే జీతాలు ఇప్పించేది కన్నాంబ. "రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీలో పని చేస్తుంటే రాజా వారి కోటలో పని చేసినట్లే "నంటారు ప్రముఖ సంగీత దర్శకులు ఎ.ఏ.రాజ్.

సినిమా షూటింగ్ లో షాటు తీసే వరకూ కబుర్లు చెబుతున్నా రెడీ అనేసరి కల్లా మూడ్ లోకి వెళ్లి ఆ రసానుభూతిని పొందే వారామె. ఆమెకు తాను పెద్ద నటిననే భావం ఏ కోశానా ఉండేది కాదు. తను నటించిన ప్రతి

సన్నివేశాన్నీ, ఇంటికి వెళ్లిన తర్వాత ఓ సారి సింహావలోకనం చేసుకునేది కన్నాంబ.

కన్నాంబ అతి గొప్పగా నటించిన మరో చిత్రం ప్రభా వారి 'ఆడపెత్తనం' (1958). ఆ చిత్రంలో ఏ.ఎన్.ఆర్‌కు సవతి తల్లిగా నటించింది కన్నాంబ. ఆ చిత్రంలో తన కూతురు పేరిట రాయించిన వీలునామా మీద, అస్వస్థతగా ఉన్న భర్త చేత సంతకం చేయించుకునే సీను ఒకటుంది. ఆ సీను షూటింగులో బాగా నటించింది కన్నాంబ. కాని - ఆమె మర్నాడు షూటింగ్‌కు వచ్చినప్పుడు - "నేను నిన్న సీన్లో కొంచెం అతిగా నటించానని నా అనుమానం.



'ఆడపెత్తనం'లో
చదలవాడ కుటుంబరావుతో

నేను అతిగా చేస్తే గయ్యాళిగా కనిపిస్తాను. మంచం పట్టిన భర్తను కీలుబొమ్మను చేసి, సవతి కొడుకును కాదని - ఆస్తి నా కూతురి పేర రాయించుకున్న దాన్నవుతాను. పైగా ఆ సవతి కొడుకు ఎ.ఎన్.ఆర్.గారు. ఆయనకు మోసం చేస్తే జనం హర్షించరు. కాస్త ఆలోచించండి" అని దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు గారితో చెప్పారు.

"లేదమ్మా - మీకు భర్తమీద గౌరవం, ప్రేమా ఉన్నాయి. సవతి కొడుకు మీద కన్న, సొంత కూతురు మీద ప్రేమ ఎక్కువ అంతే. ఇందులో మీరు ఎవరినీ బాధపెట్టలేదు. భర్త కలకాలం బ్రతికుండాలనీ, ఆయనకీ గండం గడిస్తే నిలువు దోపిడీ ఇస్తానని మొక్కుకునే సీనుంది" అన్నారు ఆదుర్తిగారు.

"ఆ సీను తప్పకుండా షూట్ చెయ్యండి. కాని చివర్లో చిత్రం పొడుగు ఎక్కువైందని ఇలాంటి సీన్లు మీదనే కత్తెర పడుతుంది. అది జరక్కుండా చూడండి" అని హెచ్చరించారు. అంతటి అంకితభావం ఆ నాటి వారిలో కన్పించేది కాబట్టే ఆ చిత్రాలు ఈనాటికీ ప్రామాణిక చిత్రాలుగా నిలిచి ఉన్నాయి.

కన్నాంబ గారు సెట్‌కి ఎప్పుడూ ఆలస్యంగానే వచ్చేవారు. అది అందరికీ తెల్సిన విషయమే. అది దృష్టిలో ఉంచుకునే దర్శకులు షూటింగ్ ప్లాన్ చేసుకునే వారు. ఆమె స్టూడియోకి రాగానే, మేకప్ రూమ్‌కి అసిస్టెంట్ డైరెక్టర్‌ని పిలిపించి ఆ నాటి దృశ్యంలోని ఆమె డైలాగులను వినిపించేవారు.

ఒకసారి రచయిత పినిసెట్టి శ్రీరామమూర్తిగారు సెట్‌లోకి వచ్చారు. ఆమె వారి పక్కన కూచుని ఆ రోజు షూటింగ్‌లో తన సంభాషణలను ఆయనకు వినిపిస్తానన్నారు.

"మీరు నాకు వినిపించడం ఏమిటమ్మా?" అన్నారు శ్రీ పినిశెట్టి. "అది కాదండి. మీ సంభాషణలను మీరు వూహించిన మేరకు నేనెంత వరకూ చెప్పగలుగుతున్నానో తెలుసు కోవాలిగా!" అన్నారు కన్నాంబగారు.

రచయితలపై అంతటి గౌరవం ఉండేది ఆమెకు.

కన్నాంబ షూటింగ్‌లో ఉన్నారంటేనే సెట్ కళకళలాడుతూ ఉండేది. తాను పెద్దనటి అయినా సరే చిన్న చిన్న నటీనటులతో కలివిడిగా ఉండేవారు కన్నాంబ. పైగా ఆమెది చాలా సున్నితమైన మనసు. సినిమా మోజుతో మద్రాసు వచ్చి మోసపోయిన వారినెందరినో ఆదుకున్నారు కన్నాంబగారు. "నేను మద్రాసు వచ్చి సైకిలు మీద గమ్యం లేకుండా తిరుగుతుంటే కన్నాంబ తల్లే నన్ను ఆదుకుని, వేషాలు లేకపోయినా అన్నం పెట్టి అన్నపూర్ణలా ఆదుకుంది. నేనీనాడు ఈ స్థితిలో ఉన్నానంటే అంతా ఆ తల్లి చలవే" అంటారు ప్రముఖ హాస్యనటుడు పద్మనాభం.

ఎక్కువగా కారెక్టర్స్ ధరించినా, కన్నాంబకు హీరోయిన్ గ్లామర్ ఉండేది. కన్నాంబ నటించిన మరి కొన్ని చిత్రాలు - ఉమాసుందరి (1956), 'అనార్కలీ' (1955), 'తోడికోడళ్ళు' (1957), 'మాంగల్యబలం' (1959), 'రేచుక్క పగటిచుక్క' (1959), 'అభిమానం' (1960), 'జల్సారాయుడు' (1960), 'ఇంటికి దీపం ఇల్లాలే' (1961) 'జగదేకవీరుని కథ' (1961), 'ఆత్మబంధువు' (1962), 'స్వర్ణమంజరి' (1962), 'పరువుప్రతిష్ట' (1963), 'లవకుశ (1963), 'ఆత్మబలం' (1964) వంటి చిత్రాల్లోని ఆమె నటన అందరి ప్రశంసలకీ నోచుకున్నదే.

దాదాపు 150 చిత్రాల్లో నటించి తెలుగు, తమిళ చలన చిత్ర రంగాల్లో మహారాణిగా వెలుగొందిన కన్నాంబ ముగింపు మాత్రం విషాదమనే చెప్పుకోవాలి. ఆమె చనిపోయేంతవరకూ నటిస్తూనే ఉన్నారు. చిత్తూరు వి.నాగయ్య తీసిన 'భక్తరామదాసు' (1964)లో మాత్రం డూప్ షాట్స్ తియ్యవలసి వచ్చింది. ఆ చిత్రంలో ఆమె లేకపోవడం వల్ల డబ్బింగ్ చెప్పాల్సిన చోట టి.జి.కమలాదేవి డబ్బింగ్ చెప్పారు. అప్పటికే కన్నాంబ గాత్రధారణ మానుకున్నందున ఆమెకు ప్లేబాక్ కూడా పాడారు కమలాదేవి. కన్నాంబ నటించిన చివరి చిత్రం భరణీ వారి 'వివాహబంధం' (1964).

## మృతదేహానికి కట్టిన పట్టుచీర మాయం

ఎన్నో సత్కారాలు, బిరుదులు పొందిన పసుపులేటి కన్నాంబ 07-05-1964న కన్ను మూశారు. ఆమె అంతిమయాత్ర "అతివైభవంగా" జరిగింది. తెలుగులో ఎంత పేరో, ఆమెకు తమిళంలో అంతే పేరు. అంచేత చిన్నా, పెద్దా నటీనటులూ, నిర్మాతలు, దర్శకులు, అభిమానులు ఎందరెందరో వచ్చి ఆమె అంతిమ యాత్రలో పాల్గొన్నారు. ఆమె పుణ్యస్త్రీగా పోవడంతో, ఆమెకెంతో ఇష్టమైన మామిడిపండు పసుపురంగు పట్టుచీర కట్టి, పెద్దబొట్టు పెట్టి వేలాదిమంది అభిమానులు చూస్తుండగా కన్నమ్మపేట శ్మశానంలో ఖననం చేశారు. మర్నాడు ఉదయం ఖననం చేసిన స్థలంలో, సంప్రదాయ ప్రకారం పాలు పోయడానికని బంధువులు వెళ్తే - ఆ మృతదేహం బయటికి వచ్చేసి ఉంది. ఆమెకు కట్టిన ఆ పట్టుచీరె లేదు! ఇదీ ఒక కళాకారిణికి ఇచ్చిన గౌరవం.

సిరిసంపదలు ఎలా వస్తాయో, ఎలా పోతాయో ఎవరూ చెప్పలేరని నానుడి. ఎలా పోయాయో, ఏమై పోయాయో గానీ కన్నాంబ మరణంతో శ్రీ రాజరాజేశ్వరి ఫిలిం కంపెనీ మూతబడింది. కార్లు, బంగళాలు అదృశ్యమయ్యాయి. కడారు బి.నాగభూషణం చివరి దశలో ఒక లాడ్జిలో చిన్నగదిలో ఉండేవారు. ఎదురుగా కన్నాంబ ఫోటో, దండెం మీద తువ్వాలు తప్ప ఇంకేం ఉండేవి కావు. నిత్యం పట్టుపాన్పుపై పవళించే నాగభూషణం చివరి దశలో చాపమీదే పడుకునేవారు. ఎంత దయనీయమైన స్థితి. "కన్నాంబ రాకతో నా జీవితంలోకి లక్ష్మీ, సరస్వతి ఇద్దరూ వచ్చారు. ఆమె చనిపోవడంతో ఇద్దరూ వెళ్లిపోయారు. ఆమె ఉంటే ఈ వృద్ధాప్యంలో అండగా ఉండేది. నా కళ్ళముందే సుమంగళిగా పోవాలని కోరుకునేది. ఆ కోర్కె నెరవేర్చుకుని పోయింది. కానీ ఆమె చనిపోయాక నేను నిస్సహాయుడినయ్యాను. నాలో శక్తి అంతా ఆమే తీసుకుపోయింది. ఇక కన్నాంబ నన్ను పిలుస్తోంది. నేనూ త్వరలో ఈ లోకం వదిలి వెళ్తాను" అని బాధ పడేవారు చివరి రోజుల్లో నాగభూషణం. ఆ తర్వాత కొంతకాలానికి ఆయన కూడా మరణించారు.

తెలుగు, తమిళ భాషల్లో 22 చిత్రాలు నిర్మించి, అతి వైభవంగా బ్రతికిన ఈ దంపతులకు చివరకు విషాదమే మిగిలింది. ఏది ఏమైనా అటు సినీ రంగంపైన, ఇటు రంగస్థలం మీద దాదాపు 50 సం॥లు తేజోవంతంగా ప్రజ్వరిల్లిన కన్నాంబకు సమకాలికులైన నటీనటులు ఇప్పుడు కొందరే ఉన్నారు. కానీ ఆమె జ్ఞాపకాల బరువును మోస్తూ, దాని తీపి చేదూ, నెమరువేసుకునే ప్రేక్షకులెందరో ఎప్పటికీ ఉంటారు.

-కంపల్లె రవిచంద్రన్






విడుదల : ఆదిత్య
వెల : రూ.38/-

ఈవీవీ గారబ్బాయి ఆర్యన్‌రాజేష్ హీరోగా ప్రముఖ నిర్మాత డి.రామానాయుడు సురేష్ ప్రొడక్షన్స్ పతాకంపై నిర్మించిన 'హాయ్' ఆడియో క్యాసెట్ విడుదలయింది. "మీ అబ్బాయిని నా సొంత కొడుకులా భావించి మంచి మ్యూజిక్ ఇస్తాను". అంటూ ఈవీవీకి సినిమా ప్రారంభోత్సవంనాడే ప్రామిస్ చేసిన కోటి ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

సిరివెన్నెల రాయగా సందీప్, సుజాత పాడిన 'నిను చూసిన ఆ తొలి నిముషాన నా మనసుకి తెలుసా ఏమైనా' పాట ట్యూన్‌లోనూ, గాయనీగాయకుల ఎంపికలోనూ ఓ ఫ్రెష్‌నెస్ ఫీలయేలా జాగ్రత్తపడ్డాడు కోటి. అలాగే సీతారామశాస్త్రి, ఇలాంటి పాటలిప్పటికి ఆయన కొన్ని వందలు రాసినా సరే... రొటీన్‌లా అనిపించకుండా ఉండడానికి చేసిన ప్రయత్నం రెండో చరణంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

శ్రీరాంప్రభు, టిప్పు, కోటి, మురళి, కణ్ణన్, సరోజ కలిసి పాడిన 'ప్రేమలో పడ్డాడురోయ్' పాట (మొదటి చూపుకు కుదురు కరువు అనే లైను రిపీట్‌గా ఉంటుంది) ట్యూన్ పరంగా ఓ తమాషా వెరైటీ సాంగ్. సురేంద్రకృష్ణ రాసిన సాహిత్యం కూడా ఆ వెరైటీని సమతూకంలో నడిపించడానికి సహాయపడింది. ఇటీవల కమల్‌హాసన్ నటించిన 'బ్రహ్మచారి' డబ్బింగ్ సినిమాలో 'చంద్రస్వామి,బాలస్వామి,సుబ్బుస్వామి,రామస్వామి కళ్యాణం చేసుకున్నారో' పాట ప్రభావం ఈ పాట తయారీలో (మాత్రమే) ఉండేమోననిపించే పాటయిది.

సురేంద్రకృష్ణ రాసిన మరో పాట -'హాయ్‌రేహాయ్ హాయ్‌రేహాయ్ నా చెలియ ఐ లవ్ యు అందోయ్' ... నూటికి నూరుపాళ్ళు హిట్‌సాంగ్! కోటి ట్యూన్‌లు ఇప్పుడు పూర్తిగా కొత్తరక్తం నింపుకొని విజృంభిస్తున్నాయనడానికి మొన్న 'నువ్వు నాకు నచ్చావ్' లో 'ఓ నవ్వు చాలు' పాట, ఇవాళ ఈ 'హాయ్‌రేహాయ్' పాట సాక్ష్యంగా నిలబడతాయి. ఇంకా క్లియర్‌గా చెప్పాలంటే మొత్తం ఆడియోకి ఈ పాటే వెన్నెముక, ప్రాణం కూడా! ఇవన్నీ ఒక ఎత్తు - ఈ పాటను మరొక సంగీత దర్శకుడు ఆర్పీ పట్నాయక్ పాడడం మరొక ఎత్తు. ఇప్పటివరకు తను పాడిన పాటలకు భిన్నంగా, మరింత రొమాంటిక్ టచ్‌తో, కొంత కొంటెతనాన్ని మేళవించి ఎంతో ఆకర్షణీయంగా పాడేడీ పాటని. ఉష కూడా యస్.జానకి లెవెల్లో నవ్వుల్ని పలికిస్తూ పాడింది. నిజానికి '.జానకిని మించి' అని రాయాలి... కానీ ఆ అమ్మాయికి తన ప్రతిభను నిరూపించుకోవటానికి ఇలాంటి అవకాశాలెన్నో రావాలి. అవన్నీ సద్వినియోగపరుచుకున్న తర్వాత పైన ఉదహరించిన విశేషణాన్ని వాడితే, అది విశేషంగా కాక సహజంగా ఉంటుంది.

సురేంద్రకృష్ణ రాయగా టిప్పు, హరిణి పాడిన 'మనసూరుకోదె మందాకిని' పాట మాంఛి ఊపున్న బీట్ సాంగ్. 'జ్యూయెల్ తీఫ్' సినిమాలోని 'హోఠోంపె ఐసీ బాత్ దబాకే చలీ ఆయీ' పాట రిథమ్‌ని 'తీస్రీ మంజిల్' లోని 'అ..అ..ఆజా' పాటని - బర్మన్ కుటుంబాన్ని ఈ పాటల ద్వారా గుర్తు చేస్తూ సినీ సంగీత చరిత్రలోని సువర్ణాధ్యాయాల్ని మరొకసారి మననం చేసే అవకాశాన్ని కల్పించినందుకు కోటిని ప్రశంసించవలసిందే తప్ప తప్పు పట్టాల్సిన పని లేదు.

సీతారామశాస్త్రి రాయగా దేవి (దేవి శ్రీ ప్రసాద్), సంజయ్, కృష్ణమోహన్, రఘు, ఉష, రాధిక, పాడిన 'ఎక్స్‌క్యూజ్ మి' పాట బొత్తిగా, పూర్తిగా కుర్రకారు పాట. 'స్టైల్' సినిమాలోని 'ఎక్స్‌క్యూజ్ మి' అనే పాట దీనికి ప్రేరణ అని పరోక్షంగా తెలిసిపోతూనే ఉంటుంది. ఈ పాట ద్వారా యూత్ చేత ఈలలు వేయించుకోవటమే ప్రధాన లక్ష్యం అన్నట్టుగా - హీరో సినిమాలోని ఫ్లూట్ బిట్, ఛోళీ కే పీఛే క్యా హై (ఖల్‌నాయక్), ఇక్ పల్ కా జీనా (కహో నా ప్యార్ హై), ముస్తఫా ముస్తఫా (ప్రేమదేశం), పాటల ట్యూన్‌లని కేవలం సరదా కోసమే కలుపుకున్నారు.

రాజేష్, సుజాత పాడిన 'తంతే పడిపోయా, పూబంతి ఒడిలోనే' పాట మరొక హిట్ సాంగ్. పల్లవిలోనే తన ఛమక్కులు గుప్పించాడు చంద్రబోస్. బహు వినసొంపుగా ఉన్న పాట యొక్క పల్లవి యస్వీ కృష్ణారెడ్డి గారి ఊయల సినిమాలోని 'తారక దిగివస్తే' అనే ట్యూన్‌ని తెలుగు వాళ్ళకి గుర్తుచేస్తుంది. అయితే ఒరిజినల్ వేరే ఉంది. 1964 లో టి.ప్రకాశరావు దర్శకత్వంలో 'పడగొట్టి' అనే ఓ తమిళ చిత్రం వచ్చింది. అందులో ఎం.జి.ఆర్, బి.సరోజ కలిసి అభినయించిన "తొట్టాల్ పూమలరుం/తొడామల్ నాన్ మలరిందేన్/ సుట్టాల్ కణ్ శివక్కుం/సుడామల్ కణ్ శివన్‌దేన్" అనే పాట బాగా పాప్యులర్ అయింది ఆ రోజుల్లో. హీరోహీరోయిన్లు చప్పట్లు (కొండొకచో చిన్నసైజు లెంపకాయలు కూడా) కొట్టుకుంటూ పాడిన ఆ పాటలో చప్పట్లక్కూడా రిథమిక్ ఇంపార్టెన్స్ ఇస్తూ ట్యూన్ చేశారు విశ్వనాధన్ రామమూర్తి. ఆ ఇంపార్టెన్స్ ఈ 'తంతే పడిపోయా' పాటలో కూడా కనిపిస్తుంది. ఆ తమిళ బాణీని తనదైన పద్ధతిలో మలుచుకుంటూ కోటి చేసిన ఈ ప్రయత్నాన్ని 'ఓ అందమైన అన్వయింపు'లా స్వీకరించాలే తప్ప ఆయన ప్రతిభను తక్కువగా అంచనా వేయవలసిన పని లేదు. ఎందుకంటే తనేమిటో ఇదివరకు చాలాసార్లు నిరూపించుకున్నాడు కనుక.

(ఇంకా 58వ పేజీలో)

### కన్నీళ్లతో పాటలకు నగిషీలు చెక్కిన

# గజల్ కా సర్‌తాజ్ - తలత్ మెహమూద్



★ భావోద్వేగ భరితమైన గానానికి రఫీని రాజుగా చెప్పుకుంటే సహజగానానికి తలత్ మెహమూద్‌ని చక్రవర్తిగా చెప్పుకుంటారు.

★ రఫీ రంగప్రవేశం చేసేదాకా ట్రాజెడీకింగ్ దిలీప్‌కుమార్‌కు నేపథ్యగాయకుడిగా ఉన్నది ఆయనే!

★ విదేశాల్లో పాడిన మొదటి భారతీయ గాయకుడు ఆయనే!

★ సుమారు 25 సంవత్సరాలపాటు పలు విదేశాలు పర్యటించి గజల్స్ వినిపించిన గాయకుడాయన.

★ తూర్పు ఆఫ్రికా వెళ్ళినప్పుడు మొదట అనుకున్న ప్రకారం 6 కచ్చేరీలు ఇచ్చి వచ్చేద్దామనుకుంటే 25 కచ్చేరీలు చేసేదాకా వారు ఇండియాకి వెళ్ళనివ్వలేదు!

★ 1968లో ట్రినిడాడ్ (వెస్టిండీస్) పర్యటించినప్పుడు విమానాశ్రయం నుండి రాజధాని నగరం దాకా జాతీయరహదారికి ఇరుప్రక్కలా జండాలూపుతూ పిల్లలు, పెద్దలు ఆయనకు ఘనస్వాగతం చెప్పారు.

★ లండన్‌లోని రాయల్ రాబర్ట్‌హాల్‌లో కచ్చేరీ చేసే ప్రథమ గౌరవం లతాకు దక్కితే, ఆ తరువాత ఆ అదృష్టం ఆయనదే!

★ కుందన్‌లాల్ సైగల్ మొదటి నటగాయకుడు అయితే అతని తర్వాతి నటగాయకుడు ఆయన మాత్రమే!

★ 13 భాషల్లో కలిపి 700 పాటలు పాడారాయన. "మనోరమ"లో ఆయన పాడిన పాటలలో తెలుగు ఉచ్చారణ చక్కగా ఉంటుంది.

గజల్ చక్రవర్తి తలత్ లక్నోలో 1924 ఫిబ్రవరి 24న జన్మించారు. చిన్నతనం నుంచే పాటలు పాడటంలో ఆయనకు చాలా ఉత్సాహం ఉండేది. తన 16వ ఏటికల్లా ఆయన మంచిగాయకుడిగా పేరు తెచ్చుకున్నారు. 1941లో హెచ్.ఎం.వి. వారు ఆయన ప్రతిభను గుర్తించి "సబ్‌దిన్ సమాన్ నైథా" అనే పాట పాడించారు. 1944లో ఆయన "తస్వీర్ తేరీ దిల్‌మేరా బహ్‌లాన సకేగీ" అనే పాట రికార్డుగా ఇచ్చారు. ఆ పాట వచ్చిన తర్వాత అవకాశాలు ఆయన్ను వెల్లువలా ముంచెత్తాయి. బొంబాయి చేరి అనిల్ బిశ్వాస్ ఆదరణతో ఛాన్సు సంపాదించుకున్నారు. దిలీప్‌కుమార్‌కే కాదు, దేవానంద్‌కి ("జాయేతో జాయే కహాఁ" - టాక్సీ డ్రైవర్), సునీల్‌దత్‌కి ("జల్‌తే హై జిస్‌కే లియే" - సుజాతా)కి కూడా పాడారు.

## నటుడిగా...

తలత్ గాయకుడే కాదు, నటుడు కూడా. కెరియర్ ప్రారంభంలోనే ఆయన హీరోవేషాలు ధరించారు. తపన్‌కుమార్ అనే తెరనామధేయంతో కలకత్తాలో నిర్మించిన మూడు హిందీ సినిమాలలో ఆయన హీరో పాత్రలు వేసారు. 1949లో బొంబాయి చేరి అక్కడా వేషాలు వేసారు. అక్కడ దాదాపు 10 సినిమాల్లో నటించారు. నితిన్ బోస్ నిర్మించిన "వారిస్" సినిమాలో ఆయనకు జంట ప్రఖ్యాత గాయక నటీమణి సురయ్యా! షహీద్ లతీఫ్ నిర్మించిన "సోనే కీ చిడియా" ఆయన నటజీవితానికి శాశ్వతంగా తెర దించింది. కారణం తలత్‌ను నెగటివ్‌రోల్‌లో ప్రేక్షకులు రిసీవ్ చేసుకోలేకపోవడం! సినిమాల్లో వేషాలు వేయడంపై మక్కువ చూపడం. పైగా విదేశీ పర్యటనలు చేయడం, తలత్ ప్లేబ్యాక్ సింగింగ్ కెరియర్‌ను దెబ్బతీశాయి. ఆయనకు నేపథ్యంలో పాడడం అంత ఇష్టం లేదన్న ప్రచారం సాగింది. రఫీ పైకి రావడంతో క్రమంగా తలత్‌కి అవకాశాలు తగ్గిపోయేయి. పాటల్లో స్పీడు పెరగడం, తలత్ పెద్దమనిషి తరహా, కూడా కొన్ని కారణాలుగా చెప్పుకోవచ్చు.

## ట్రాజెడీకింగ్ - ట్రాజెడీ సింగర్

తలత్ సినిమాలకు పాడిన మొదటి గజల్ "ఐ దిల్ ముఝే ఐసే జగా లే చల్" (ఉర్దూ). దీన్ని దిలీప్‌కుమార్‌పై చిత్రీకరించారు. వారిద్దరి గొంతులు ఎంతలా పెనవేసుకుపోయాయంటే ఆ పాట దిలీప్‌కుమారే స్వయంగా పాడారని చాలామంది అనుకున్నారు. "ఏ మేరే దిల్ కహీ ఔర్ చల్", "మిత్వా లగేరే"ల విషయంలోను అదే కన్‌ఫ్యూజన్. చివరికి తలత్ పాడారని తెలుసుకున్న జనం "ముసాఫిర్"లో "లగీ నహీ చూటే" పాట దిలీప్ స్వయంగా పాడినా జనం తలతే పాడాడనుకున్నారు! వారిద్దరి కాంబినేషన్‌లో వచ్చిన "షామ్ ఏ ఘమ్‌కీ కసమ్" (ఫుట్‌పాత్), "స్వప్నోంకీ సుహానీ దునియాతో" (షికస్త్), "ఏ హవా ఏ రాత్" (సంగ్‌దిల్) పాటలు ఎప్పటికీ పాతబడవు. తనకు గాత్రదానం చేయడానికి ముందే తలత్‌కు మూడు సినిమాలలో (రాజ్యలక్ష్మి, తుమ్ ఔర్ మై, సమాప్తి) నటనానుభవం ఉండడం వల్లనే నటుడు తెరమీద ఎలా అభినయిస్తాడో అవగాహన ఉండి అంత గొప్పగా పాడారని దిలీప్ కుమార్ అన్నారు. 1998 మే 9న తలత్ మరణించినప్పుడు ఆయనకు నివాళి అర్పిస్తూ "ఆయన పాటలు ముందు తరాల వారు కూడా అభిమానించి హృదయంలో పదిలపరుచుకుంటారు. ఎంచేతంటే ఆ పాటలోని మెలోడి పునాది మాత్రమే కాక ఆయన తన కన్నీళ్ళతో ఆ పాటలకు నగిషీలు చెక్కారు. పాటలకు లేసులల్లారు. ఆయన పాటలోల నింపిన విషాదం మనల్ని వెంటాడుతూనే ఉంటుంది" అన్నారు.



## తలత్ మెహమూద్ పాడిన కొన్ని ప్రఖ్యాత సినీ గీతాలు

| | | |
|---|---|---|
| 1. | యే హవా యే రాత్ | సంగ్‌దిల్ |
| 2. | మై దిల్ హూఁ ఏక్ అర్మాన్‌భరా | అన్‌హోనీ |
| 3. | హై సబ్‌సే మధుర్ వో గీత్ | పతితా |
| 4. | ఏ ఘమే - దిల్ | ఠోకర్ |
| 5. | హుస్న్ వాలోం కో | బాబుల్ |
| 6. | షామ్ యే గమ్ కీ కసమ్ | ఫుట్‌పాత్ |
| 7. | మేరీ యాద్ మేఁ | మద్‌హోశ్ |
| 8. | ఆసూఁ సమఝ్‌కే | ఛాయా |
| 9. | దేఖ్ రీ తేరీ ఖుదాయీ | కినారే కినారే |
| 10. | రాత్‌నే క్యా క్యా | ఏక్ గాఁవ్ కీ కహానీ |
| 11. | హమ్ సే ఆయా న గయా | దేఖ్ కబీరా రోయా |
| 12. | మై పాగల్ మేరా మన్వా పాగల్ | ఆశియానా |

## తలత్ మెహమూద్ పాడిన కొన్ని ప్రఖ్యాత చిత్రేతర గీతాలు

| | | |
|---|---|---|
| 1. | దిల్‌ఏ నాదాన్ తుఝే హువాక్యాహై (లతాతో కలిసి) | మీర్జాగాలీబ్ |
| 2. | తుమ్ ఏ క్యా సితమ్ కియా | షకీల్ బదయూని |
| 3. | దిల్ కీ బహానేకే తఖ్తీర్‌తో హై | షకీల్ బదయూని |
| 4. | కభీషికో ఓ షహజాద్ ఓ బర్గ్‌పర్ | జిగర్ మొరదాబాది |
| 5. | కహి షేర్ ఓనగ్మా | కుమార్ భారబన్‌కీ |
| 6. | కౌన్ రహతా హై తుఝే | జాన్ నిసార్ అఖ్తర్ |
| 7. | గలేలగాకే జోసున్తేహై | షమీమ్ జెపురి |
| 8. | దో నో జహా తెరీ మెహబ్బత్‌కే హారకే | ఫైయాజ్ అహ్మద్ ఫైయాజ్ |
| 9. | రోషనీ బన్‌కీ ఫిజావోమే | ఇబ్రహిం ఫయాజ్ |

మామూలు శ్రోతకు ఉర్దూ గజల్‌ను పూర్తిగా అర్థం చేసుకోవడం సాధ్యం కాదు. కానీ తలత్ పాడిన హిందీ సినీ గజళ్ళు కానీ, బయట కచేరీల్లో పాడిన గజళ్ళు కానీ అందరికీ అర్థమయ్యేట్లా ఉండేవి. ఉదాహరణకి "మారేడు నీవని ఏరేరితేనా మారేడు దళములు నీ పూజకు" (భక్తకన్నప్ప)లో మారేడును రెండురకాలుగా గాయకుడు పలికించితేనే ఆ పదప్రయోగంలో అందం తెలుస్తుంది. ఇలాంటి "న్యాయాన్స్"ను ఉర్దూ శ్రోతలు గుర్తించేట్లా పాడడంలోనే ఉంది తలత్ ప్రతిభ. నూర్ లక్నవీ రాసిన "మహబ్బత్ హీ న జో సమఝే ఓ జాలిమ్ ప్యార్ క్యా జానే" (పరిచయ్) వంటి పాటల్లో ఇది కొట్టవచ్చినట్టు తెలుస్తుంది. 1961లో పాకిస్తాన్‌లో 60,000 మంది సమక్షంలో ఆయన ఈ గజల్‌తో పాటు "ఆ, తేరీ తస్‌వీర్ బనాలావూ" (నాదాన్), "మైఁ దిల్ హూఁ" (అన్‌హోనీ), "చల్ దియా కార్‌వాన్" (లైలా మజ్నూ) వంటివి పాడి వాళ్ళని మంత్రముగ్ధుల్ని చేసేశారు. ఆయన పాడిన పాటల్లో ఏ ఒక్క పదమూ ద్వంద్వార్థంతో గానీ, అశ్లీలంతో గానీ ఉండదు. ఆయన మంచి భాష, మంచి భావం ఉన్న పాటలనే ఎంచుకుని పాడేవారు. ఆ స్థాయికి తగని పాటలను సున్నితంగా తిరస్కరించేవారు.

గజల్ ప్రక్రియ తలత్ గొంతుతో కొత్త అందాలను సంతరించుకుంది. మీర్జా గాలిబ్ రాసిన గజళ్ళలో ఎక్కువ గజళ్ళు పాడింది ఆయనే. లతాతో కలిసి పాడిన మీర్జా గాలిబ్ గజల్ "దిల్ ఏ నాదాన్ తుఝే హువా క్యా హై" ఆయనకు చాలా పేరు తెచ్చిపెట్టింది. నేటి మేటి పాటల రచయిత జావేద్ అఖ్తర్ తండ్రి జాన్ నిసార్ అఖ్తర్ 1954లో రాసిన "కౌన్ కహతా హై తూ" అనే గజల్‌ను ఖయ్యాం కంపోజ్ చేయగా తలత్ పాడారు. మహమ్మద్ రఫీ, మన్నాదే, హేమంత్‌కుమార్, భూపేన్ హజారికాలతో కూడా కలిసి పాడారు.

తలత్‌ను స్టేజి మీద చూడడం పులకింత కలిగించే ఓ అనుభవం. ఆయన పాడే శైలి మామూలు శ్రోతలు కూడా తమలో తాము పాడుకునేంత సాధారణంగా ఉంటుంది. ఆరోహణలో అత్యున్నత స్థాయికి స్వరాన్ని తీసుకెళ్ళి అక్కడ సాముగరిడీలు చేయించి అవరోహణకు వచ్చి మళ్ళీ కొన్ని జిమ్మిక్కులతో పాడే శైలికి ఆయన వ్యతిరేకి. ఎక్కువగా స్వరాన్ని బేస్‌లోనే, మార్దవంగా పాడతారు.

నాన్‌ఫిల్మీ గజళ్ళను సినిమాల్లో ప్రవేశపెట్టిన ఘనత తలత్‌సాబ్‌దే. ఒక థరో జంటిల్మన్‌గా, అతి నిరాడంబరంగా జీవిస్తూ ప్రచారానికి, మీడియాకు దూరంగా, అభిమానులకు దగ్గరగా మసలిన ఆ మహా గాయకుడిని ఆయన అభిమానులు ఎప్పటికీ మర్చిపోలేరు. "దిల్ ఏ నాదాన్"లో ఆయన పాడిన "జిందగీ దేనేవాలే సున్" ఎప్పటికీ గుండెల్లో మారుమోగుతూనే ఉంటుంది. మనం ఏకాంతంలో ఉన్నప్పుడు ఆయన గొంతు మన చెవుల్లో గుసగుసగా వినిపిస్తూనే ఉంటుంది.

-ఎన్.కె. రామారావు

# లలిత సంగీతం

## ఓహో యాత్రికుడా



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993

ప॥ ఓహో యాత్రికుడా! ఓహో యాత్రికుడా!
ఉదయారుణకాంతి పుంజ సదనము దెస పయనింతు
వొహో యాత్రికుడా యాత్రికుడా

1. చ॥ హృదయపూర్ణ మృదుల గాన సుధల జల్లి మధుపథాన
కదలిపోవుచున్నావోహో యాత్రికుడా యాత్రికుడా

2. చ॥ అంధకార దీర్ఘ నిశాబంధనమ్ము సడలించుక
గంధవాహ తురంగ మస్యందనమ్ము కదలించుక
సింధుపార పూర్వ దిశాసుందర తీరమ్ము జేరు
నో యాత్రికుడా యాత్రికుడా

3. చ॥ శీతల హేమంతకాల శిథిల జీర్ణపర్ణశాల
వదలి కదలివచ్చితి వోహో యాత్రికుడా యాత్రికుడా

4. చ॥ చైత్రమాసకుసుమలతా పత్ర తోరణమ్ములూగ
చిత్రచిత్ర కలవిహంగ గాత్రనిస్వనమ్ము రేగ
మిత్రవరా నేడు నీ పవిత్ర యాత్ర సాగింతు
వొహో యాత్రికుడా యాత్రికుడా....

| | | |
|---|---|---|
| రచన | : కీ॥ శే॥ మల్లవరపు విశ్వేశ్వరరావు | |
| గానం, సంగీతం | : కీ॥శే॥ సాలూరు రాజేశ్వరరావు | |
| రాగం | : సింధుభైరవి (కర్ణాటక సంగీతం) | భైరవి (హిందుస్తాని సంగీతం) |
| తాళం | : త్రిశ్రగతి (కర్ణాటక సంగీతం) | దాద్రా (హిందుస్తానీ సంగీతం) |
| ఆరోహణ | : స రి గ మ ప ద ని స | |
| అవరోహణ | : స ని ద ప మ గ రి స | |

ఈ రాగంలో షడ్జము, శుద్ధ రిషభం, సాధారణ గాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం, శుద్ధ దైవతం, కైశికి నిషాదం స్వరాలున్నాయి.

ఇవేగాక చతుశృతి రిషభం, ప్రతిమధ్యమం, చతుశృతి దైవతం కూడా యీ రాగంలో ప్రయోగించబడతాయి.

అయితే "ఓహో యాత్రికుడా" అనే యీ గీతానికి కూర్చిన బాణీలో మాత్రం చతుశృతి రిషభం, ప్రతిమధ్యమం, చతుశృతి దైవతం స్వరాలను స్వరకర్త ఉపయోగించలేదు. "ఆనందమే లేదా లోకమున" అనే బసవరాజు అప్పారావుగారి గీతానికి కూర్చిన బాణీలో సింధుభైరవి రాగంలోని, స, రి, గ, ప, ద, స అనే స్వరాలను (భూపాల్ తోడి) ప్రముఖంగా వాడుకున్న రాజేశ్వరరావు "హాసం"

- జనవరి 1-15 సంచికలో వివరంగా తెలుపబడినది) గారు, యీ పాటలో ఎక్కువగా స, రి, మ, ప, ద, స అనే స్వరాలను ప్రముఖంగాను, పనిరినిప అనే స్వరాలను కొన్నిచోట్ల వాడుకుంటూ ఆ రాగంలో కొత్త పోకడలతో ఎంతో వైవిధ్యాన్ని చూపిస్తూ రసవత్తరంగా సంగీతాన్ని కూర్చి హృద్యంగా గానం చేశారు.

1935లో విశ్వేశ్వరరావు గారు రచించిన యీ గీతాన్ని, ఆ తరువాత కొంత కాలానికి ఆకాశవాణి మద్రాసు కేంద్రంలో రాజేశ్వరరావు గానం చేశారు. శాంతినికేతన్‌లో విద్యార్థిగా చేరి బెంగాలీ భాషను, విశ్వకవి రవీంద్రుని కవితా రీతిని క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్న మల్లవరపు వారిపై టాగూర్ ప్రభావం ఎంతగా వున్నదో యీ "ఓహో యాత్రికుడా" అనే గీతంలో మనం గమనించవచ్చు.

కాలమనే యాత్రికుడు "శీతల హేమంత ఋతువును, శిథిల జీర్ణపర్ణము"లను వదలే శిశిరమును దాటి ఫలపుష్ప సమృద్ధమైన చైత్రమాసం, వసంత ఋతువులో అడుగు పెడతాడు. విహంగముల కలస్వనములతో చిరుగాలులకూగే వికసిత కుసుమాలతో "అంధకార నిశాబంధనము సడలించు' కొని ఉదయించే "ఉదయారుణ కాంతి పుంజాల" దెసకు పయనించే నూతన సంవత్సరమనే యాత్రికుని సంబోధిస్తూ మల్లవరపు వారు రచించిన యీ గీతం ఉదాత్తసాహితీ విలువలను సంతరించుకున్న ఉత్తమ రచన. ఇటువంటి మంచి లలిత గీతాలను ఆకాశవాణిలో ట్రాన్‌స్క్రిప్షన్ సర్వీసు రికార్డులుగా (Transcription Service Records - H.M.V.,) కొలంబియా వారి డిస్క్‌ల రికార్డులవలె) తయారు చేయించి సుమారు 4 దశాబ్దాల క్రితమే పొందు పరచడం జరిగింది. ఆ విధంగా లలిత సంగీతానికి ఎంతో ప్రాచుర్యాన్ని కలిగించింది ఆకాశవాణి. హైదరాబాదు, విజయవాడ మొదలగు కేంద్రాలలో నిక్షిప్తమైవున్న అనేక గీతాలను ముందు తరాలవారికి అందించవలసిన అవసరమెంతైనా వుంది. ఆ ప్రయత్నమే యీ శీర్షిక ద్వారా నేను చేపట్టినది.

,,,|,సా|సా,|,,,|,,ని|,దమ|సా,|,,,|,,,|,సా|సా,|,దా|
ప॥ ...|.ఓ|హో.|...|..యా|.త్రికు|డా.|...|...|.ఓ|హో.|..|

పాని|,దప|మా,|,,,|,,,|,,,|
.యా|.త్రికు|డా.|...|...|...|

మమప|,దద|నిద|పమమ|మమప|పదద|నినిద|పమమ|
ఉదయా|.రుణ|కాంతి|పుం. జా|సదస|ముదెస|పయనిం|.చువా|

సా,|,,,|,,రి|,రిని|సా,|,,,|,,రి|,రిని|సా,|,,,|,,,|,,,|
హో.|...|..యా|.త్రికు|డా.|...|..యా|.త్రికు|డా.|...|...|...|

మమప|పదద|దదద|పమమ|సమమ|మపమ|పనిని|దాద|
1.చ॥ హృదయ|పూ.ర్ణ|మృదుల|గా. న|సుధల|జ. ల్లి|మధుప|ఝాన|

పపని|సరిరి|రినిని|పనిరి|సరినిసా,|,,,|,,రి|,రిని|సా,|,,,|
కదలి|పో.వు|చు. న్నా|. వో.|హో. . .|...|..యా|.త్రికు|డా.|...|

,,రి|,రిని|సా,|,,,|
..యా|.త్రికు|డా.|...| ॥ఓహోయాత్రికుడా॥

సాస|దాద|మామ|రిరిస|సదస|మామ|పమమ|దదద|
2.చ॥ అంధ|కా ర|దీర్ఘ|నిశా.|బం.ధ|నమ్ము|సడలిం|. చుక|
మామ|నిదద|దసా|సాసా|సరిరి|రినిని|నిదద|సససా|
గంధ|వా.హ|మురళి|గమ|స్వరం. ద|న. మ్ము|కదలిం.|. చుక|
సారి|రిగగ|గరిరి|రిరిని|సాస|రిరిని|నిదద|దమమ|
సింధు|పా. ర|పూ.ర్వ|దిశా.|సుంద|ర తీ.|ర. మ్ము|జే. రు|
సా,|,,,|,,రి|,రిని|సా,|,,,|,,రి|,రిని|సా,|,,,|,,,|,,,|
నో.|...|..యా|.త్రికు|డా.|...|..యా|.త్రికు|డా.|...|...|...|
॥ఓహోయాత్రికుడా॥

1వ చరణం వలె 3వ చరణం, 2వ చరణం వలె 4వ చరణం పాడుకోవాలి.



# కీ॥శే॥ మల్లవరపు విశ్వేశ్వరరావు

అందమైన కైతలల్లడంలో అందెవేసిన చేయి మల్లవరపు వారిది. ''లోకమ్మను నవాలోకము''తో దర్శించి "విశ్వగానాలాప నిస్వనమ్మాలించి విశ్వ దీపాలోకరశ్మి సందర్శింప" గలిగిన సుమధుర భావుకుడు విశ్వేశ్వరరావు గారు. శాంతి నికేతనంలోని విద్యాభ్యాసముతో కొత్త ఊపిరులు నింపుకున్న యీయన కవిత్వము మరింత వాడిగా సుమనోహర భావ పరిమళాలతో భాసించసాగింది. "రెక్కలు కట్టుకు మేఘము లెక్కుదము - చుక్కలింట వాసము, చుక్కలె సావాసము'' అంటూ ఉన్నతాశయాలు కలిగిన యీ కవి 1906లో పశ్చిమగోదావరి జిల్లా ఉండిలో జన్మించారు. మధుకీల, కల్యాణ కింకిణి వీరి ప్రసిద్ధ కావ్యాలు. వివిధ యితివృత్తాలతో ఎన్నో కమ్మని పాటలు రచించారు. వీరిగేయాలు, సంగీత రూపకాలు ఆకాశవాణి కేంద్రాలలో ప్రసారమైనవి. 1938లో ఆకాశవాణి మద్రాసు కేంద్రం ప్రారంభం కాగా, ఆ మరుసటి సంవత్సరమే మల్లవరపు వారు రచించిన సంగీత నాటిక "బిల్హణీయం" ప్రసారమైనది. శ్రీ బి.వి.నరసింహారావు స్వరకర్తగా వ్యవహరించారు. శ్రీయుతులు మంచాళ జగన్నాథరావు, రజనీకాంతరావు, పాలగుమ్మి విశ్వనాథం మున్నగు స్వరకర్తలు ఆయన గీతాలకు, సంగీత రూపకాలకు స్వర రచన కావించారు. "దీపావళి నేడు దీపావళి", "భాధరాగ్రతలాన వేదనాతు హినమ్మ" పాటలను మంచాళవారు, "నా ఎదలో పూవుల పొదలో", "స్వాగతం సుస్వాగతం" (ఆకాశవాణి మహిళా కార్యక్రమం "రంగవల్లి"లో) మెదలగు వాటిని పాలగుమ్మి గారు స్వరపరిచారు. నేను కూడా ఆయన రచనలకు సంగీతం కూర్చి పాడాను, పలువురిచే పాడించాను. "మరుపురాని కలలు కని", "తెప్పవోలే చంద్రబింబం", "వదలండీ ద్వేషం మనసులు విరిచే విషం", "మరువకుడీ ఓ ప్రజలారా మన గాంధీమహాత్ముణ్ణి" మొదలైనవి నా సంగీతంతో ఆకాశవాణిలో ప్రసారమైనవి.

1961లో టాగూర్ శతజయంతి సందర్భంగా రవీంద్రుని బెంగాలీ గీతాలలో కొన్నిటిని విశ్వేశ్వరరావు గారు తెలుగులో అనువాదం చేశారు.

ఢిల్లీ నుండి అన్ని భారతీయ భాషలలోను 'రవీంద్రుని గీతాలను ప్రసారం చేసే జాతీయ కార్యక్రమంలో తెలుగు గీతాలను పాడడానికి ఆంధ్రప్రదేశ్ నుండి నన్ను ఎంపిక చేశారు. అందులో మల్లవరపు వారి అనువాద గీతాలను పాడాను. 1962లో చైనాతోను, 1965లో పాకిస్తాన్‌తోను యుద్ధం సంభవించి నప్పుడు ఆకాశవాణి ప్రసారం చేసిన దేశభక్తి గీతాలలో మల్లవరపు వారి "జైహిందని నిద్దుర లేవండి మీచేత తుపాకులు పట్టండీ" మొదలగునవి ప్రజల మన్ననలు పొందినవి.

వీరి చివరి దశలో "ఉగాదులు ఉత్సవాలు" అనే కవితా సంపుటిని కూడా ప్రచురించారు.

## సింధుభైరవి రాగం ఆధారంగా వెలువడిన కొన్ని చిత్రగీతాలు

### తెలుగు

| | | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | నడిరేయి ఏ జాములో | రంగులరాట్నం | ఘంటసాల, జానకి | ఎస్.రాజేశ్వరరావు |
| 2. | ఏమనిపాడెదనో | భార్యాభర్తలు | పి.సుశీల | ఎస్.రాజేశ్వరరావు |
| 3. | నినుబాసిపోవుదానా | లైలామజ్నూ | పి.భానుమతి | సి.ఆర్.సుబ్బరామన్ |
| 4. | ప్రేమ ఎంత మధురం | అభినందన | ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం | ఇళయరాజా |
| 5. | కాలమంతకత్తిరిస్తె కాస్తయవ్వనం | స్టూవర్టుపురం పోలీస్‌స్టేషన్ | బాలు, జానకి | ఇళయరాజా |

### హిందీ

| | | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | మేరేజీవన్‌సాథీ | సాథీ | లత | నౌషాద్ |
| 2. | మైపియాతేరీతూ మానేయానామానే | బసంత్‌బహార్ | లత | శంకర్, జైకిషన్ |
| 3. | మేరేమన్‌కే గంగా | సంగమ్ | ముకేశ్ | శంకర్‌జైకిషన్ |
| 4. | కాహేకోదేర్‌లగాయీరే | దాగ్ | లత | శంకర్‌జైకిషన్ |
| 5. | హైయిసీమే ప్యార్‌కి ఆబ్రూ | దస్తక్ | లత | మదన్‌మోహన్ |

## రాజా ఆడియో రివ్యూ




విడుదల : మయూరి
వెల : రూ.38/-

'ఈనాడు' సంస్థల అధినేత సి.హెచ్.రామోజీరావు ఉషాకిరణ్ పతాకం పై జొన్నలగడ్డ శ్రీనివాసరావు దర్శకత్వంలో నిర్మించిన 'మనసుంటే చాలు' సినిమా ఆడియో క్యాసెట్ మయూరి ద్వారా విడుదలయింది. 'ప్రియమైన నీకు' సినిమా ద్వారా సంగీతాభిమానులందరికీ ప్రియమైనవాడిగా గుర్తింపు తెచ్చుకున్న శివశంకర్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు. ఇందులోని పాటలన్నిటినీ సిరివెన్నెల సీతారామశాస్త్రే రాశారు.

రాజేష్, చిత్ర పాడిన 'అనాలనుంది నీతో కొన్నాళ్ళుగ ఓ మాట' పాట కొన్నాళ్ళవరకు గుర్తుండిపోయే హిట్‌సాంగ్. 'ఎ ఫిస్ట్‌ఫుల్ ఆఫ్ డాలర్స్' సినిమా ద్వారా బాగా పాపులర్ అయిన ఇన్‌స్ట్రుమెంటల్ మ్యూజిక్‌ని ప్రేరణగా చేసుకొని పేర్లల్‌గా వాయించిన బిట్‌తో మొదలవుతుందీ పాట. ఈ బిట్ కూడా ఎంతో బావుంది. 'ఎ ఫిస్ట్‌ఫుల్ ఆఫ్ డాలర్స్' మ్యూజిక్ ఎలా ఉంటుందో తెలుసుకోవాలంటే 'హిట్లర్' సినిమాలో 'ప్రేమా జోహార్, డాన్ డాన్ హిట్లర్' అనే పాటను జ్ఞాపకం చేసుకుంటే చాలు. భీంప్లాస్, ఉదయరవిచంద్రిక రాగాల మిశ్రమంతో తయారైన ఈ పాటలో అనుపల్లవికి చరణాల ఎండింగ్‌లోనూ ఉపయోగించిన లైన్లు - ఇక చాల్లే చాదస్తం జరగదులే ఏం నష్టం, నాకుండాల్సిన బిడియం నీకుంటే ఏం న్యాయం? - లాంటివి సీతారామశాస్త్రి మార్కుని సెపరేట్ మార్కులు వేయించుకుంటూ చూపిస్తాయి.

మనో, చిత్ర, సుఖ్వీందర్ సింగ్ పాడిన 'ఛం ఛమక్ ఛం రంగుల్లో' పాట బీట్ కి బీట్, హుషారుకి హుషారు, విలువలకి విలువలు అన్నీ ఉన్న పాట. అక్కడక్కడ మధ్యమావతి రాగఛాయల్ని, అనగనగా ఆకాశం ఉంది పాట నడకని స్ఫురింపజేసే ఈ పాట పల్లవి ఆ మధ్యకాలంలో వచ్చిన ఓ పాటలోని 'నువ్వుండేది చిలకలగూడ, నేనుండేది చంచల్‌గూడ, దాన్ని దీన్ని కలిపేదెట్టయ్యో వారెవ్వా యస్సయ్యో' అనే లైన్లకు జతపడిన ట్యూన్‌ని గుర్తు చేస్తూవుంటుంది. ఈ పాటలో సుఖ్వీందర్‌కి అంత ప్రాముఖ్యత లేకపోవటానికి కారణం ఊహించలేం.

హరిహరన్ పాడిన 'ప్రతి రాతిరి పది దాటితే మరి నిలకడ లేదు' చాలా మంచి పాట. ట్యూన్ కూడా ఎంతో హాయిగా ఉంది. పబ్లిసిటీలో ఈ పాటకి ప్రాముఖ్యత గనుక ఇస్తూవుంటే - ఎటో వెళ్ళిపోయింది మనసు - పాటకొచ్చినంత పాపులారిటీ వస్తుంది. పల్లవిలోని 'మెరుపేదో రగిలింది తొలిసారిగా' అనే వాక్యాలకు జతపడిన ట్యూన్ వినగానే మనసులో ఏదో రగులుతుంది. దాన్ని కాస్త రాజుకోనిస్తే, అది-'డుండుండుం' సినిమాలో 'అతగాడొస్తాడాహ" పాటలో 'అతడే వచ్చి తగిలాడు - చెవులే నాకు వినరావు' అనే లైన్స్‌కి అంటుకుంటుంది. టేకాఫ్‌లోనూ ఈ పోలిక కనబడుతుంది. అంతమాత్రంచేత 'డుండుండుం' సంగీతదర్శకుడు కార్తీక్‌రాజాని శివశంకర్ అనుకరించాడనిగాని అనుసరించాడనిగాని నిర్ధారించరాదు. ఒక్కొక్కసారి 'లైన్ ఆఫ్ థింకింగ్' లో రసభావసారూప్యాలు సహజంగా దొర్లుతుంటాయి. ఏది ఏమైనా 'ప్రది రాతిరి పది దాటితే' పాట మాత్రం శివశంకర్‌కి చాలా మంచిపేరు తెచ్చిపెడుతుంది. యస్.ఎ.రాజ్‌కుమార్‌లా మెలొడీ గ్యారెంటీ అనే నమ్మకాన్ని ప్రేక్షకులలో కలిగిస్తుంది.

యస్.పి.బాలు, చిత్ర పాడిన 'రాచిలకా రాచిలకా దిగిరావా' పాట డీసెంట్‌గా ఉన్న డ్యూయెట్. సుఖ్వీందర్‌సింగ్, రాధిక పాడిన 'ఓసోసి పిల్లా, అంతేసి కళ్ళా అమాస సందేళా' రెగ్యులర్ మాస్ ఓరియంటెడ్ బీట్‌సాంగ్, 'చెరగనంది మదిలోని చెలిరూపము' పాట పెద్దగా ఇంప్రెషన్ కలిగించదు కాని పనికిరాని పాట మాత్రం కాదు. పాడిన మల్లికార్జున్ తన వాయిస్‌లో ఎక్స్‌ప్రెషన్స్‌కి ఇస్తున్న ఇంపార్టెన్స్ క్లారిటీకి ఇవ్వడంలేదనిపిస్తుంది.

---

సుమారు 960 చిత్రాలకు సంగీత దర్శకత్వం వహించి - కృష్ణచక్ర, రాజ్‌కోటి, కీరవాణి, వందేమాతరం శ్రీనివాస్ వంటి సంగీత దర్శకులకు గురుస్థానంలో నిలబడిన - చక్రవర్తికి శ్రద్ధాంజలిగా 'సరిగమల చక్రవర్తికి శ్రద్ధాంజలి' అనే ఆడియో క్యాసెట్‌ను హెచ్.ఎం.వి.వారు విడుదల చేశారు.




విడుదల : హెచ్.ఎం.వి
వెల : 40/-

ఈ సంజెలో కెంజాయలో (మూగప్రేమ), ఉదయకిరణ రేఖలో(శ్రీవారి ముచ్చట్లు), కుశలమా నీకు కుశలమేనా (బలిపీఠం), ఒళ్ళంత వయ్యారమే(ఇద్దరూఇద్దరే), నీలాల నింగిలో (జేబుదొంగ), మరుమల్లియ కన్నా తెల్లనిది (మల్లెపూవు), సిరిమల్లె పువ్వల్లెనవ్వు(జ్యోతి),ఎన్నెలొచ్చి గోదారమ్మ(దేవత), అందాల హృదయమా (అనురాగదేవత), నీ మనసు నా మనసు ఏకమై(ఇదాలోకం), జాబిలితో చెప్పనా(వేటగాడు), మా ఇంటిలోన మహాలక్ష్మి నీవే(కొండవీటి సింహం), ఇంద్రధనసు చీర కట్టి(గజదొంగ), నీకు నాకు పెళ్ళంట నింగికి నేలకి కుళ్ళంట(జ్యోతి)లాంటి 14 పాట లున్నాయీ క్యాసెట్‌లో. ప్రతి పాటా చక్రవర్తి గౌరవాన్ని నిలబెట్టేదిగా ఉండేట్టు పాటలను ఎంపిక చేసుకోవడంలో చూపించిన అభిరుచికి అభినందించి తీరాలి. అంతేగాదు, ఇన్‌లే కవర్‌పై ఇచ్చిన సమాచారంలో తప్పులు దొర్లకుండా చూపించిన శ్రద్ధకు మరింత ప్రత్యేకంగా ప్రశంసించి తీరాలి. ముఖ్యంగా ఈ సంజెలో, నీ మనసు నా మనసు వంటి అరుదయిపోయిన గీతాలను పొందుపరిచినందుకు మరీమరీ మరీమరీ మెచ్చుకోవాలి.




## తెలుగు సాహితీ చరిత్రలో శాశ్వత స్థానం సంపాదించుకున్న నాటకం గురజాడ అప్పారావు గారి



ఈ నాటకాన్ని తెరకు అనుగుణంగా మలుచుకునే విషయంలో సర్వజనామోద ముద్ర పడేలా రూపొందించారానాడు ఈ చిత్రానికి దర్శకుడు పి.పుల్లయ్య. 'దేవదాసు' చిత్రం ద్వారా ఈనాటికీ తన బ్యానర్ గుర్తుండేలా చేసుకున్న డి.యల్.నారాయణ ఈ చిత్రానికి నిర్మాత. రచన సదాశివబ్రహ్మం కాగా పాటలను సదాశివబ్రహ్మం, దేవులపల్లి, మల్లాది, సముద్రాల రాశారు. ఇవికాక బసవరాజు అప్పారావుగారి నాగులచవితి గీతం, గురజాడ అప్పారావు గారి పుత్తడి బొమ్మ పూర్ణమ్మ కథ, శ్రీశ్రీ రాసిన ఆనందం అర్ణవమైతే గేయం పాటలుగా ఉన్నాయి. ఘంటసాల సంగీత దర్శకత్వం వహించిన ఈ చిత్రంలో ఈ నాటికీ మరిచిపోలేని రెండు పాటలివి:

**ఆనందం అర్ణవమైతే అనురాగం అంబరమైతే ॥ఆనందం॥**
**అనురాగపు టంచులు చూస్తాం ఆనందపు లోతులు తీస్తాం**
**ఆనందం (2)**
**నీ కంకణ నిక్వాణంలో నా జీవన నిర్వాణంలో**
**నీ మదిలో డోలలు తూగి నా హృదిలో జ్వాలలు రేగి...**
**నీ తలపున రేకులు పూస్తే నా వలపున బాకులు దూస్తే (2)**
**మరణానికి ప్రాణం పోస్తాం స్వర్గానికి నిచ్చెన వేస్తాం (2) ॥ఆనందం॥**
**ఆ....**
**హసనానికి రాణివి నీవై వ్యసనానికి బానిస నేనై**
**విషమించిన మదీయ ఖేదం కుసుమించిన త్వదీయమోదం**
**ఆ....**
**విషవాయువులై ప్రసరిస్తే విరితేనియలై ప్రవహిస్తే (2)**
**ప్రపంచమును పరిహాసిస్తాం భవిష్యమును పరిపాలిస్తాం (2)॥ఆనందం॥**










శ్రీశ్రీ 'మహాప్రస్థానం'లోని 'ఆనందం అర్ణవమైతే' గేయాన్ని ఈ చిత్రం కోసం పాటగా మలుచుకున్నారు. సుశీల పాడిన ఈ పాటను సావిత్రి ప్రధాన పాత్రధారిణిగా అభినయించింది. శంకరాభరణంలోని స్వరాలను స్కేలుగా తీసుకొని అక్కడక్కడ ప్రతిమధ్యమాన్ని (మ అనే స్వరంలో) కైశిక నిషాదాన్ని (ని అనే స్వరంలో) కూడా ఉపయోగిస్తూ పాటను స్వరపరిచారు ఘంటసాల. గేయాన్ని గీతంగా మలచటంలో కొన్ని ఇబ్బందులున్నాయి. అందులోని బహుళ ప్రచారంలో వున్న గేయమైతే అవి ఇంకా జటిలం అవుతాయి. వాటిన్నిటినీ ఘంటసాల ఎలా అధిగమించారో ఈ ట్యూన్‌ని నాలుగైదు సార్లు వింటే తెలుస్తుంది. ఇదొక ఎత్తు ఖంగుమంటూ మ్రోగే సుశీల గొంతులోని ఫ్రెష్‌నెస్ ఒక ఎత్తు.

చిటారు కొమ్మనూ...
చిటారుకొమ్మను మిఠాయి పొట్లం చేతి కందదేం గురుడా
వాటం చూసి వడుపు చేసి వంచర కొమ్మను నరుడా॥వాటం॥ ॥చిటారు॥
పక్కన మెలగే చక్కని చుక్కకు
చక్కలిగింత లేదేం నరుడా ॥ఆ పక్కన॥
కంచు మోగక కనకం మోగదు
నిదానించరా నరుడా ॥కంచు॥
వాటం చూసి వడుపుచేసి
వంచర కొమ్మను నరుడా ॥చిటారు॥
పండంటి పిల్లకు పసుపు కుంకం
నిండుకున్నదేం గురుడా ॥పండంటి॥
దేవుడు చేసిన లోపాన్ని
నువ్వు దిద్దుకు రారా నరుడా ॥దేవుడు॥
కొద్దిగ హద్దుమీరరా నరుడా ॥చిటారు॥
విధవలందరికి శుభకార్యాలు
విధిగా చెయ్‌మంటావా గురుడా
విధిగా చెయ్ మంటావా ॥విధవ॥
అవతారం నీదందుకోసమే... ॥అవతారం॥
ఆరంభించర నరుడా
వాటం చూసి వడుపుచేసి
వంచర కొమ్మను నరుడా ॥చిటారు॥



'కన్యాశుల్కం' కథ పల్లెటూరి వాతావరణంలో ఎక్కువగా జరుగుతుంది కనుక పల్లెపట్టు ప్రాంతంలో తరచు వినిపించే రాగం అయితే బావుంటుందన్న ఆలోచన ఈ పాట స్వరరచనలో కనిపిస్తుంది. సాధారణంగా పల్లె ప్రాంతాల గీతాల్లోనూ తత్త్వ గీతాలలోనూ హరి కాంభోజి రాగాన్ని, యదుకుల కాంభోజి రాగాన్ని ఉపయోగించడం జరుగుతూ ఉంటుంది. ఈ పాటకు సంబంధించి యదుకుల కాంభోజి రాగచ్ఛాయలే ఎక్కువగా ఉన్నాయని చెప్పొచ్చు. ఆ రాగాన్ని ఈ ధోరణిలో ఘంటసాల తరువాతి రోజుల్లో చాలాసార్లు ఉపయోగించారు. మాయాబజార్ (1957) చిత్రంలో 'దయచేయండి దయచేయండి' పాటని, 'జయం మనదే' (1956) చిత్రంలో 'చిలకన్న చిలకవే బంగారు చిలకవే' పాటని, ఒక్కసారి గుర్తుకు తెచ్చుకుని ఆలపించుకోండి - ఆ తరువాత ఆ పాటల ఎత్తుగడ, ఈ పాట ప్రారంభం అవటానికి ముందు వచ్చే వాద్య సంగీతంతో పోల్చుకోండి. మూడు పాటలూ ఎంత దగ్గరగా ఉన్నాయో గమనించవచ్చు.

ఇక గాయకుడిగా ఘంటసాల చేసే పరకాయ ప్రవేశంగురించి ప్రత్యేకించి చెప్పనక్కరలేక పోయినా కొన్నిటిని పునశ్చరణ చేసుకుంటే మన సంస్కారం మరింత మెరుగుపడుతుంది. గిరీశం పాత్రను గురజాడ అప్పారావు గారు అప్పటి దేశకాలమాన పరిస్థితులకు అనుగుణంగా, వ్యంగ్య ధోరణిలో సృష్టించారు. ఆ పాత్రకుండే కొన్ని బలహీనతలు, వాటిని అతి చమత్కారంగా సమర్ధించుకోగలిగిన మేధో సంపద, వాటన్నిటికి తోడుగా వయసు హుషారు - ఇవన్నీ గాయకుడి గళంలో కూడా ప్రతిఫలించాలి. అప్పుడే లోపభూయిష్టమైన కొన్ని కట్టుబాట్లను తమ స్వార్థం కోసం అతిక్రమించమంటూ ప్రవచించే ఇటువంటి పాటలకు అంతులేని ఆదరణ లభిస్తుంది. పాత్ర స్వభావంతో పాటు పూర్వాపరాలను కూడా పూర్తిగా ఆకళింపు చేసుకున్న వ్యక్తి కావటంచేత ఘంటసాల వాటన్నిటినీ సంగీత దర్శకుడిగానే కాకుండా గాయకుడుగా కూడా సంపూర్ణ న్యాయంతో ప్రతిఫలించేట్టు చూసుకున్నారీ పాటలో. కావాలంటే గిరీశం పాత్ర స్వభావం గురించి మీలో మీరు తర్కించుకుని ఈ పాటను విని చూడండి. ఘంటసాల చేసిన ప్రాణ ప్రతిష్ట ఎటువంటిదో తెలుస్తుంది.

పైన ఉదహరించిన ప్రాణప్రతిష్ట జరగడానికి అవసరమయ్యే జీవాన్ని, చైతన్యాన్ని తన అక్షరాల ద్వారా మల్లాది రామకృష్ణశాస్త్రిగారు సంక్రమించేట్టు చేశారని చెప్పాలి సాధారణంగా మల్లాది రామకృష్ణ శాస్త్రిగారి రచనలు మేధోవర్గానికి పట్టినంత త్వరగా పాటకజనానికి పట్టవు. కానీ ఈ పాటకి సంబంధించినంతవరకు మాత్రం ప్రతి పదానికి అర్థం తెలియకపోయినా, విశ్లేషించుకోవటం తెలియకపోయినా తమకు కావలసినదేదో పూర్తిగా లభించినంతగా ఆ వర్గంవారు కూడా సంతోషించారు. కన్యాశుల్కం నాటకంలో ఒకచోట గిరీశం అంటాడు - భగవంతుడు నాకు ప్రత్యక్షమైతే... నువ్వు నన్ను డిపెండెంటుగా పుట్టించావా, ఇండిపెండెంటుగా పుట్టించావా అని అడుగుతాను డిపెండెంటుగా పుట్టించానంటాడనుకో- మరింకేం... నేనేం చేసినా నువ్వు చేయిస్తున్నట్టే లెక్క అంటాను. ఇండిపెండెంట్‌గా పుట్టించాడనుకో అయితే నా ఇష్టం వచ్చినట్టు చేసుకుంటా నువ్వెవడివి అడగడానికి అంటాను. ఇదిగో అలా ఉంటుంది గిరీశం ధోరణి! మరి అలాంటి వాడు కనుకనే - కంచు మోగక కనకం మోగదు (పూర్వాశ్రమంలో సంబంధం ఉన్న ఆడవాళ్ళలా బుచ్చెమ్మ అంత త్వరగా పడదుగా మరి) నిదానించరా నరుడా అని తనకి తాను సర్ది చెప్పుకోగలడు, దేవుడు చేసిన లోపాన్ని నువ్వు దిద్దుకురారా నరుడా అంటూ సమర్థనీయంగా 'అహంభావించగలడు', కొద్దిగ హద్దు మీరరా నరుడా అంటూ రెచ్చి పోడానికి రంగం సిద్ధం చేసుకోగలడు. విధవలకు శుభకార్యాలను విధిగా చెయ్యడం కోసమే ఈ అవతారం కనుక షురూగురూ అంటూ తన వాదనకు తగ్గ సామాగ్రిని సమగ్రంగా సిద్ధం చేసేసుకోగలడు. అటువంటి గిరీశాన్ని యథాతథంగా, అక్షరాలా- స అక్షరాత్కరింప' చేశారు మల్లాది రామకృష్ణశాస్త్రి ఈ పాట ద్వారా.

నిర్మాతకి, దర్శకుడికి, రచయితకి, సంగీత దర్శకుడికి, గాయనీగాయకులకి, నటీనటులకి పాత్ర(ల) పట్ల అంతటి అవగాహన ఉండేది ఆ రోజుల్లో. అందుకు అవసరమయ్యే హోమ్‌వర్క్ కూడా ఎవరికి వారు చేసుకునేవారు. అవసరమైతే చర్చించేవారు. అందుకే ఈనాటికీ ఆ పాటలను మరీ మరీ తలచుకుంటున్నాం.




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం చేసిన
రచయిత, జర్నలిస్టు, నటుడు

**రావికొండలరావు**

రాసిన వ్యాసమిది



# అందరికీ మైత్రేయ ఆచార్య ఆత్రేయ

అసలు పేరు
కిళాంబి వేంకట
నరసింహాచార్యులు.
పేరు తెచ్చిన పేరు
ఆచార్య ఆత్రేయ.
పన్నిన పేర్లు
రాత్రేయ, బూత్రేయ.

గోత్రనామాన్నే నామం చేసుకుని ఆత్రేయ ఐ, పేరు చివరలోని ఆచార్యని తీసి ముందుకు కలిపి 'ప్రొఫెసరా' అన్న భ్రాంతిని కల్పించిన రచయిత. మాటల్ని మార్చడంలో, పేర్చడంలో పేరుతోనే ఆరంభమైంది! ఆయన రచయితే గాని, రాయడం రాదు! రాదంటే, రాసిన పాపాన పోలేదు - డిక్టేట్ చెయ్యడమే. అది కూడా అదో తంతు. రాత్రి భోంచేసిన వెంటనే తనూ, వ్రాయసకాడు ఎవరైతే అతనూ - పడుకుని నిద్రపోవడం. రెండు గంటల వేళకి అలారంతో లేచి, తెల్లవారే వరకూ రాత. అర్ధరాత్రిలో లేచి ఆలోచిస్తారు, రాయిస్తారు గనక, అర్ధరాత్రీయ లేదా, రాత్రేయ అన్నారు. కొన్ని సినిమాల్లో బూతులు ధ్వనించే లాంటి (ఇన్‌డైరెక్ట్) మాటలు, పాటలూ రాయడంతో బూత్రేయ అన్నారు. ఏమన్నా, ఎవరేమన్నా ఏమీ పట్టించుకోని మనిషి. అంతటి 'స్పోర్టివ్'ని ఇంకొకర్ని చూడం.

1957లో నేను 'ఆనందవాణి'లో వెలిగిస్తున్నాను. సరిగా పత్రికా రాదు. జీతమూ లేదు. ఆత్రేయ గారికి అసిస్టెంటు అవసర ముంటుందని విని, ఆయన దగ్గరికి వెళ్లాను. నేను ఫలానా అని చెప్పాను. కథలు రాస్తానసీ, 'కుక్కపిల్ల దొరికింది' నాటిక రాస్తే 'భారతి'లో పడిందనీ ఇంకా ఏవేవో గొప్పలు చెప్పుకున్నాను.



ఆ నాటిక ఆయన చదివారట! "అది మీ సొంతమేనా? ఇంగ్లీషు మూలం ఏదైనా వుందా?" అని అడిగారు. సొంతమే అన్నాను. "అలా చెప్పకండి. ఎవరూ మెచ్చుకోరు. కాపీ కొట్టానని చెప్పండి - 'అదీ - అందుకే బావుంది' అంటారు" అని నాకు లౌక్యపాఠం చెప్పడంతో ఆరంభమైంది సంభాషణ. మదిలోని కోరిక విన్నవించాను. "నా దగ్గర అసిస్టెంట్లుండరండి. నేనే అసిస్టెంటుని. ఎంచేతంటే ప్రొడ్యూసర్లు చెప్పిందే రాస్తున్నాను. వాళ్లే అసలు రచయితలు" అని చమత్కార బాణం విసిరారు. తను రాస్తున్న కంపెనీ వాళ్లే వాళ్ల అసిస్టెంటుని పంపుతారనీ తనకుగా ఎవరూ వుండరనీ తర్వాత వివరించారు. మాటని విరిచి, విడమరిచి రాయడం ఆయన సొత్తయినట్టు - మాటాడినప్పుడు కూడా మాట విరవడం, చమత్కరించడం రెండూ ఆయన సొత్తు. హాస్యం అంటే ఆయనకి ఇష్టం. అంతటి చమత్కారికీ హాస్యం రాయడం రాదనడం మాత్రం హాస్యం కాదు. "ఎందుకో హాస్యం కుదరదు. అందుకనే నేను స్క్రిప్టులు రాసిన కొన్ని సినిమాలకి హాస్యదృశ్యాలు వేరే వాళ్ల చేత రాయిస్తారు" అని చెప్పారోసారి ఆత్రేయ.

"నేను తొందరగా రాయననీ, బద్ధకం అనీ అంటారు. బద్ధకం కాదు. ఆలోచన. అది ఎప్పుడు కుదిరితే అప్పుడు రాస్తాను" అని చెప్పేవారు. అందుకే ఓ సామెతలాంటి ముతక మాట పుట్టింది. "రాయక నిర్మాతల్నీ రాసి ప్రేక్షకుల్ని ఏడిపిస్తాడు" అని. ఓ సారి వాళ్లింట్లో వున్న చిన్న అమ్మాయి స్కూలుకి లీవు లెటరు రాసి ఇమ్మంది. "నీకు లీవు లెటరు రాయగలిగితే, ఆ టైములో రెండు సీన్లు రాయనూ!" అన్న రచయిత ఆయన. 'వాగ్దానం' సినిమాకి ఆయనే డైరెక్టరు, రచయితా. పాత్రధారులు సెట్టుమీదకి వచ్చి కూచునే వారు. సీను రెడీ కాదు. అప్పుడే ఆయన వేసిన జోకు. "ఆత్రేయ బద్ధకిష్టి. రాయడం కాస్టలీ కూడా. అనవసరంగా అతన్ని పెట్టుకున్నాను. నన్నే ఏడిపిస్తున్నాడు!"

ఆ సినిమా అయిన తర్వాత - "ఒక పాఠం నేర్చుకున్నాను. రైటరే డైరక్టరు, డైరక్టరే రైటవరడం సరికాదని. చేస్తున్న వాళ్లు చేస్తున్నారు. సమర్థులు" అని చెప్పారు ఆత్రేయ. ఆయన సరస్వతీపుత్రుడే గాని, లక్ష్మీపుత్రుడు కాదు. సంపాయించాడు - నిజమే. కాని, ఏదీ చేతిలో వుండేది కాదు. పొద్దున్న పదివేల రూపాయలొస్తే సాయంకాలానికి ఖాళీ! అదేం ఖర్చో! పెద్ద కంపెనీల్లో అయితే, పాట రాయక ముందే డబ్బు తీసుకునేవారు. డబ్బు ఖర్చు పెట్టడంలో ఎంతటి ఘనుడో, పుచ్చు కోవడంలోనూ అంతటి ఘనుడు. లక్ష్మీప్రొడక్షన్స్ (యల్.వి.ప్రసాద్‌గారిది)లో పాట రాసిన మర్నాడే డబ్బు అడిగారు ఆత్రేయ. ఆ రోజు శుక్రవారం. శుక్రవారం నాడు గిజామన్నా, ఆ కంపెనీ నుంచి పైసా రాదు. రూపాయి కూడా ఎవరికీ ఇవ్వరు!.

కాని ఆత్రేయగారు గట్టివాడు. ఎలా అడిగాడో ఎలా పుచ్చుకున్నాడో గాని మొత్తానికి శుక్రవారం నాడు డబ్బు పుచ్చుకున్నాడు! రికార్డ్ బ్రేక్!" అని కంపెనీ వాళ్లు విడ్డూరంగా చెప్పుకున్నారు. "ఇవ్వగలిగే వాళ్లు కాబట్టి నేను వసూలు చెయ్యగలిగాను గాని, నాకు ఇవ్వకుండా ఎగవేసిన వాళ్లు వున్నారు" అని చెప్పిన ఆత్రేయ. "ఏ రోజుకు ఎంతకావాలో తెచ్చుకో. రేపటికి దాచుకోవద్దు" అన్న సిద్ధాంతాన్ని నమ్ముకున్నారు. ఆయనే చెప్పుకున్నట్టు - "నా జీవితమూ ఆ బాటలోనే నడిచింది".

కొన్నేళ్ల క్రితం, తానే, ఒక మిత్రుడి ప్రోత్సాహంతో 'చిన్నారి మనసులు' చిత్రం తియ్యాలని ప్లాన్ చేశారు. బాలల కథ. తానే డైరెక్టరు. ఆయన బాగా బిజీగా వుండే రోజులు. నన్నూ, కె.వి.రావు గారినీ (స్వామి చిత్రానంద) సహాయకులుగా పని చెయ్యమన్నారు. తాను అనుకున్న కథని - నాలుగు ముక్కల్లో చెప్పారు. "దీనిమీద మీరు ఆలోచించండి. ఓ కథగా తయారు చెయ్యండి. వారం రోజులు తర్వాత, ఎలా ఆలోచించారో చెప్పండి విందాం. నాలాగా కాదు, తొందరగా జరగాలి మరి" అని అడావుడి చేసి వెళ్లారు. మేము ఆయన ఇంట్లోనే ఆయన రూములో (గేటుకి ఎదురుగా వుండే కారు షెడ్డునే ఆయన రూముగా మార్చుకున్నారు) కథ మీద కుస్తీ పట్టే వాళ్లం. ఒక రోజు సీరియస్‌గా వచ్చి "సీరియస్‌గా డిస్కస్ చేస్తున్నారన్నమాట! అడ్వాన్సు అడగరేం?" అని అడిగారు. "అడుగుతాం. ఎందుకడగం?" అన్నాం. "రేపు మంచిరోజు" అని వెళ్లిపోయారు. మర్నాడు కనిపించనేలేదు. ఆ మర్నాడు కనిపించారు - "నిన్న మంచిరోజు కాదు. ఎంచేతంటే డబ్బు పెడతానన్న వాడు రాలేదు. 'రేపు' అని గోడ మీద రాసుకుని రోజూ చూసుకుందాం" అని జోక్ చేశారు. ఓ నెల రోజులు దాటింది. మేము తయారు చేసింది చెప్పాం - విన్నారు. "అలా వుండనీయండి. పెట్టుబడిదారు వచ్చిన తర్వాత, అడ్వాన్సులు తీసుకుందాం. అంచేత 'రేపు' కొట్టేసి, 'ఎప్పుడో' అని రాయండి గోడ మీద" అని మెత్తగా నవ్వేశారు. అప్పుడా సినిమా సాగలేదు. కొన్నేళ్ల తర్వాత దాన్నే మార్పులూ, చేర్పులూ చేసి "పిల్లలతో చెలగాటం - పెద్దలకే ఇరకాటం" అని దూరదర్శన్‌కి సీరియల్‌గా తీశారు - 13 భాగాలు. అందులో నా భార్య రాధాకుమారి వేసింది. పెట్టుబడి ఆయనది కాదు - వేరే ఎవరో. కొన్నాళ్లయిన తర్వాత, మా ఆవిడ డబ్బు అడిగింది - షూటింగ్‌లో. "అమ్మా - అతగాడు ఇదిగో అదిగో అంటున్నాడు. నేనిద్దామంటే, నాచేత ఎవరూ పాటలు రాయించుకోవడం లేదు. నువ్వే ఎవరికైనా చెప్పి నాచేత పాట రాయించేలా చెయ్యి, ఆ డబ్బు తీసుకుని నీకూ, తక్కిన వాళ్లకీ పంచుతాను" అని 'జోక్'లాగా చెప్పారుట. అందరికీ నవ్వూ, ఆశ్చర్యమూ.

చివరి దశలో, అంత పెద్ద ఇల్లూ పోయి, చిన్న గదుల ఓ మేడ మీద వుండే వారు. ఇంట్లో ప్రవేశించగానే చిన్నమంచం, దాని మీద ఆయనా "ఇది తొలిదశ. మనిషి పుట్టినప్పుడు ఎలా పుడతాడో, గిట్టినప్పుడు అలాగే వుంటాడు. పుట్టినట్టు తెలీనట్టు, పోయినప్పుడూ తెలీదు. అంచేత, చివరిదశ కూడా తొలిదశగా మారడంలో ఆశ్చర్యం లేదు" అని చెప్పారా వేదాంతి నవ్వుతూనే. అందరికీ ఆయన ఆత్రేయ అయినా, పి.పుల్లయ్యగారు మాత్రం "మహర్షీ" అని పిలిచేవారు. సార్థకం చేసుకున్నారనిపిస్తుంది. "సేను రాస్తే ఆత్రేయే రాయాలి" అనిపించుకున్న ఆ మెత్తని మనసు అందరికీ మంచి మైత్రేయ!

## ఆత్రేయ మాట - చిన్నారి నోట

"మధుర రసేషు దీర్ఘ-
సమాసం ఝుమ్ఘటిత
సంయోగ పర హ్రస్వస్య -
అసకృత్ ప్రయోగం
నైకట్యేన వర్జయత్" (జగన్నాథ పండిత రాయలు - రసగంగాధరం)

శృంగార రసరచనలో దీర్ఘ సమాసాలు - పదాడంబరాలు ఉండకూడదు. దానికి నిరూపణగా ఆత్రేయ "ముక్కుకు ముక్కెర అందం - అది ముద్దుకు (ముచ్చటకు) ప్రతిబంధం" (చల్లని సామివి నీవైతే పాట - వీరాభిమన్యు సినిమా) అని తొలగిస్తారు. అది శృంగారానికే పరిమితం కానక్కరలేదు. పసి మనసులను - వారి పనులను ఆట పాటలను వర్ణించేటప్పుడు కూడా లలిత లలిత పదాలు, చక్కని సందేశాత్మకమైన తీరు, సూటిగా గుండెను తాకగలంత స్ఫూర్తి ఉండేటట్లు చేయడం ఆత్రేయ ప్రత్యేకత.

'ఆలుమగలు' సినిమాలో పిల్లలకు నటి జానకి గణితం చెప్పే సన్నివేశంలో..

"ఒకటి ఒకటి... ఒకటి - మానవులంతా ఒకటి

రెండు రెండు - రెండు - మంచి వాళ్ళని చెడ్డవాళ్ళని మనలో జాతులు రెండు, మూడు - మూడు - మూడు, మూఢుల స్నేహం వీడు" ఇలా నాలుగు - నలుగురి సుఖమూ చూడు, అయిదు - అయిదు వేళ్ళ వలె మెలగు... పది - పదుగురి మేలు కోరు" అని లెక్కల్లో సూక్తులు చెప్పారు ఆత్రేయ. అలాగే ఆదర్శ కుటుంబం సినిమాలోని కాళ్ళగజ్జ కంకాళమ్మ' పాటలో,

కాళ్ళగజ్జ కంకాళమ్మ - వేగుచుక్క వెలగ మొగ్గ

ముత్యం బియ్యం మునగచారు - ముత్యాల్లాంటి పిల్లలు మీరు.

కూడదు కూడదు మీలో పోరు - అంటూ ఐకమత్యం గురించి చెప్తూ "పప్పు బెల్లం వలనె తియ్యగ - పలకా బలపం వలెనె జతగ, పిల్లలు పరస్పర పూరకాలుగా ఉండాలంటారు.

'బడిపంతులు' సినిమాలో బేబీశ్రీదేవి తన నాయనమ్మకు టెలిఫోన్ గురించే చెప్పే "బూచాడమ్మ బూచాడు బుల్లిపెట్టెలో ఉన్నాడు" పాటలో "రష్యా - అమెరికా - జపాన్" దేశాల మైత్రిని కలుపుతూ జాతీరీతి ఒకే 'తీగ'పై నడవాలని అంటారు. అదే సినిమాలో "భారత మాతకు జేజేలు" అనే ప్రార్థనా గీతం "ఈ పిల్లలమూ - బడి పిల్లలము" అంటూ చెమటతో తడిపి ఇంటిని కట్టి గురువుకి యిచ్చేసన్నివేశం ఆత్రేయ రచనంత అందంగా ఉంటాయి.

అభిమన్యుడు సినిమాలో "ఆకేసి పప్పేసి - నెయ్యేసి, బువ్వేసి - నీకో ముద్దా - నాకో ముద్దా" అంటూ ప్రేయసీ ప్రియుల మీద రాసిన ఆ పాట వెనుక పసిపిల్లల మనస్సు తొంగి చూస్తుంది.

దాగుడు మూతా దండాకోర్ - పిల్లీ వచ్చే ఎలుకాకోర్ (బండరాముడు) దొంగను వేటాడే రాజు పాటలో పిల్లల దొంగాట ప్రభావం కనిపిస్తుంది.

ఆత్రేయ రచనను ఏ కోణంలో చూసినా ఓ వైవిధ్యమైన అందం తొణికిసలాడుతుంది. ఆయన వర్ధంతి సందర్భంగా "జాతస్యహి-ధ్రువోమృత్యుః" అనే గీతా వాక్యాన్ని అనుకుంటే అందులో కూడా

"పోయినోళ్ళందరూ మంచోళ్ళూ

ఉన్నోళ్ళూ పోయినోళ్ళ తీపిగురుతులు (మూగమనసులు)

"రారయ్యాపోయినోళ్ళు - ఎవరయ్యా ఉండే వాళ్ళు

నవ్వుమరిచి నన్ను మరిచి ఎందుకు కన్నీళ్ళు - ఇలా ఎన్నాళ్ళూ (గాజులకిష్టయ్య) అంటూ ఆత్రేయ మాట వినిపిస్తుంది.

-గాదె రంగనాయకమ్మ,
జంగారెడ్డిగూడెం.

మే 7 ఆత్రేయ జయంతి సందర్భంగా

# చిరస్మరణీయుడు, స్వరస్మరణీయుడు, తెరస్మరణీయుడు

# ఆత్రేయ



**తెలుగు సినీ సాహిత్య చరిత్రలో భావాన్ని ప్రేక్షకుడి మనసుకి సూటిగా తాకేట్టు చేయడంలో ఆత్రేయ స్థానం అనితర సాధ్యం. భాష చేత భావాలకు ఆయన ఎప్పుడూ వెట్టిచాకిరీ చేయించుకోలేదు. అయినా పదాలు ఆయన చేతిలో అతి అందంగా అమరిపోయాయి, ఒదిగిపోయాయి. ఒదుగు, ఒడుపు, జిగి జిలుగులతో అతి చాకచక్యంగా పట్టుకోవడంలోనూ, ఆకట్టుకోవడంలోనూ ఆయన సిద్ధహస్తుడే కాదు, ప్రసిద్ధ హస్తుడు కూడా.**

ముఖ్యంగా మనిషి, మనసు, మమత, దేవుడు, విధి మీద రకరకాల ప్రయోగాలతో ఆత్రేయ రాసినన్ని పాటలు మరొకరు రాయలేదు.

మచ్చుకి-

పశువుల కన్నా పక్షుల కన్నా మనిషిని మిన్నగ చేశాడు.
బుద్ధిని ఇచ్చి హృదయాన్నిచ్చి భూమే నీదని పంపాడు.
బుద్ధికి హృదయం లేక హృదయానికి బుద్ధే రాక
నరుడే ఈ లోకం నరకం చేశాడు.
(దేవుడనేవాడున్నాడా - 'దాగుడుమూతలు')

మహాత్ములైనా దురాత్ములైనా మనుజుల పేరనే మసలేరయ్యా.
అందరికీ నీ అభయం కలదని అనుకోమందువా దేవా
(వెలుగుచూపవయ్యా - 'వాగ్దానం')

మనిషిని దైవానికి ఏనాటి నుంచో వైరము
వీడి కోరికవాడు తీర్చడు వాడి దారికి వీడు వెళ్ళడు
(మనసులేని దేవుడు - 'ప్రేమలు-పెళ్ళిళ్ళు')

ఒకిడి ఆకలికి అంబలి నీళ్ళు ఒకరికి పాలు పళ్ళు
భలేభలేరా దగాల దేవుడ బాగా పంచేవు
కోతికి బాబనిపించేవు ఓ బ్రహ్మయ్య
నీ లీలలే గడబిడ ఎడపెడ నీ గడాబిడా మా కెడాపెడా
(ఓ బుచ్చిబాబు - 'నాటకాల రాయుడు')

ఇక మనుషుల తత్వాల గురించి:

తాము నవ్వుతూ నవ్విస్తారు కొందరు అందరినీ
తామేడుస్తూ ఏడ్పించుతారెందరో కొందరినీ
(దేవుడునే వాడున్నాడా - 'దాగుడుమూతలు')

మాటలలో చిక్కుపడి మనసు నలిగిపోతుంది
మనసులేని మాటలనే మనం నమ్ముతున్నది
పలుకలేని ప్రతిగుండె బాధతో నిండినది
ఒలికే ప్రతి కన్నీటికి చుక్క వెచ్చగా ఉంటుంది
(బ్రతుకు పూలబాట కాదు - 'భార్యాబిడ్డలు')

ఎదుటి మనిషికి చెప్పేటందుకే నీతులు ఉన్నాయి
(నేను పుట్టాను - 'ప్రేమ్‌నగర్')

మంచివాడికి, చెడ్డవాడికి తేడా ఒకటే బాబూ
మంచివాడు మనసున అనుకుంటాడు చెడ్డవాడు చేసే చూస్తాడు
(మనిషి మనిషికి తేడా ఉంది - 'పాపకోసం')

ఇక మనసు గురించి ఆత్రేయ మధన పడ్డంతగా మరొకరు కనిపించరు మనకి. ఒకటా.... రెండా.... ఎన్నో.... ఎన్నెన్నో... ఒక్క క్షణం మనసుకి మాటలు తడితే జలజలా జాలువారిపోతాయి ఆయన పాటలు.

ఒకరికిస్తే మరలిరాదు, ఓడిపోతే మరచిపోదు.
గాయమైతే మాసిపోదు, పగిలిపోతే అతుకుపడదు.
(మనసుగతి ఇంతే - 'ప్రేమ్‌నగర్')

ఊహల ఉయ్యాలవే మనసా, మాయల దయ్యానివే
లేనిది కోరేవు, ఉన్నది వదిలేవు
ఒక పొరపాటుకు యుగములు పొగిలేవు
(మౌనమే నీ భాష - 'గుప్పెడు మనసు')

వలచుట తెలిపిన నా మనసునకు
మరచుట మాత్రము తెలియనిదా
మనసిచ్చినదే నిజమైతే
మన్నించుటయే ఋజువు కదా
(నీ సుఖమే నే కోరుతున్నా - 'మురళీకృష్ణ')

కన్ను నీదని, వేలు నీదని పొడుచుకుంటే రాదా రక్తం
రక్తమెంతగా ధారపోసినా దొరుకుతుందా మళ్ళీ హృదయం
(మనసులేని బ్రతుకొక నరకం - 'సెక్రటరీ')

వయసు కోతి వంటిదీ మనసుకొమ్మ వంటిదీ
ఊపేసి పోతుంది మొదటిదీ,
ఆ ఊపు మరువనంటుంది రెండవది
(వయసు కోతి వంటిదీ - 'అగ్నిపూలు')

తనువుకు ప్రాణం కాపలా - మనిషికి మనసే కాపలా
ఎవరి ప్రేమకు నోచని నాడు కన్నీరేరా నీకు కాపలా
(ఎవరికి ఎవరు కాపలా - 'ఇంటికి దీపం ఇల్లాలే')

మనిషికి మనిషికి మమత కూడదా
మనసు తెలుసుకొను మనసే లేదా
(ఎవరో జ్వాలను రగిలించారు - 'డాక్టర్ చక్రవర్తి')
మనసు మూగదే కానీ బాసుంటది దానికి
చెవులుండే మనసుకే ఇనిపిస్తుందా ఇదీ
(ముద్దబంతిపూవులో - 'మూగమనసులు')
మడిసితోటి ఏలాకోలం ఆడుకుంటే బాగుంటాది
మనసుతోటి ఆడకు మావా ఇరిగిపోతే అతకదు మల్లా
(మాను మాకును కాను - 'మూగమనసులు')
వయసు పెరిగినా మనిషి ఎదిగినా
మనసు ముదరనంత వరకు మాసిపోదు పసితనం
(వయసు పెరిగినా - 'ప్రాణమిత్రులు')
ఒడ్డున పెరిగే గడ్డిపోచకు హృదయం ఎందుకు ఉండకూడదు
ఉందని ఎందుకు ఒప్పుకోరాదూ
మోడు కూడా చిగురించాలని మూగమనసు కోరే కోర్కెను
మోసం ద్రోహం అనడం అన్యాయం
(అటు ఇటు కాని - 'ఇది కథకాదు')

విధి, సమాజం, ఖర్మ, బలహీనతలు వీటి పోకడల మీద ఆత్రేయ ఎన్నో విసుర్లు విసిరాడు. ఒక్కోసారి విరుచుకు పడ్డాడు. మరోసారి విజ్ఞత తెలియ జెప్పాడు. అయితే ప్రతి సారీ బాధ్యతను గుర్తుచేశాడు. ఎలా అంటే-

కడుపు కాలే కష్టజీవులు ఒడలు విరిచీ
గనులూ తొలిచీ చెమట చలువను చేర్చిరాళ్ళను తీర్చినారు తెలుసుకో.
(కారులో షికారుకెళ్ళే - 'తోడికోడళ్ళు')
అనుకున్నామని జరగవు అన్నీ, అనుకోలేదని ఆగవు కొన్ని
జరిగేవన్నీ మంచికని అనుకోవడమే మనిషి పని
(నీ సుఖమే నేను కోరుతున్నా - 'మురళీకృష్ణ')
ఇరవైలో అరవై వయసు ఎవరికైనా వచ్చేనా?
(సిగలోకి విరులిచ్చి - 'సుమంగళి')
కళాజీవితం లక్కు ఒక ట్రిక్కు
ఒకరికి లక్కు ఒకరికి ట్రిక్కు
(ఓ బుచ్చిబాబు - 'నాటకాల రాయుడు')
తప్పు నాది కాదంటే లోకమొప్పుతుందా నిప్పులాంటి సీతనైన తప్పు చెప్పకుందా
(రాయిని ఆడది చేసిన - 'త్రిశూలం')
ఈ పుణ్యభూమిలో పుట్టడం మన తప్పా ఆవేశం ఆపుకోని అమ్మానాన్నదే తప్పా
(సాపాటు ఎటూ లేదు - 'ఆకలిరాజ్యం')
పిచ్చిపిచ్చిపిచ్చి రకరకాల పిచ్చి
ఏ పిచ్చీ లేదనుకుంటే అది అచ్చమైన పిచ్చి
(పిచ్చిపిచ్చిపిచ్చి - 'విచిత్ర వివాహం')
రాతి అందాలన్నీ నాతిలో చెక్కి
తీరని కోర్కెలే తీర్చుకున్నాడేమో
(ఆనాటి మానవుడు - 'సుమంగళి')
ప్రేమనేది ఉన్నదా
అది మానవులకే ఉన్నదా
హృదయముంటే తప్పదా
అది బ్రతుకు కన్నా గొప్పదా
(మనసులేని దేవుడు - 'ప్రేమలు -పెళ్ళిళ్ళు')
కర్మను నమ్మినవారెవరూ కలిమిని స్థిరమనుకోరు, కళ్ళు మూసుకోరు.
కావాలని నిప్పు తాకితే చేయి కాలక మానదు
అలా కాలినందుకు ఖర్మే అంటే గాయమేమీ మానదు.
(కనబడని చెయ్యి ఏదో 'తాశిల్దారుగారమ్మాయి')



ప్రేమ, పెళ్ళి, రెండు హృదయాల పరస్పర స్పందనపై - ఆత్రేయ అందించిన అనుభూతి తల్చుకున్నప్పుడల్లా మనసు అట్టడుగు అంచులు కూడా పులకరించిపోతాయి.

నీ వలపు వాన కురిసి కురిసి తడిసి పోనీ
తడియారని హృదిలో నను మొలకలెత్తనీ
(తెల్లవారనీకు ఈ రేయినీ - 'ఆత్మబలం')
జగతిని ఉన్నది మనమిద్దరమే అనుకొని హత్తుకుపోతుంటే
(చిటపటచినుకులు - 'ఆత్మబలం')
పెమిదను తెచ్చి ఒత్తిని యేసి చమురును పోసి బెమసూసేవా
ఇంతాచేసి ఎలిగించేందుకు ఎనక ముందూలాడేవా
(మాను మాకును కాను - 'మూగ మనసులు')
నన్నిడిచి నువ్వెళితె నీ వెంట నేనుంట
నిన్నిడిచి నే వెళితె నువ్వ బ్రతకలేవంట
ఇది నీగొప్పా నాగొప్పా కాదు పిల్లోడా
ప్రేమంటే అంతేరా పిచ్చివాడా
(ఎక్కడికి పోతావు చిన్నవాడా - 'ఆత్మబలం')

ఇక పడుచుదనం, కుర్రతనం మీద ఆత్రేయ పంచకళ్యాణి గుర్రంలా ఎంతగా కదనుతొక్కిందీ, ఎంతగా పదునుచూపిందీ, ఎంతమందిని వెర్రెక్కించిందీ చెప్పాలంటే ఆ ఉదాహరణలు కోకొల్లలు.

దోరవయసు, అలవికాని భారమయింది.
ఆ బరువు మోయలేక నడుము పలచబడింది.
(మిడిసి పడకు అత్తకూతురా - 'ఆస్తిపరులు')
బిగదీయకు బిగదీయకు పైట కొంగును
ఎంత బిగదీస్తే బిగువులన్నీ బైటపడేను
(ఓహోహో వయ్యారి - 'సుపుత్రుడు')
పడుచు పిల్ల పయ్యెదలా పలుచని వెలుగే పరిచినదీ
కొండల కోనల వలుపుల్లో కొత్తవంపులే చూపినదీ
(ఈ ఉదయం నా హృదయం-'కన్నెమనసులు')
ఎవరో చెపితే విన్నాను విన్నది నీతో అన్నాను నాకూ ఇంతే తెలిసినదీ
నీకే తెలియును మిగిలినదీ
(ఎన్నో రాత్రులు వస్తాయి - తోడూనీడా')
తేటి ఎగిరిపోతుంది పువ్వు మిగిలిపోతుంది.
తేనె ఉన్న సంగతి తేటి గురుతు చేస్తుంది
(ఇదేనన్న మాట - కొడుకుకోడలు)
ఇది చదువుల్లో ఎక్కడా చెప్పలేదే
చెప్పందీ చేసినా తప్పుకాదే
(పడ్డావటే పిల్లా 'బ్రతుకే ఒక పండుగ')
పడుచుదనం పందెమెత్తి వలపు జూదం ఆడుకోవాలి.
నాకు నువ్వు నీకు నేను రోజురోజూ ఓడిపోవాలి.
(వెచ్చవెచ్చనీ నీ ఒడిలో - 'శభాష్ వదినా')
నీలోని మగసిరితోటి నాలోని సొగసుల పోటీ
వేయించి నేనే ఓడి, పోనీ పొమ్మంటీ
నేనోడి నీవే గెలిచి నీ గెలుపునాదని తలచి
రాగాలే రంజిలు రోజే రాజీ రమ్మంటీ
(రేకంటి పూవుల వంటి - 'మంచిచెడు)

మొదట మొదట కళ్ళతోటి మొదలు పెట్టి లడాయి.
హృదయమంత పాకుతుంది హుషారైన హోయి
కలకాలం ఉండదు ఈ పడుచు బడాయి
తొలినాడే చల్లబడి పోవునమ్మాయి
(గిల్లికజ్జాలు తెచ్చుకునే - 'ఆత్మబలం')
భగ్నప్రేమకు ఆత్రేయ తన పాటలతో వేసిన పీటలు
ఆయన ఓ కవిగా ఎంతగా శోధిస్తాడో రోదిస్తాడో తెలియజేస్తాయి.
కదిలే శిలగా మారిపోతిని కథగానైనా మిగలనైతిని
(నాలుగు కళ్ళు రెండైనాయి - 'ఆత్మబలం')
కనులున్నవి కన్నీటికి కొలనుల గుటకా
వలపన్నది విఫలమై విలపించుటకా
(బంగరునావా బ్రతుకు - 'వాగ్దానం')
తొలికోడి కూతల్లె వినిపించి తొలిపొద్దు వెలుగల్లే కనిపించి
తొలిజన్మ ఋణమేదో అనిపించి తెరవని తలుపులు తెరిపించి
ఎందుకు వచ్చావో ఎందుకు వెళ్ళావో నాకేమో తెలియదు.
నీకైనా తెలుసునా
(ఎందుకువచ్చావో - 'మనసు-మాంగల్యం')
అగ్గి వంటి వలవంటించి హాయిగా ఉందామనుకోకు
మనసు మంచి మనసుకి పాకి ఆరనిగాయం చేస్తుంది.
రాయికన్నా రాయిని నీవు కసాయిని నీవు
('హృదయం లేని ప్రియురాలా - 'కన్నె మనసులు')
నవ్వినా ఏడ్చినా కన్నీళ్ళే వస్తాయి
ఏ కన్నీటెనకాల ఏముందో తెలుసునా
(ముద్దబంతి పూవులో - 'మూగ మనసులు)
చావు పుటక లేనిదమ్మ నేస్తమన్నదీ
జనమ జనమకది మరీ గట్టిపడతదీ
(పాడుతా తీయగా చల్లగా - 'మూగ మనసులు')
మాటలతో, పదాలతో ఆత్రేయ ఎప్పుడూ గిమ్మిక్కులు చేయలేదు. అయినా, సందర్భశుద్ధితో అవే ఆయన సృష్టించిన పాటలలో పోటీ పడుతూ తిష్టవేశాయి. ఆయన ప్రతిష్టను మరింతగా పెంచాయి.
అందుకే నేనది పొందినది అందనిదైనా అందనిది.
పొందిన పిదపే తెలిసినదీ నేనెందుకు నీకు అందినది
(అందరికీ తెలియనిదీ - 'ఆస్తిపరులు)
పరిగమ వానికి పగమని తలపోయి
మురిపాలె మన జంట స్వరమైనవి
(ఏ రాగమూ ఇది ఏ తాళమూ 'అమరదీపం')
వచ్చింది ఎందుకో తెలిసుంటే వెళ్ళవు
వెళ్ళేది తెలిసుంటే అసలొచ్చి ఉండవు
(ఎందుకు వచ్చావో - 'మనసు-మాంగల్యం')
ఇదిలా ఉండగా 'తొలికోడి కూసింది' చిత్రంలో 'పోలీసు వెంకటసామి నీకు పూజరయ్యాడు' పాటలో పూర్తిగా పోలీసు భాషనే ఉపయోగించారాయన. ఉదహరించాలంటే - పాట మొత్తాన్ని రాయాల్సిందే. అలాగే 'అదృష్టవంతులు' సినిమాలో 'నమ్మరే నేను మారానంటే నమ్మరే' పాటలో సాహిత్యం అంతా ఓ డైలాగు చెప్పున్నట్టే ఉంటుంది.
డైలాగంటే గుర్తొచ్చింది... ఎన్నో చిత్రాలలో ఆయన ప్రాణం పోసిన సంభాషణలు తల్చుకుంటే ఒళ్ళు జలదరిస్తుంది. భాషకు ఇంత బలం ఉందా అని అనిపిస్తుంది. ఆత్రేయ డైలాగుకి ట్యూన్ కడితే అది పాటవుతుంది. ఆయన పాటకి ట్యూన్ తీసేస్తే అది డైలాగవుతుంది అని అంటారు పరిశ్రమలో....
"ఎవ్వరికీ ఇవ్వనంత వరకే హృదయం విశాలంగా ఉంటుంది.
ఒకసారి ఇచ్చాక ఇరుకై పోతుంది ఇంకెవ్వరికీ చోటివ్వనంటుంది"
"చినబాబు చెడిపోయాడేమో గాని చెడ్డవాడు మాత్రం కాదమ్మా"
"మనిషి తాను అనుకున్నట్టు బ్రతకనూ లేడు
ఇతరులు అనుకున్నట్టు చావనూ లేడు"
"వీటన్నిటినీ భరించాలంటే అసలు మనిషి మీద
ప్రేమ ఉండాలి"
("ప్రేమనగర్")
"సామాన్యుడికి అందుబాటులో లేని కళ సంకుచితమై నశించిపోతుంది"
(జయభేరి)
"చావు ఎంతమందినో విడదీస్తుంది
కాని కొంతమందిని కలుపుతుంది"
(మూగమనసులు)
"కన్నీరే మనిషిని బ్రతికించగలిగితే
అమృతం లాగే అదీ కరవైపోయేది"
"చంద్రుడు క్షీణిస్తున్నాడని వెన్నెల వేరే చోట వెతుక్కుంటుందా?"
"కవిత్వం వేరు, జీవితం వేరు. విలువలు తెలుసుకుంటే జీవితమే ఓ మహాకావ్యం అవుతుంది"
("వెలుగునీడలు")



ఆత్రేయ డైలాగ్‌కి ట్యూన్ కడితే పాట - ఆత్రేయ పాటలో ట్యూన్ తీసేస్తే డైలాగు.
దిన పత్రికలోని హెడ్‌లైన్లన్నిటిని వరసగా పేరిస్తే ట్యూన్ కట్టి పాట చేయగల సామర్థ్యం మహదేవన్‌ది.
అందుకే వీరిద్దరిది సక్సెస్‌ఫుల్ కాంబినేషన్ అయింది.

ఇలా రాసుకుంటూ పోతే భావావేశం కన్నా 'స్థలాభావేశం' ఎక్కువ ప్రాముఖ్యత వహిస్తుంది. కనుక ఇక్కడికీ ఆ పార్టు ఆపి ఫ్లాష్ బ్యాక్‌లోకెళ్ళి ఆత్రేయ గారి 'వ్యక్తిగత జీవితం' గురించి తెలుసుకుందాం.
సూళ్ళురుపేట మంగళంపాడులో 1921వ సంవత్సరం మే ఏడవ తేదీన జన్మించారాయన. మే ఏడవ తేదీ విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ జన్మదినం. 'నిజమా?' అని అడిగితే 'అవును... కావాలనే ఆ తేదీ చూసుకు మరీ పుట్టాను' అంటుండే వాడాయన సరదాగా.
చిన్నప్పుడు చదువు మీదకన్నా, నాటకాల మీదనే ఎక్కువ శ్రద్ధ చూపించేవాడు. ఓసారి ఓ నాటకంలో మీసాలు గొరిగించుకుని నటించాడని ఇంటికి వచ్చాక గోమూత్రం తాగించి ప్రాయశ్చిత్త సంస్కారం చేశారు. అంత సంప్రదాయబద్ధమైన కుటుంబం ఆయనది. ఆత్రేయ అసలు పేరు కిళాంబి వెంకట నరసింహాచార్యులు. గోత్రనామం ఆత్రేయ కనుక ఆ పేరునే తన పేరుగా ధరించాడాయన.
ఓసారి ఓ మిత్రుడు ఆయనకి తను రాసిన కందపద్యాలు తెచ్చిచూడమన్నాడు. ఆత్రేయకు అర్థం కాలేదు. 'ఏం చేయాలి' అని అడిగాడు మేనమామని. ఆయన కందపద్య లక్షణాలున్న ఓ పుస్తకాన్ని ఆత్రేయకి ఇచ్చి చదివి వంటపట్టించుకోమన్నాడు. ఆత్రేయ ఆ లక్షణాలన్నీ ఆకళింపు చేసుకుని - 'నువ్వు చేసిన తప్పులు ఇవీ' అని ఆ మిత్రుడికి అతని తప్పుల్ని కంద పద్యంలోనే రాసి చూపించాడు.
ఇది తెలుసుకున్న ఆత్రేయ మేనమామ "ఒరే.... నువ్వు స్కూల్ ఫైనల్ పాసైతే నీకు సైకిల్, రిస్ట్‌వాచీ, కొనిస్తాను" అన్నాడు. అంతే... వెంటనే మిత్రుల దగ్గరకెళ్ళి పాఠ్యపుస్తకాలన్నీ కాపీ చేశాడు ఆత్రేయ. అలా రాస్తుండగానే సగం పాఠాలు ఆయనకి కంఠోపాఠంగా వచ్చేశాయి. స్కూల్ ఫైనల్ పాసై మేనమామ ఇచ్చిన రిస్ట్‌వాచీ పెట్టుకుని సైకిలెక్కి ఊరంతా

గర్వంగా తిరిగాడు.

అయినా సరే "నాలైను వేరే ఉంది" అని ఎప్పుడూ అనుకునేవాడు మనసులో. ఒకసారి రాజన్ అనే మిత్రుడి సాయంతో ఇంట్లోని వెండిగ్లాసు దొంగిలించి మద్రాసు బండెక్కాడు.

అక్కడ పడరాని అగచాట్లు పడ్డాడు. సబ్బులు అమ్మేవాడు. ఉన్ననాడు భోజనం - లేనినాడు కుళాయి నీళ్ళు. రాత్రిళ్ళు మద్రాసులోని మన్రో విగ్రహం దగ్గర పడుకునే వాడు. ఓసారి ఓ పావలా ఎక్కువ ఉందనిపిస్తే ఓ నోటుబుక్ కొని వీధీ దీపం కింద కూర్చొని 'గౌతమబుద్ధ' అనే నాటకం రాసి యాభై రూపాయలకు అమ్మాడు.

ఆ రోజుల్లోనే సినీ నటుడు రమణారెడ్డితో పరిచయం ఏర్పడింది. టిఫెనుకీ, భోజనానికి, పావలా, బేడా రమణారెడ్డే ఇచ్చేవాడు ఆత్రేయకి.

ఇలా ఉండగా 'తెనాలి రామకృష్ణ సినిమాలో వేషం ఉంది వేస్తావా' అని అన్నాడో పరిచయస్తుడు. సరేనని వెళ్ళి అక్కడ పడేసిన గుడ్డలు, బకెట్‌లో వేసుకోవలసిన రంగునీళ్ళు చూసి నచ్చక వెనక్కి వచ్చేశాడు.

ఆ తర్వాత 'షావుకారు' చిత్రంలో డైలాగులు రాయడానికి కుదిరాడు. కానీ ఆరోగ్యం సహకరించక ఆయనే ఒద్దనుకున్నాడు. కొన్నాళ్ళకి 'మనోహర' చిత్రంలో డైలాగ్ అసిస్టెంట్‌గా మాటసాయం చేశాడు. ఎట్టకేలకి 'దీక్షచిత్రంలో 'పోరాబాబు పో' పాట రాసే అవకాశం వచ్చింది. ఆ తర్వాత ఇక ఆయన చేతికి విశ్రాంతే లేకుండా పోయింది.

కొన్ని వందలు, వేల పాటలు, మాటలు రాసిన ఆత్రేయ దర్శకుడిగా 'వాగ్దానం' చిత్రానికి దర్శకత్వం వహించాడు. నటుడిగా 'కోడెనాగు' చిత్రంలో నటించాడు. ఆత్రేయ మంచి హ్యూమనిస్టే కాదు, చక్కని హ్యూమరిస్ట్ కూడా!

ఓసారి ఓ సినిమా హాల్లోంచి బైటికి వస్తున్న ఆత్రేయను చూసి ఆశ్చర్యపోతూ 'ఆత్రేయగారూ మీరు సినిమా చూశారా?" అని అడిగాడో పాత్రికేయ మిత్రుడు. అంత చెత్త సినిమా అది. దానికి ఆత్రేయ 'లేదు నాయనా.... భరించా' అన్నాడు తడుముకోకుండా.

మరోసారి ఆత్రేయ తన అడ్రసుని ఇంకో పాత్రికేయ మిత్రుడికి రాసి ఇచ్చేడు. అది చూసి అతను "అరె.... ఇది సుశీలగారు ఉండే వీధే కదండీ..... ఆవిడ మీ ఇంటికి దగ్గరేనా?" అని అడిగాడు. "అవును... ఇది వరకు ఆవిడ మా పక్కింటి అమ్మాయి, ఇప్పుడు ఎదురింటి అమ్మాయి" జవాబిచ్చాడు ఆత్రేయ చమత్కారంగా.

"అంటే.... ఆవిడ మారేరా.... మీరు మారేరా?" తిరిగి ప్రశ్నించాడు ఆ మిత్రుడు.

"మారేదెప్పుడు ఆడవాళ్ళే.... ఊ... ఊ... ఊ...మ్మగమాళ్ళు మారరు" అని అన్నాడు ఆత్రేయ అక్కినేని నాగేశ్వరరావుగారిని ఇమిటేట్ చేస్తూ.

ఆత్రేయ అంటే చంద్రుడు అని అర్థం. అది తెలియని ఒకాయన 'ఆత్రేయ అంటే ఏమిటండీ?" అని అడిగాడు. దానికి ఆత్రేయ సమాధానం - రాత్రేయుడు'.

ఆత్రేయ 'వాగ్దానం' చిత్రాన్ని డైరెక్ట్ చేసే రోజుల్లో ఓసారి సెట్‌లో అక్కినేని నాగేశ్వరరావుగారితో సహా అందరూ రెడీ అయి కూర్చున్నారు. ఆత్రేయ మాత్రం ఎక్కడా అయిపులేడు. ఆఖరికి అక్కినేని అటూ ఇటూ తిరిగి ఆత్రేయని పట్టుకున్నారు. ఎవరికీ కనిపించకుండా ఓ మూల కూర్చుని అప్పుడు చిత్రీకరించవలసిన డైలాగులు రాసేసుకుంటున్నాడాయన. "ఏంటండీ ఇది... ఏంటీ పని?" అని మందలించారు అక్కినేని.

"అదికాదు నాగేశ్వరరావు గారూ.... అందరికీ లేటుగా ఇచ్చి నా సినిమాకి నేను ముందుగా డైలాగులు రాసేసుకుంటే 'స్వార్థం' అని ప్రొడ్యూసర్లు తిట్టుకోరూ.... ఆ పార్షియాలిటీ లేకుండా జాగ్రత్త పడుతున్నానండీ" అన్నాడాయన వస్తున్న నవ్వుని ఆపుకుని సీరియస్‌నెస్ మొహం మీదకు తెచ్చేసుకుంటూ.



## ఆత్రేయ గురించి ఎమ్మెస్ రెడ్డి

రాయకేడ్పించు చిత్ర నిర్మాతనాతడు
రాసి ఏడ్పించు అఖిలాంధ్ర ప్రజలనతడు
తనకు లేదనిగాని ఒరులకుందనియుగాని
ఏడ్వడాతడు ఒక్కనాడేని... నిజము..

-మల్లెమాల

ఆత్రేయ రాసుకునే టైము తెల్లవారు జామున మూడు లేక నాలుగు, రాసిన వాటిని తెలుగులో టైపు చెయ్యడానికి ఓ అసిస్టెంట్‌ని పెట్టుకున్నాడు. ఈయన రాసి పంపిస్తూనే ఉన్నాడు. పక్కగదిలోంచి టైపు శబ్దం అస్సలు వినిపించడం లేదు.

'ఏం టైపు చేస్తున్నావ్?' అరిచాడు ఆత్రేయ. 'సీన్లండీ' అన్నాడతడు ఉలిక్కిపడి లేచి.

'అదే ఏ సీన్లూ అని...? అసలు శబ్దమే వినిపించడం లేదు'

'సైలెంట్ సీన్లండీ' అన్నాడా అసిస్టెంట్ బహు చమత్కారంగా.

ఆత్రేయతోటి సాంగత్య వైభవం అంతటిది మరి.

ఆత్రేయ రాయకుండా ప్రొడ్యూసర్లని, రాసి ప్రేక్షకులని ఏడిపిస్తారని ఓ సినీ సూక్తి. దాని గురించి ఆయనతో ప్రస్తావిస్తే "రాస్తూ నేనెంత ఏడుస్తానో, ఎవడికి తెలును" అంటుండేవాడాయన ఛలోక్తిగా.

అలాగే "మీరు మనసు మీదనే ఎక్కువ రాస్తారెందుకండీ?" అని అడిగితే 'మనసు మీద మనసుపడ్డా నాయనా' అంటుండే వారు నర్మగర్భంగా.

చివర్న చెప్పుకోవలసింది, కళ్ళను చెమ్మగిల్లేట్టు, మనసును గిల్లేట్టు చేసే ఓ జోకు ఆయనది ఉంది.

"నాకూ, చావుకి అస్సలు పడదు. నేనున్న దగ్గరికి అది రాదు. అదొస్తే నేనుండను"

అదీ ఆత్రేయంటే!

ఆత్రేయ జీవకవి. మనిషి మనసులో మమత చావనంత వరకూ అనుక్షణం ఓ అనుభూతిగా ఆయన పుడుతూనే ఉంటాడు. అందుకే ఆత్రేయ చిరస్మరణీయుడు, తెలుగు పాటలో భావం ఉన్నంత వరకు స్వరస్మరణీయుడు, తెలుగు తెరమీద తెలుగుదనం ఉన్నంతవరకూ తెరస్మరణీయుడు.

-రాజా

## దీక్ష

సంగీతం : పెండ్యాల గానం: ఎం.యస్. రామారావు

పోరా బాబూ పో!
పోయి చూడు ఈ లోకం పోకడ
ఆవేశాలను ఆశయాలను
వదినకోసమై వదులుకొంటివా
ఆమెకు నీకు ఋణం తీరెగా
తెగించి చూడు తేలేదేమిటో!
ఉన్నవూరు కాదన్నావు
వూరువిడిచి పోతున్నావు
ఏ ఘనకార్యం సాధిస్తావో
ఏమౌతావో ఎవరి కెరుకరా?
దూరపు కొండలు నునుపేనేమో
దోషం నీలో లేదో ఏమో
నీవు నమ్మిన నీతి న్యాయం
నిజమౌనేమో తెలుసుకుందువు ॥పోరా॥
దేశసేవకై దీక్ష పూనమని
ధీరమాత దీవించెను నాన్న
కాకిని కోకిల చేస్తావో
లోకంలో ఒకడైపోతావో ॥పోరా॥

## ఆలుమగలు

సంగీతం : కె.వి. మహదేవన్ గానం: పి. సుశీల

ఒకటి... ఒకటి... ఒకటి...
మానవులందరు ఒకటీ
రెండూ రెండూ రెండూ
మంచివాళ్లని, చెడ్డవాళ్లని
మనలో జాతులు రెండు ॥ఒకటి॥
మూడూ మూడూ మూడూ
మూఢుల స్నేహం వీడు
నాలుగు నాలుగు నాలుగు
నలుగురి సుఖము చూడు
ఐదు వేళ్లవలె ఐకమత్యమున
అందరు ఉంటే అదియే మేలు ॥ఒకటి॥
ఆరు నూరుగా నూరు ఆరుగా
అయినా కూడా అబద్ధ మాడకు
ఏడు ఏడు ఏడు ఇతరుల చూచి ఏడవకు ॥ఒకటి॥
ఎనిమిది వరకు నిద్రపోవకు
తొమ్మిది పైన మేల్కొని ఉండకు
పదిమంది నిన్ను మంచివాడని
పొగిడినంతనే పొంగి పోవకు ॥ఒకటి॥

## మంచీ చెడూ

సంగీతం : విశ్వనాథన్, రామమూర్తి గానం: ఘంటసాల, పి. సుశీల

అ: రేపంటి రూపం కంటీ
పూవింటి తూపుల వంటీ
నీకంటి చూపుల వెంట - నా పరుగంటీ
ఆ: రేపంటి వెలుగే కంటీ
పూవింటి దొరనే కంటీ
నాకంటి కలలూ కళలూ నీ సొమ్మంటీ ॥రేపంటి॥
ఆ: నీతోడు నీవైయుంటే నీ నీడ నేనేనంటీ
యీ జంటకంటే వేరులేదు లేదంటీ
నీ మీద ఆశలు వుంచీ
ఆపైన కోటలు పెంచీ
నీకోసం రేపూ మాపూ వుంటిని నిన్నంటి ॥రేపంటి॥

అ: నే మల్లెపువ్వై విరిసి
నీ నల్లని జడలో వెలిసీ
నీ చల్లని నవ్వుల కలిసీవుంటే చాలంటీ
నీ కాలిమువ్వల రవళి నా భావి
మోహన మురళి
యీ రాగసరళి తరలీపోదాం రమ్మంటీ ॥రేపంటి॥
ఆ: నీలోని మగసిరితోటీ
నాలోని సొగసులు పోటీ
వేయించి నేనే వోడిపోనీ పొమ్మంటీ
నేనోడి నీవే గెలిచి నీ గెలుపు నాదని తలచీ
రాగాలు రంజిలురోజే రాజీ రమ్మంటీ ॥రేపంటి॥

## శ్రీ వేంకటేశ్వర మహాత్మ్యం

సంగీతం : పెండ్యాల గానం: ఘంటసాల

శేషశైలా వాసా శ్రీవెంకటేశా
శయనించు మా అయ్య
శ్రీచిద్విలాసా..! ॥శేష॥
శ్రీదేవి వంకకు చిలిపిగా చూడకు
అలమేలుమంగకు అలుక రానీయకు ॥శ్రీదేవి॥
ముద్దు సతులిద్దరిని ఇరువైపులా చేర్చి
మురిపించి లాలించి ముచ్చటలా దేల్చి
పట్టుపానుపు పైన పవ్వళించర స్వామి
భక్తులందరు నిన్ను ప్రస్తుతించి పాడ ॥పట్టు॥
చిరునగవు లొలుకుచూ నిదురించు నీ మోము
కరువుతీరా గాంచి తరియింతుము మేము ॥శేష॥

## బండరాముడు

సంగీతం : ఎస్. దక్షిణామూర్తి గానం: పి. సుశీల

సాగిపోయే ఓ చందమామా... ఆగుమా...
ఒకసారి ఆగుమా - ఓ చందమామా
మనసార నా మాట ఆలించి పొమ్మా
నీలి మబ్బుల తెరచాటు మాటున
మాటి మాటికి యిటు దాగనేల
ఎందుకో చనలేవు సూటిగ
ఎదలోన నీవైన యోచించుకొమ్మా ॥ఒక॥
పరుల సొమ్మును హరియించువాడె
పగటి పూటను యిలు వీడలేడోయ్
మంచిగా మనపోయి జాబిలి
మలినమ్ము యికనైన తొలగించుకొమ్మా
మారేనా నీ మనసు ఓ చందమామా ॥ఒక॥

## ఆలుమగలు

సంగీతం : కె.వి. మహాదేవన్ | గానం: ఘంటసాల. పి. సుశీల

సంసారం మహాసాగరం - ఈదాలి ఏకమై యిద్దరం
ఆ... సంసారం మహాసాగరం - ఈదాలి ఏకమై యిద్దరం
ఈదాలి ఏకమై యిద్దరం - ఈపటికి యిద్దరం
పైపటికి ముగ్గురం - ఆపైన నలుగురం
ఫుల్‌స్టాప్
అంతటితో ఆగకుంటే - అదే మహాభారం
సంసారం ఈ సంసారం - మన సంసారం మహాసాగరం
ఈదాలి ఏకమై యిద్దరం - ఈదాలి ఏకమై యిద్దరం
నెలజీతం తేవాలి - మనచేతికి యివ్వాలి
అక్కరైతే అడగాలి
ఫుల్‌స్టాప్
అంతటితో ఆగకుంటె - అదే ఆడపెత్తనం
సంసారం ఈ సంసారం - మన సంసారం మహాసాగరం
ఈదాలి ఏకమై యిద్దరం - ఈదాలి ఏకమై యిద్దరం
మంచి చెడు చెప్పుకొని - మనసు మనసు తెలుసుకుని
పెనవేసుక పోయామా
ఫుల్‌స్టాప్
అంతటితో ఆగకుంటే - వంటకాదు ఈ దినం
సంసారం ఈ సంసారం - మన సంసారం మహాసాగరం
ఈదాలి ఏకమై యిద్దరం - ఈదాలి ఏకమై యిద్దరం

## సిరిసంపదలు

సంగీతం : మాస్టర్ వేణు | గానం: ఘంటసాల, యస్. జానకి

అ: ఈ పగలు రేయిగ పండు వెన్నెలగ
మారినదేమి చెలీ - ఆ కారణ మేమి చెలీ
ఆ: ఆఁ..
అ: వింత కాదు నా చెంత నున్నది
వెండి వెన్నెల జాబిలీ
నిండు పున్నమి జాబిలీ
ఆ: ఓ...
అ: మనసున తొణికే చిరునవ్వెందుకు
పెదవులమీదికి రానీవు
పెదవి కదిపితే మదిలో మెదిలే
మాట తెలియునని మానేవు ॥వెండివెన్నెల॥
అ: కన్నులు తెలిపే కథల నెందుకు
రెప్పలార్చి ఏమార్చేవూ
ఆ: ఆఁ...
అ: చెంపలు పూచే కెంపులు నాతో
నిజము తెలుపునని జడిసేవూ ॥వెండివెన్నెల॥
అ: అలుక చూపి అటువైపు తిరిగితే
అగుపడ దనుకొని నవ్వేవూ
నల్లని జడలో మల్లెపూలు
నీ నవ్వున కద్దము చూపేనూ ॥వెండివెన్నెల॥

## ఇంటికి దీపం ఇల్లాలే

సంగీతం : విశ్వనాథన్, రామమూర్తి | గానం: పి.బి. శ్రీనివాస్

కాపలా...
కాపలా... కాపలా... కాపలా...
ఎవరికి ఎవరు కాపలా ... బంధాలన్నీ నీకేల
ఎవరికి ఎవరు కాపలా... బంధాలన్నీ నీకేల
ఈ బంధాలన్నీ నీకేల... ఎవరికి ఎవరు కాపలా
బంధాలన్నీ నీకేల...
తనువుకు ప్రాణం కాపలా
మనిషికి మనసే కాపలా
తనువు వదలి తరలేవేళ... మన మంచే మనకు కాపలా॥ఎవ॥
కంటికి రెప్పే కాపలా... కలిమికి ధర్మం కాపలా
కలిమి సర్వము తొలగినవేళ
పెట్టినదేరా గట్టికాపలా ॥ఎవ॥
చిన్నతనాన తల్లి కాపలా
వయసున వలచినవారు కాపలా
ఎవరి ప్రేమకు నోచనివేళ... కన్నీరేరా నీకు కాపలా ॥ఎవ॥
కన్నీరేరా నీకు కాపలా ॥ఎవ॥

## శ్రీ వేంకటేశ్వర మహాత్మ్యం

సంగీతం : పెండ్యాల | గానం: పి. శాంతకుమారి

గోపాలా..!
నందగోపాలా..!!
ఎన్నాళ్లని నా కన్నులు కాయగ
ఎదురు చూతురా గోపాలా
ఎంత పిలిచినా ఎంత వేడినా
ఈనాటికి దయరాదేలా ॥ఎంత॥
వీనుల విందుగ వేణుగానము
విని తరించగా వేచితిరా
వేచి వేచి ఈ వెన్నముద్దవలె
కరిగిపోయెరా నా బ్రతుకు ॥ఎన్నా॥
వెన్న మీగడల జున్ను పాలకు
ఏమి కొరతరా మన యింట
పాలను ముచ్చిలి పరుల చేతిలో
దెబ్బలు తినకురా కన్నయ్యా
ఈ తల్లి హృదయము ఓర్వలేదయా
గోపాలా - నందగోపాలా

## మంచిమనసులు

సంగీతం :కె.వి. మహదేవన్ గానం: ఘంటసాల

అహో! ఆంధ్రభోజా! శ్రీకృష్ణదేవరాయా!
విజయనగర సామ్రాజ్య నిర్మాణ తేజోవిరాజా!!
యీ శిథిలాలలో చిరంజీవి వైనావయా!
శిలలపై శిల్పాలు చెక్కినారు - మనవాళ్ళు
సృష్టికే అందాలు తెచ్చినారు
కనుచూపు కరువైన వారికైనా
కనుపించి కనువిందు కలిగించు రీతిగా ॥శిల॥
ఒకవైపు ఉగ్రూతలూపు కవనాలు
ఒకప్రక్క పులికించు యుద్ధ భేరీలు
ఒక చెంప శృంగారమొలుకు నాట్యాలు
నవరసా లొలికించు నగరాని కొచ్చాము
కనులు లేవని నీవు కలతపడవలదు
నా కనులు నీవిగా చేసుకొని చూడు ॥శిల॥

ఏకశిల రథముపై లోకేశు వడిలోన
ఓరచూపులదేవి ఊరేగి రాగా
రాతి స్తంభాలకే చేతనత్వము కలిగి
సరిగమా పదనిసా స్వరములే పాడగా
కొంగు ముడివేసుకుని క్రొత్త దంపతులు
కొడుకు పుట్టాలనీ కోరుకున్నారనీ ॥శిల॥
రాణులే పోయినా - రాజ్యాలు కూలినా
కాలాలు మారినా - గాడ్పులే వీచినా
మనుజులే దనుజులై మట్టిపాల్జేసినా
చెదరనీ కదలనీ శిల్పాలవలెనే
నీవు నా హృదయాన నిత్యమై సత్యమై
నిలిచివుందువు చెలీ, నిజము నా జాబిలీ ॥శిల॥

## బంగారు బాబు

సంగీతం:కె.వి. మహదేవన్ గానం: ఘంటసాల, పి. సుశీల

ఆ: ఛీ... ఛీ... ఛీ...
అ: ఛా... ఛా... ఛా...
చెంగావి రంగుచీర కట్టుకున్న చిన్నది
దాని జిమ్మడియ్య అందమంతా చీరలోనే వున్నది
ఆ: చెంగావి రంగుచీర కట్టుకున్న చిన్నది
దాని జిమ్మడియ్య కొంగుకొంగు కలిపి చూడమన్నది
అ: మెరుపల్లె వచ్చింది నా యింటికి - నన్ను
మెల్లంగ దించింది ముగ్గులోనికి
ఆ: తలదాచుకొమ్మని తావిస్తివీ - పిల్ల
దొరికింది చాలనీ ఇల్లాల్ని చేస్తివి... ॥చెంగావి॥
అ: ప్రేమంటే నేర్పింది పిచ్చివాడికి - దాంతో
వెర్రెత్తిపోయింది కుర్రవాడికి
ఆ: పిచ్చివాడనే పేరుచాటున మాటువేసినావు...
పిల్లదాని పెదవిమీద కాటు వేసినావు...
అ: సరి.... సరి... సరి... సరి ॥2॥ ॥చెంగావి॥
ఆ: సరసంలో పడ్డాడు యిన్నాళ్లకి - అబ్బో
సంగీతం వచ్చింది బుజ్జిబాబుకి
అ: తెరచాటు తొలిగింది పరువానికి
అది పరవళ్ళు తొక్కుతూ పాడింది నేటికి
ఆ: సరి సరి సరి సరి ॥2॥ ॥చెంగావి॥
సరి స్ల స్ల స్ల సగప స్ల స్ల సమప స్ల స్ల సరిగరి సరిస
సరిగరిసరిస సరిగరిసరిస సరిగరి సరిగరి సరిగరి సరిగరిసా

## వాగ్దానం

సంగీతం : పెండ్యాల గానం: ఘంటసాల, పి. సుశీల

పాహి రామప్రభో! వరదా, శుభదా
పాహి దీనపాలా
వెలుగు చూపవయ్యా మదిలో
కలత బాపవయ్యా
మహాత్ములైనా దురాత్ములైనా
మనుజుల పేరనే మసలేరయ్యా
అందరికీ నీ అభయం కలదని,
అనుకోమందువ దేవా ॥పాహి॥
నేరక చేసిన కారణమున మా నేరము
నేరము కాకపోవునా?
కన్నీరే ఆ కలుషమునంతా
కడిగివేయునా రామా ॥పాహి॥
కల రూపేదో కలవో లేవో
ఎదవున్నది ఈ వేదనకేనో
ఏది అన్నెమో ఏది పున్నెమో
ఎరుగలేము శ్రీరామా ॥పాహి॥

## తోడికోడళ్ళు

సంగీతం : మాస్టర్ వేణు గానం: ఘంటసాల

కారులో షికారుకెళ్ళే పాలబుగ్గల పసిడిదాన
బుగ్గమీద గులాబిరంగు ఎలావచ్చెనో చెప్పగలవా
నిన్నుమించిన కన్నెలెందరో మండుటెండలో మాడిపోతే
వారిబుగ్గల నిగ్గు నీకు వచ్చి చేరెను తెలుసుకో
నిలిచివిను నీ బడాయిచాలు తెలుసుకో
ఈ నిజానిజాలు ॥కారు॥
చలువరాతి మేడలోనా కులుకుతావే కుల్కదానా
మేడగట్టిన చలువరాయి ఎలావచ్చెనో చెప్పగలవా
కడుపుకాలే కష్టజీవులు ఒడలు విరిచీ గనులు తొలిచీ
చెమట చలువను చేర్చి రాళ్ళను తీర్చినారు తెలుసుకో ॥కారు॥
గాలిలోన తేలిపోయే చీరగట్టిన చిన్నదానా
జిలుగు వెలుగుల చీర శిల్పం ఎలావచ్చెనో చెప్పగలవా
చిరుగుపాతల బరువు బ్రతుకుల నేతగాళ్ళే నేసినారు
చాకిరొకరిది సౌఖ్యమొకరిది సాగదింక తెలుసుకో ॥కారు॥

## ఆత్మబలం

సంగీతం: కె.వి. మహదేవన్ గానం: ఘంటసాల, పి. సుశీల

అ: తెల్లవారనీకు ఈ రేయిని
తీరిపోనీకు ఈ తీయని హాయినీ...
నీ కన్నులలో మధువులన్ని జుర్రుకొనీ
ఆ కైపులో లోకాలే మరువనీ
ఆ: మనసులో మనసునై మరువనీ
నీ మనిషినై మమతనై మురిసిపోనీ
అ: తెల్లవారనీకు ఈ రేయిని
ఆ: తీరిపోనీకు ఈ తీయని హాయినీ
తెల్లవారనీకు ఈ రేయినీ
అ: నీ కురులే చీకటులై కప్పివేయనీ
ఆ చీకటిలో పగలు రేయి ఒకటైపోనీ
ఆ: నీ వలపువాన కురిసి కురిసి తడిసిపోనీ
తడియారని హృదిలో నను మొలకలెత్తనీ
అ: తెల్లవారనీకు ఈ రేయినీ
తీరిపోనీకు ఈ తీయని హాయినీ
ఆ: తెల్లవారనీకు ఈ రేయినీ
అ: మల్లెపూల తెల్లదనం మనసు నిండనీ
అల్లరి పడుచుదనం కొల్లబోనీ
ఆ: కొల్లగొన్న మనసే నా యిల్లని
చల్లగా కాపురం ఉండిపోనీ
ఇ: తెల్లవారనీకు ఈ రేయినీ
తీరిపోనీకు ఈ తీయని హాయినీ
తెల్లవారనీకు ఈ రేయినీ

## మురళీకృష్ణ

సంగీతం: మాస్టర్ వేణు గానం: ఘంటసాల

సా: ఎక్కడవున్నా ఏమైనా - మన మెవరికి వారై వేరైనా...
ప: నీ సుఖమే నే కోరుతున్నా -
నిను వీడి అందుకే వెళుతున్నా ॥నీ॥
అనుకున్నామని జరుగవు అన్నీ
అనుకోలేదని ఆగవు కొన్ని
జరిగేవన్నీ మంచికని
అనుకోవడమే మనిషి పని ॥నీ॥
పసిపాపవలె హొడి చేర్చినాను
కనుపాపవలె కాపాడినాను
గుండెను గుడిగా చేశాను
నువ్వుండలేనని వెళ్ళావు ॥నీ॥
వలచుట తెలిసిన నా మనసునకు
మరచుట మాత్రము తెలియనిదా
మనసిచ్చినదే నిజమైతే
మన్నించుటయే ఋజువుకాదా ॥నీ॥
నీ కలలే కమ్మగ పండనీ
నా తలపే నీలో వాడనీ
కలకాలం చల్లగ వుండాలని
దీవిస్తున్నా నా దేవిని
దీవిస్తున్నా నా దేవిని... ॥నీ॥

## డాక్టర్ చక్రవర్తి

సంగీతం: యస్. రాజేశ్వరరావు గానం: పి. సుశీల

నీవులేక వీణ పలకలేనన్నది
నీవు రాక రాధ నిలువలేనన్నది ॥నీవు॥
జాజిపూలు నీకై రోజురోజు పూచె
చూచిచూచి పాపం సొమ్మసిల్లిపోయె
చందమామ నీకై తొంగితొంగి చూచి
సరసన లేవని అలుకలు బోయె ॥నీవు॥
కలలనైన నిన్ను కనుల చూతమన్న
నిదుర రాని నాకు కలలుకూడ రావె
కదలలేని కాలం విరహగీతి రీతి
పరువము వృధగా బరువుగ సాగె ॥నీవు॥
తలుపులన్ని నీకై తెరచివుంచినాను
తలపులెన్నో మదిలో దాచివేసినాను
తాపమింక నేను ఓపలేను స్వామి
తరుణిని కరుణను ఏలగ రావా ॥నీవు॥

## దాగుడు మూతలు

సంగీతం: కె.వి. మహదేవన్ గానం: ఘంటసాల, పి. సుశీల

అ: దేవుడనేవాడున్నాడా అని మనిషికి కలిగెను సందేహం (2)
ఆ: మనుషులనే వారున్నారా అని దేవుని కొచ్చెను అనుమానం
అ: మనసులేని ఈ మనిషిని చూచి దేవుడు రాయై పోయాడు
ఆ: ఆ దేవుడు కనబడలేదని మనిషి నాస్తికుడైనాడు ॥దేవు॥
ఆ: పశువులకన్న పక్షులకన్న, మనిషిని మిన్నగ చేశాడు
బుద్ధిని ఇచ్చి హృదయాన్నిచ్చి, భూమే నీదని పంపాడు (2)
అ: బుద్ధికి హృదయంలేక - హృదయానికి బుద్ధేరాక (2)
నరుడే యీ నరలోకం - నరకం చేశాడూ ॥దేవు॥
అ: తాము నవ్వుతూ నవ్విస్తారు కొందరు అందరినీ
ఆ: తామేడుస్తూ ఏడ్పించుతా రెందరో కొందరినీ
అ: నేను నవ్వితే ఈ లోకం చూడలేక ఏడ్చింది
ఆ: నే నేడిస్తే ఈ లోకం చూసి చూసి నవ్వింది ॥దేవు॥

## మూగమనసులు

సంగీతం: కె.వి. మహదేవన్ గానం: పి. సుశీల

మానూమాకును కాను రాయీరప్పను కానేకాను
మామూలు మణిసిని నేను నీ మణిసిని నేను
నాకూ ఒక మనసున్నాదీ, నలుగురిలా ఆశున్నాది
కలలు కనే కళ్ళున్నాయి
అవి కలతపడితే నీళ్ళున్నాయి ॥మాను॥
పెమిదను తెచ్చి వొత్తిని యేసి సమురును పోసీ బెమ సూపేవా
ఇంతాశేసి యెలిగించేందుకు, ఎనకముందులాడేవా ॥మాను॥
మణిసితోటి యేళాకోళం, ఆడుకుంటే బాగుంటాది
మనసుతోటి ఆడకు మావా
ఇరిగిపోతే అతకదు మల్లా ॥మాను॥

## దసరాబుల్లోడు

సంగీతం: కె.వి. మహదేవన్ గానం: ఘంటసాల, పి. సుశీల

అ: అరెరెరెరెరె... ఎట్టాగో వున్నాది ఓలమ్మీ
ఏటేటో అవుతూందే చిన్నమ్మీ... ॥అరెరె॥
ఆ: అరెరెరెరెరె.... అట్టాగే ఉంటాది ఓరబ్బీ
ఎట్టాగో అవుతాది చిన్నబ్బీ...
అ: మొలలోతు నీళ్ళల్లో మొగ్గల్లే నువ్వుంటే
నీ ఒంటి నిగనిగతో నీళ్ళు మెరుస్తుంటే
పొదచాటునా నేను మాటేసి చూస్తుంటే
నువు తానాలు ఆడావు... ఓలమ్మీ
నా పాణాలు తీశావే చిన్నమ్మీ ॥అరెరె॥
మొగ్గలు ఒక్కొక్క రేకిప్పుకున్నట్టు
నీ చక్కదనాలు నేనొకటొకటె చూశాను...
జడ చూస్తే
ఆ: ఊఁ
అ: మెడ చూస్తే
ఆ: అహఁ
అ: జబ్బల నునుపు చూస్తే
కనరాని ఒంపులన్నీ ఓలమ్మీ...
కసికసిగా చూస్తినే చిన్నమ్మీ... ॥అరెరె॥
తడిసీ నీ తెల్లకోక తపతపామన్నది
తడబడి నా గడుసుమనసు దడాదడామన్నది
ఓరి నీ...
కళ్ళు మూసుకొస్తినని గొల్లున నువ్వు నవ్వితే...
చురకల్లె తగిలింది ఓలమ్మీ
ఉడుకెక్కిపోయిందే చిన్నమ్మీ ॥అరెరె॥
అరెరెరెరె.... అట్టాగే

## తోడూ నీడా

సంగీతం: కె.వి. మహదేవన్ గానం: పి. సుశీల

అత్త ఒడి పువ్వువలె మెత్తనమ్మా
ఆదమరచి హాయిగా ఆడుకోమ్మా
ఆడుకొని ఆడుకొని అలసిపోతివా
అలుపుతీర బజ్జోమ్మ - అందాల బొమ్మ ॥అత్త॥
అమ్మలు కన్నులు తమ్మి పూవుల్లు
తమ్మిపూవులు పూయు తలిరు వెన్నెల్లు
ఆ వెన్నెలను మూసెనే కన్నీటి జల్లు
కన్నీరు రానీకు కరుగునెడదల్లు ॥అత్త॥
కనిపించే దేవుళ్ళు కమ్మని పాపల్లు
కనిపించే తల్లికి కన్నుల జ్యోతుల్లు
వేయాలి పాపాయి తప్పటడుగులు
చేయాలి ఆపైన గొప్ప చేతలు ॥అత్త॥

## బడి పంతులు

సంగీతం: కె.వి. మహదేవన్ గానం: పి. సుశీల

ఆ: మీ నగుమోమూ నా కనులారా కడదాకా కననిండూ
ఈ సూత్రముతో యీ కుంకుమతో నను కడతేరిపోనిండూ
ఉపచారాలే చేసితినో ఎరగక
అపచారాలే చేసితినో
ఒడుదుడుకులలో తోడైవుంటినీ
మీ అడుగున అడుగై నడిచితినీ ॥మీ॥
రెక్కలు వచ్చి పిల్లలు వెళ్ళారూ
రెక్కలు అలసి మీరున్నారూ
పండుటాకులము మిగిలితిమీ
ఇంకెన్ని పండుగలు చూడనుంటిమీ ॥మీ॥
ఏ నోములు నే నోచితినో
ఈ దేవుని పతిగా పొందితినీ
ప్రతిజన్మా మీ సన్నిధిలోనా
ప్రమిదగ వెలిగే వరమడిగితినీ ॥మీ॥

## అక్కాచెల్లెలు

సంగీతం: కె.వి. మహదేవన్ గానం: పి. సుశీల

ఆ: పొండవులు పొండవులు తుమ్మెదా
పంచపొండవులోయమ్మ తుమ్మెదా ॥పం॥
కన్నెగానె బతుకు గడిచిపోతుంది
నన్నెవరేలుకుంటారు అనుకున్నది
జానకి అనుకున్నది ॥జాన॥
శ్రీరామచంద్రుడే చేసుకుంటాడని విన్నది
ఒళ్ళంత జల్లన్నది
ఓ యమ్మ ఒళ్ళంత జల్లన్నది ॥పాం॥
నవమన్మధునివంటి నాథుని కనులార
ఒక్కసారి చూడగ వుబలాటపడ్డది ॥నవ॥
తుమ్మెదా వుబలాట పడ్డది ॥తుమ్మె॥
పెళ్ళిపీటలమీద వెళ్ళి కూర్చున్నది
కళ్ళలో... కాని సిగ్గు కమ్మేసింది
ఓ యమ్మా బుగ్గలకు పాకింది ॥పాం॥
నీ గుండెలోనె నే నుండిపోవాలి
నీ అండనె నేను పండిపోవాలి ॥నీ॥
నా నోము పంట పండాలి ॥నా నోము॥
రాముడే రాముడు - జానకే జానకని
ముందువెనకందరూ - మురిసిపోవాలని
జానకి మొక్కుతూ మొక్కుకుంది ॥పాం॥

## తాశిల్దారుగారి అమ్మాయి

**సంగీతం: కె.వి.మహదేవన్** **గానం: కె.బి.కె. మోహన్‌రాజు**

అ: కనబడని చెయ్యేదో నడుపుతోంది నాటకం
ఆ నాటకాన నువ్వు నేను ఆటబొమ్మలం, కీలుబొమ్మలం
నాదీ నావాళ్లనే తాళ్లతో కడుతుంది
ఆ తాళ్ళు లాగి నీచేత తైతక్కలు ఆడిస్తుంది...
కనబడని చెయ్యికాదు నడిపేది నాటకం
కనబడుతూ నువ్వూ నేనే ఆడుతాము బూటకం
తలచింది జరిగిందంటే నీ తెలివేనంటావు
బెడిసిందా తలరాతంటూ విధిపై నెడతావు
మనమూ మనవాళ్లనీ మాటల్లో అంటావు
నేనూ నేనన్న అహంతో తెంచుకొని పోతావు ॥కన॥

కర్మను నమ్మినవాళ్లెవరూ కలిమిని స్థిరమనుకోరు
కళ్ళుమూసుకోరు
మనసు తెలిసిన వాళ్లెవరూ మమత చంపుకోరు
మనిషినొదులుకోరు
ఉన్నదాని విలువెరుగనివాళ్ళు పోగొట్టుకొని విలపిస్తారు ॥కన॥
మనిషిలాగ జీవించేది నీ చేతల్లోనే వుంది
మంచీ చెడు ఏదయిన నీ చేతుల్లోనే వుంది
కావాలని నిప్పు తాకితే చేయి కాలక మానదు
కాలినందుకు కర్మ అంటే గాయమేమో మానదు ॥కన॥

## ముందడుగు

**సంగీతం: కె.వి.మహదేవన్** **గానం: మాధవపెద్ది సత్యం, యస్.జానకి**

ఆ: కోడెకారూ చిన్నవాడా, వాడిపోనీ వన్నెగాడా
కోటలోన పాగావేశావా, చల్ పువ్వులరంగా
మాటతోనే మనసుదోచావా, చల్ పువ్వులరంగా ॥మాట॥
అ: చింతపూలా రైకదానా, చిలిపిచూపుల చిన్నదానా
కోరికలతో కోటే కట్టావా, చల్ నవ్వులరాణీ
దోరవలపులు దోచుకున్నావా, చల్ నవ్వులరాణీ ॥దోర॥
ఆ: చెట్టుమీదా పిట్టవుంది, పిట్టనోటా పిలుపువుంది
పిలుపు ఎవరికో తెలుసుకున్నావా చల్ పువ్వులరంగా
తెలుసుకుంటే కలిసి ఉంటావా చల్ పువ్వులరంగా ॥తెలు॥

అ: పిలుపువిన్నా తెలుసుకున్నా పిల్లదానా నమ్ముకున్నా
తెప్పలాగా తేలుతున్నావే చల్ నవ్వులరాణీ
నాకు జోడుగ నావ నడిపేవా చల్ నవ్వులరాణీ ॥నాకు॥
ఆ: నేల వదిలి నీరువదిలి నేను నువ్వును తలపుమాని
ఇద్దరొకటై ఎగిరిపోదామా చల్ పువ్వులరంగా
గాలిదారుల తేలిపోదామా చల్ పువ్వులరంగా ॥గాలి॥
అ: ఆడదాని మాటవింటే తేలిపోవటం తేలికంటె
తేల్చి తేల్చి ముంచుతారంట చల్ నవ్వులరాణీ
మునుగుతుంటె నవ్వుతారంట చల్ నవ్వులరాణీ ॥మును॥

## సుమంగళి

**సంగీతం: కె.వి.మహదేవన్** **గానం: ఘంటసాల, పి.సుశీల**

ఆ: కనులు కనులతో కలబడితే
ఆ తగవుకు ఫలమేమి?
అ: కలలే!
ఆ: నా కలలో నీవే కనబడితే
ఆ చొరవకు బలమేమి?
అ: మరులే!
ఆ: మరులు మనసులో స్థిరపడితే ఆపై జరిగేదేమి?
అ: మనువు!
ఆ: మనువై ఇద్దరు ఒకటైతే
ఆ మనుగడ పేరేమి?
అ: సంసారం! ॥కనులు॥
ఆ: అల్లరి ఏదో చేసితిని
చల్లగ ఎదనే దోచితివి
అ: ఏమి లేని పేదనని
నాపై మోపకు నేరాన్ని
ఆ: లేదు ప్రేమకు పేదరికం
కోరను నిన్ను ఇల్లరికం
అ: నింగినేలకు కడుదూరం
మన యిద్దరి కలయిక విడ్డూరం ॥కనులు॥

## మూగప్రేమ

**సంగీతం: చక్రవర్తి** **గానం: పి.సుశీల**

ఈ సంధ్యలో కెంజాయలో
చిరుగాలుల కెరటాలలో
ఏ మల్లి మరులెల్ల ఎగబోసెనో
ఏ రాజు ఎదలోతు చవిచూసెనో
ఈ మేఘమేరాగస్వరమో
ఆ రాగ మేమూగపదమో
ఈ చెంగు ఏ వయసుపొంగో
ఆ పొంగు ఆపేది ఎవరో
ఎవరో అది ఎవరో రెపరెప ॥ఈ సంధ్య॥
పులకించి ఒక కన్నె మనసు
పలికింది తొలి తీపిపలుకు
చిలికింది అది లేతకవిత
పాదిగింది తనలోని మమత
మదిలో మమతలో
రిమజిమ రిమజిమ ॥ఈ సంధ్య॥
నా కళ్లలో ఇల్లరికము
నా గుండెలో రాచరికము
నీదేను నీదేను నిజము
నే నుండు నీ లోన సగము
సగమే జగముగా
కలకలకల కిలకిలకిల ॥ఈ సంధ్య॥

## ప్రేమనగర్

సంగీతం : కె.వి. మహదేవన్ — గానం: ఘంటసాల

అ: తాగితే మరిచిపోగలను - తాగనివ్వదు
మరిచిపోతే తాగగలను - మరువనివ్వదు
మనసు గతి యింతే
మనిషి బ్రతు కింతే
మనసున్న మనిషికీ
సుఖము లేదంతే...
ఒకరికిస్తే - మరలిరాదు
ఓడిపోతే - మరిచిపోదు
గాయమైతే - మాసిపోదు
పగిలిపోతే - అతుకుపడదు... ॥మనసు॥
అంతా మట్టేనని తెలుసు
అదీ ఒక మాయేనని తెలుసు
తెలిసీ వలచి విలపించుటలో
తియ్యదనం ఎవరికి తెలుసు ॥మనసు॥
మరుజన్మ వున్నదో లేదో
ఈ మమత లప్పుడేమౌతాయో
మనిషికి మనసే తీరని శిక్ష
దేవుడిలా - తీర్చుకున్నాడు కక్ష... ॥మనసు॥

## మనసు - మాంగల్యం

సంగీతం : పెండ్యాల — గానం: ఘంటసాల

అ: ఎందుకు వచ్చావో
ఎందుకు వెళ్ళావో
నాకేమో తెలియదు
నీకైనా తెలుసునా
తొలికోడి కూతల్లే వినిపించి
తొలిపొద్దు వెలుగల్లే కనిపించి
తొలిజన్మ ఋణమేదో అనిపించి
తెలవని తలుపులు తెరిపించి
వచ్చింది ఎందుకో తెలిసుంటే వెళ్ళవు
వెళ్ళేది తెలిసుంటే అసలొచ్చి వుండవు
తెలియక వచ్చింది తెగిపోని బంధం
తెలిసీ నువు చేసింది తీయని గాయం
ఇల్లు వదలి వెళ్ళినదానవు - నా
కళ్ళే యిల్లుగ వున్నావెందుకు?
కన్నీటనైనా కరిగిపోరాదా
నన్నొంటిగ నా బాధ పడనీరాదా

## అబ్బాయిగారు - అమ్మాయిగారు

సంగీతం : కె.వి. మహదేవన్ — గానం: యస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

ప: తొలిచూపు చూసింది హృదయాన్ని
మరుచూపు వేసింది బంధాన్ని
ప్రతిచూపు చెరిపింది దూరాన్ని
ఇక పెళ్ళిచూపులే కలపాలి ఇద్దరిని! ॥తొలి॥
చ: ఒక చూపు తూపులా గాయాన్ని చేసింది - వే
రొక చూపు వెన్నెల మాపులా మెరిసింది
ఒక చూపు చిలిపిగా గిలిగింత లెట్టింది - వే
రొక చూపు నిలువునా గెలుచుకొని వెళ్ళింది ॥తొలి॥
చ: చూపులున్నందుకు చూసుకోవాలి
చూచుకున్నది తనది చేసుకోవాలి
వలపు మొలకెత్తేది ఒక చూపులోనే
మనసు మనసయ్యేది ఆ చూపుతోనే
చ: ఈడు జోడుగ మనిద్దరం వెలుతుంటె
ఎన్నెన్ని చూపులో ఈసుతో చూస్తాయి
తోడు నీడగ మన మేకమైనామంటె
దేవతల చూపులే దీవెనలు అవుతాయి ॥తొలి॥

## శభాష్ సూరి

సంగీతం : పెండ్యాల — గానం: ఘంటసాల. పి. సుశీల

| | |
|---|---|
| ఈ వెన్నెల | ఒకే వెన్నెల... ఆ... ఆ |
| జ - జ - జ | వలపుల వెన్నెల |
| ఈ పున్నమి వెన్నెల | జతకలిపే వెన్నెల |
| జ - జ - జ | వలపుల వెన్నెల |
| ఈనాడూ | జతకలిపే వెన్నెల |
| ఆనాడూ ఒకే వెన్నెల | అల్లరి వెన్నెల |
| ఆ... ఆ... ఈ వెన్నెల | కలలల్లే వెన్నెల... ఆ... ఆ... ॥ఈ వెన్నెల॥ |
| జ - జ - జ | ఒంటరివాళ్ళూ ఓపనిదీ |
| ఈ పున్నమి వెన్నెల | జంటకు చాలీ చాలనిదీ |
| జ - జ - జ | చెలికన్నులలో వెలిగేదీ |
| ఈ నాడూ ఆ నాడూ | చిలిపి పనులు చేయించేదీ.. ॥ఈ వెన్నెల॥ |

ఈ వెన్నెల- ఈ పున్నమి వెన్నెల
ఈనాడూ ఆనాడూ ఒకే వెన్నెల
ఈ వెన్నెల - ఈ పున్నమి వెన్నెల
ఈనాడూ ఆ నాడూ ఒకే వెన్నెల
వగపుల వెన్నెల - ఎద రగిలే వెన్నెల
కలతల వెన్నెల - కల చెదిరిన వెన్నెల ।ఈ వెన్నెల।
లైలా నవ్వులు మాపినది
మజ్ను మమతలు కూల్చినది
తారను విరహిణి చేసినది
తరతరాల బాధ ఇది.... ఈ ..... ।ఈ వెన్నెల।
జంటను కసిగా విడదీసి
ఒంటరి చేసీ వేధించినది
చెలికన్నులలో వెలుగంతా
చీకటి మబ్బుగ మార్చినది... ఈ.... ।ఈ వెన్నెల।

## కొడుకు కోడలు

సంగీతం: కె.వి. మహదేవన్ గానం: పి. సుశీల, యస్. జానకి

ఇదేనన్నమాట - ఇది అదేనన్నమాట
మతి మతిలో లేకుంది - మనసేదోలాగుంది
అంటే-
ఇదేనన్నమాట - ఇది అదేనన్నమాట
ప్రేమంటే అదొరకం పిచ్చన్నమాట
ఆ పిచ్చిలోనె వెచ్చదనం వున్నదన్నమాట
మనసిస్తే మతి పోయిందన్నమాట
మతిపోయే మత్తేదో కమ్మునన్నమాట... ॥ఇదే॥
కొత్త కొత్త సొగసులు మొగ్గ తొడుగుతున్నవి
అవి గుండెలో వుండుండి - గుబులు రేపుతున్నవి
కుర్రతనం చేష్టలు - ముద్దులొలుకుతున్నవి
అవి కునుకురాని కళ్లకు - కలలుగా వచ్చినవి ॥ఇదే॥
ఆడదాని జీవితమే అరిటాకు అన్నారు
అన్నవాళ్లందరూ అనురాగం కోరారు
తేటి ఎగిరిపోతుంది పువ్వు మిగిలిపోతుంది
తేనె వున్న సంగతే తేటి గుర్తుచేస్తుంది ॥ఇదే॥
వలపే ఒక వేదన
అది గెలిచిందా తీయన
కన్నె బ్రతుకే ఒక శోధన
కలలు పండిస్తే సాధన
మనసు మెత్తపడుతుంది - కన్నీటిలోన
మమతల పంటకదే - తొలకరివాన... ॥ఇదే॥

## జీవన తరంగాలు

సంగీతం: జె.వి. రాఘవులు గానం: ఘంటసాల

సా: పదిమాసాలు మోశావు పిల్లలను
బ్రతుకంతా మోశావు బాధలను
ఇన్ని మోసిన నిన్ను మోసేవాళ్లు లేక వెడుతున్నావు...
ప: ఈ జీవనతరంగాలలో
ఆ దేవుని చదరంగంలో
ఎవరికి ఎవరు సొంతము
ఎంతవరకీ బంధము...?
కడుపు చించుకు పుట్టిందొకరు
కాటికి నిన్నూ మోసే దొకరు
తలకు కొరివి పెట్టేదొకరు
ఆపై నీతో వచ్చేదెవరు...? ॥ఈ॥
మమతే మనిషికి బందిఖానా
భయపడి తెంచుకు పారిపోయినా
తెలియని పాశం వెంటబడి
ఋణం తీర్చుకోమంటుంది...
నీ భుజం మార్చుకోమంటుంది ॥ఈ॥
తాళికట్టిన మగడు లేడని
తరలించుకుపోయే మృత్యువాగదు - ఈ
కట్టెను కట్టెలు కాల్చక మానవు - ఆ
కన్నీళ్లకు చితిమంటలారవు - ఈ
మంటలు ఆ గుండెను అంటకమానవు ॥ఈ॥

## బడి పంతులు

సంగీతం: కె.వి. మహదేవన్ గానం: పి. సుశీల

ఆ: బూచాడమ్మా బూచాడు
బుల్లిపెట్టెలో వున్నాడు
కళ్లకెపుడు కనపడడూ
కబురులెన్నో చెబుతాడు ॥బూచా॥
గురుగురుమంటూ గోలెడతాడు
హల్లో అని మొదలెడతాడు
ఎక్కడవున్నా ఎవ్వరినైనా
పలుకరించి కలుపుతాడు ॥బూచా॥
తెలుగు, తమిళ, హిందీ, కన్నడ
భాషా భేదాలెరుగనివాడూ
కులము మతము జాతేదైనా
గుండెలు గొంతులు ఒకటంటాడూ ॥బూచా॥
ఢిల్లీ, మద్రాస్, హైదరాబాద్
రష్యా, అమెరికా, లండన్, జపాన్
ఎక్కడికైనా వెళుతుంటాడు
ఎల్లలు మనసుకు లేవంటాడు
ఒకే తీగపై నడిపిస్తాడూ
ఒకే ప్రపంచం అనిపిస్తాడు ॥బూచా॥

## శ్రీ వేంకటేశ్వర వైభవం

సంగీతం: యస్. రాజేశ్వరరావు గానం: మంగళంపల్లి బాలమురళీకృష్ణ

తెరతీయరా
తిరుపతి దేవరా ॥తెర॥
తెరతీసి నీ వెలుగు కిరణాలు ప్రసరించి
మాలోని తిమిరాలు హరియించి
మము బ్రోవరా, మా భూవరా, తెరతీయరా...
సంపంగి, చంపక పూగ పున్నాగ
పూలంగి సేవలో పొద్దంత చూడగ నీ
పైని మోహము నిత్యము సత్యమై
అహము పోదోలురా ఇహము చేదౌనురా ॥తెర॥
ఏలా లవంగాలు
పచ్చకర్పూరాలు
కలిపిన ఆకాశగంగాజలంతో
అభిషేక మొనరించు అపురూప సమయాన
నేత్రదర్శన మొసగరా - మా కళ్లు తెరపించరా ॥తెర॥
హారతిచ్చే వేళ ఆశ్చర్యమున మేము
ఎన్నెన్నొ రూపాలు మీలోన చూతుము
శివుడవు, భవుడవు, మాధవుడవు - నీవు
పరతత్వమును తెలుపరా - పరమపదమును చూపరా ॥తెర॥

RNI Regd. No.APTEL/2001/5503 HAASAM HAASYA SANGEETHA PATHRIKA Postal Regn. No. H-HD-997.



